# ఆంధ్ర వేదాంత పరిభాష






mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

ఓం

తత్సత్

# ఆంధ్ర వేదాంతపరిభాష

కూర్పరి :

**బి. వి. నారాయణస్వామినాయుడు**

51 క్లబ్బు రోడ్డు ఈస్టు

షెన్నాయ్‌నగరము

మదరాసు-30



రాజమండ్రి శ్రీ గౌతమీ జీవకారుణ్య సంఘ

ముద్రాక్షరశాలయందు ముద్రితము

ప్రథమ ముద్రణము



1962

వెల రూ. 3-50

# ★ విన్నపము ★

చిన్ననాటినుండియే వేదాంతగ్రంథములఁ జదువు అలవాటు నా తండ్రిగారినుండి నాకు సంక్రమించినది. శ్రీ సీతారామాంజనేయాది వేదాంత గ్రంథముల వారే నాచేఁ జదివించిరికూడను. వేదాంతగ్రంథములలోఁ దఱచుగఁ బరిభాషాపదముల వాడియుండుటచేఁ దక్కువచదువుఁగల నాబోటివారికి అర్థమగుట మిగుల కష్టముగనుండుననుట అతిశయోక్తి కాదు. పెద్ద పండితులకుఁ గాకున్నను సామాన్యపు చదువుగల ముముక్షుజనోపయోగముగ నుండఁగలదను తలంపుతోఁ బరిభాషాపదములను సుమారు రెండువేలవరకు సమకూర్చి ఆంధ్ర వేదాంతపరిభాషయను పేరుతో గ్రంథరూపమున వెలువరింపఁగలిగితిని. ఈ తొలికూర్పున కొన్ని తప్పులు అనివార్యముగ దొరలినవి. తప్పొప్పులపట్టికను గ్రంథముయొక్క చివరఁ జేర్చితిని. తప్పుల సవరించుకొని చదువుకొనుటకు పాఠకులఁ బ్రార్థించుచున్నాను. రెండవకూర్పు ఏర్పడినచో దిద్దుకొందును. బ్రతుకుతెరువులకుపయోగించు చదువులెన్నియో ప్రపంచమున నుండ వేదాంతగ్రంథములఁ జదివించి యా మార్గముననే నడువవలెనని నా కాదేశించిన నా తలిదండ్రులగు కీర్తిశేషులు శ్రీమతి శేషమ్మగారికిని, పూజ్యశ్రీ బొమ్మినేని వేంగమనాయఁడుగారికిని, భక్తితో నీ గ్రంథము నంకితమొనర్చుచున్నాఁడను.

ఈ గ్రంథమును గూర్చవలసిన సంక్షిప్తమార్గ మెఱిఁగించియు; దోసఁగుల సవరింపఁజేసియు, గ్రంథమునుగూర్చి తన యమూల్యాభిప్రాయముతోఁ బాఠకలోకమునకు పరిచయముఁ గావించిన గురుతుల్యులును, మాన్యులునునగు విద్వత్కవికులతిలక బిరుదాంకితులగు శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారికిని, శరీరారోగ్యము కుందువడియున్న సమయమైనను శ్రమకోర్చి గ్రంథముపై తన యభిప్రాయమును వ్రాసి యిచ్చినట్టి నిరంతరాంధ్రభాషా సరస్వత్యుపాసకులును, బహుగ్రంథకర్త

బును, రాజకీయములందు పరాకాష్ఠనందినవారును, పండితప్రకాండులును నగు భాషాభూషణ బిరుదాంకితులగు ప్రియమిత్రులు శ్రీ బూదూరు రామానుజులురెడ్డిగారికిని హృదయపూర్వక నమస్కృతు లర్పించుచున్నాఁడను.

పీడిత దీనజనులను నాదరించి రక్షించుటలో నాంధ్రదేశమునం దసమాన యశఃపుంజములలో విరాజిల్లుచుండు సేవాసంఘములందు తలమానికమై దనరారుచుండునది రాజమహేంద్రవరమందలి శ్రీ గౌతమీ జీవకారుణ్యసంఘము. ఇట్టి సంఘమున సేవకులలో నొకఁడనై నాయొపిన సేవఁజేయు భాగ్యము నాకు లభించినది. సంఘస్థాపకులగు శ్రీ కారుణ్యానందస్వాములవారు చిరకాలముగ శ్రమించి వ్రాసిన ఈ గ్రంథము ముద్రణము గాకుండుటగాంచి జాలిపడి సంఘసభ్యుల అనుమతితోఁ దమ స్వంత ముద్రాక్షరశాలలో ముద్రింపించి తమ సేవకుఁడగు నన్ను బహూకరించిరి. ఉదారమనస్కులగు స్థాపకులు, అధ్యక్షులు, ఉపాధ్యక్షులు, కార్యదర్శులు, సభ్యులందఱికిని నాయొక్క భక్తిపూర్వక కృతజ్ఞతాంజలుల నర్పించుచు వీరెల్లరికి సమస్తశుభముల నొసఁగవలెనని సర్వలోక శరణ్యుడగు శ్రీకృష్ణభగవానుని ప్రార్థించుచున్నాను. ఈ గ్రంథముయొక్క సమస్తహక్కులు గ్రంథకర్తవి.

ఇట్లు,

సుజనవిధేయుఁడు

బొమ్మనేని నారాయణస్వామినాయఁడు

# ★ పండితాభిప్రాయములు ★



ఆంధ్ర కంబరామాయణము, కుమారసంభవము, మణిమేఖల, శివభక్త (పెద్ద) పురాణము మున్నగు పెక్కు గ్రంథముల రచించిన ప్రసిద్ధ కవిపుంగవులగు విద్వత్కవికుల తిలక పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారి యభిప్రాయము:

ఈ ఆంధ్ర వేదాంతపరిభాషను కూర్చినవారు నా చిరమిత్రులు, జిజ్ఞాసువులు, ముముక్షువులు కావుననే దీనిని బహుగ్రంథ పరిశోధన ఫలితము రూపొందించఁగలిగిరి. వీరు సేకరించ పరిభాష చాల ముఖ్యమైనది. వేదాంతగ్రంథములు చదువువారికిది మిక్కిలి యుపకరింపఁగలదు. వీరిదివఱకే " ఉపేంద్రశతకము " మున్నగు కొన్ని గ్రంథముల వ్రాసి చేయి తిరిగినవారు, కావుననే ముచ్చటగా ముక్తసరిగా కూర్పగలిగిరి.

పూతలపట్టు
శుభకృదాశ్వయుజ
బహుళసప్తమి
20–10–1962



పూతలపట్టు శ్రీరాములురెడ్డి

రత్నాబాయి, వీరగాంధర్వము, మోహన, రంతిదేవుఁడు మున్నగు బహుళ గ్రంథకర్త లగు భాషాభూషణ శ్రీ బూదూరు రామానుజులురెడ్డిగారి యభిప్రాయము:

" ఆంధ్ర వేదాంతపరిభాష " అను ఈ వేదాంతపదకోశమును ఎక్కువ ఆసక్తితో దీక్షతో చదివి చూచితిని. ఇద్దానిని కూర్చి వెలయించిన శ్రీ బొమ్మినేని నారాయణస్వామినాయుఁడుగారు నాకు చిరకాలమిత్రులు. శ్రీ నాయుఁడుగారు వారి వ్యవహారదశనుండి సాంఘికముగ, రాజకీయముగ, దేశమునారాధించి ప్రజాసామాన్యమునకు ఉజ్వల ప్రబోధములతో ఊడిగముచేసిన నిష్కామ్య యోగులు. అంతేకాదు భారతదేశమాత దాస్యశృంఖలముల విచ్ఛేదనమునకు సత్యాగ్రహోద్యమమున పాల్గొని కఠిన చెరసాలావాస మనుభవించిన గాంధి భక్తులుకూడ.

అట్టివీరు ఈవఱకే తమ కవితతో " ఉపేంద్రశతకము " దేశభక్తి గీతములు వేదాంతవిషయికమైన వ్యాసరాజము లాదిగాగలవి అనేకములు రచించి ఉత్తమ పండితులు, సాధకులు అనిపించుకొన్నారు. ఈనాడు శ్రీ నాయుఁడుగారు ఉపనిషత్తులు బ్రహ్మసూత్రములు వేదాంతాది బహు గ్రంథములను పరిశోధించి ఉత్తమోత్తమముగ ఈ పరిభాషను వేదాంత గ్రంథపాఠకులకు కరదీపికగ వెలయించిరి. వీరి ఈ కృషి బహుదా ప్రశంసనీయమై. సార్థకమై ఒప్పుచున్నది.

శ్రీ నారాయణస్వామినాయుఁడుగారు ఇంకను ఇట్టి ఉత్కృష్టమైన గ్రంథరాజములు పెక్కులు రచించుటకు తగిన ప్రోత్సాహమును వేదాంతవేత్తలు సాహితీప్రియులు కల్పింతురుగావుతమని అభ్యర్థించుచున్నాఁడను.

తిరుత్తని
22-10-1962

బూదూరు రామానుజులురెడ్డి

ఓం

శ్రీరస్తు

# ఆంధ్ర వేదాంత పరిభాష

అ— ఓంకారముయొక్క ప్రథమపాదము. తొలుత నాదమైనది పరమేశ్వర శక్తి నుండి యుద్భృతమందినస్వరములలో నాద్యస్వరమగు ప్రథమాక్షరము. బ్రహ్మ, విష్ణువు, రుద్రుఁడు.

అకారప్రణవము— పదివేల యవ యవములతోఁగూడిన ప్రణవము. (అకారశ్చాయుతావయవాన్విత)

అకృతాభ్యాగమము— తాఁజేయనిదే యనుభవమునకు వచ్చుట.

అక్రోధనుఁడు— కోపము లేనివాఁడు.

అఖండము— సదా వెలిగెడి దీపము, ఖండముకానిది. సమస్తము.

అగ్ని— అన్నింటికిని తుది దియగు ముక్తిని బొందించువాఁడు. (అగ్రంనయతీత్యగ్నిః) శబ్ద, స్పర్శ, రూపములను మూఁడు గుణములుగల భూతము. రూపలక్షణముఁ గలది, జ్ఞానేంద్రియములలో చక్షువులు, కర్మేంద్రియములలో పాదములు, వాయువులలో నుదానము, ఉపవాయువులలోదేవదత్తము, స్వరవ్యంజనాక్షరములలో ఇ ఈ ఐ ఖ ఛ ఠ థ ఫ ర స లు అగ్ని సంబంధము లగును.

అగ్నికళాదశకము— ధూమ, అర్చి, ఉష్ణ, జ్వలనీ, జ్వాలినీ, విస్ఫులింగినీ, సుశ్రీ, సురూప, కపిల, హవ్యకవ్యవహ అను జ్వాలలు.

అగ్నిజిహ్వాసప్తకము— కాళి, కరాళి, మనోజవ, సులోహితా సుధూమ్రవర్ణ, స్ఫులింగిని, విశ్వరుచి అనునవి.

అగ్నిదివ్యము—జలదివ్యమునుజూడుఁడు.

అగ్నిబీజము— రం, అను నక్షరము.

అగ్నిహోత్రము— ఆధాన పూర్వకముగా వేదికయందు స్థాపించెడు త్రేతాగ్నులు.

అఘమర్షణస్నానము— అఘమర్షణ మనఁగా పాపమునుబోఁగొట్టునదియని యర్థము. ఋగ్వేదమున నొక సూక్తమునకు పేరు. ఈ మంత్రమును మూఁడు మారు లుచ్చరించుట చేత సమస్తపాపములు నశించును, దీనిని జపించుచుచేయు స్నానమునకే యఘమర్షణ స్నానమని పేరు.

అచలము— పరబ్రహ్మము, చలనము లేనిది, కొండ, భూమి.

అచ్యుతుఁడు— పరబ్రహ్మము, విష్ణువు, తన స్థానమునుండి జారనివాఁడు.

అజ— ప్రకృతి.

అజగరసమాధి— కొండచిలువ యను పాము తనయాహారమునకై ఉన్నచోటు నుండి కదలక విధివశాత్తుగా తన చెంత కరుదెంచు ప్రాణులంబట్టి తిను నట్లు, నిరంతర సమాధి మగ్నుండగు పుణ్యశీలుఁడు తాను జాగ్రదవస్థకు

వచ్చినపుడు క్షుధోపశమనమునకై పరులనర్థింపకయు శిష్యులు, భక్తులు మున్నగువారొసంగెడి యాహారమైనను, నిర్జన ప్రదేశమగుచో నా సమయమునకు నచట చిక్కిన కాయలు, పండ్లు, దుంపలు, ఆకులు, నీరు మున్నగు వానినైనను భక్షించి క్షుత్పిపాసల దీర్చికొని పూర్వపు రీతిగా సమాధి యందుండు పద్ధతి.

అజప— జపింపకయే జపించు పద్ధతి. సగము అడపోలిక, సగము మగ పోలికఁ గల యాకృతి.

అజపాగాయత్రి— గాయత్రీఛందస్సుతో రచింపంబడినహంసమంత్రము. దీనిని మహా విద్యయని యుపనిషత్తులు పలుకుచున్నవి. ఈ మంత్రమును వాచాజపించకశ్వాసతోఁగలిపి జపించఁబడుట వలన నజపనయనఁబడుచున్నది.

అజపుఁడు— అవైదిక గ్రంథములఁజదువు వాఁడు.

అజహల్లక్షణ—ప్రస్తాపింపఁబడిన పదార్థమును సంపూర్ణముగ విడువక తత్సంబంధియగు పదార్థమును గ్రహించుట.

అజాండము— బ్రహ్మాండము.

అజితుఁడు—జయింపరానివాఁడు. బ్రహ్మ, విష్ణువు, శివుఁడు.

అజుఁడు— బ్రహ్మ, విష్ణువు, శివుఁడు, మన్మథుఁడు.

అజ్ఞానము— తెలివిలేమి. అగ్నియందుష్ణముజలముశీతలమువలెబ్రహ్మమునందు జీవుని, జగత్తును, ఈశ్వరునిఁ గలుగఁజేయు మూలప్రకృతి.

అజ్ఞాన సప్తభూమికలు—బీజజాగ్రము, జాగ్రము, మహాజాగ్రము, జాగ్రత్స్వప్నము, స్వప్నము, స్వప్నజాగ్రము, సుషుప్తులు.

అణిమసిద్ధి— సంకల్ప మాత్రముచేత ప్రకృతిని నశింపఁజేయుట వలనఁ బరమాణువువలెఁ దన శరీరమును సూక్ష్మముగఁ జేసికొనఁగల తపస్సిద్ధి.

అణువు— గృహములయందు వ్యాపించు సూర్య కిరణములలోఁ గనఁబడుచుండు సూక్ష్మతమరేణువులలో నారవ భాగము లేక ఎనిమిదవ భాగము. (జాలకాంతమరీచస్థం యచ్చసూక్ష్మతరంరజః తస్యషష్టాష్టమోభాగస్త్వణురిత్యభిధీయతే.) స్వల్పము. చిఱువడ్లు ఇప్పుడు ఇంకను సూక్ష్మతమముగ నణువును గ్రహించియున్నారు.)

అతద్వ్యావృత్తిరూపసమాధి—సకల పదార్థములనునిషేధించుటయే స్వరూపముగఁగల నిరుపాధిక స్వరూపావస్థ. శుద్ధ బ్రహ్మానంద స్వరూప సమాధి.

అతిక్రాంత భావనీయుఁడు—మధుమతి యను జ్ఞానభూమికయందుండు వాఁడు.

అతిగ్రహములు—అపానము, నామము, రసన, రూపము, శబ్దము, ఇచ్ఛ, కర్మము, స్పర్శలు.

అతివర్ణాశ్రమి—సన్యాసికంటె శ్రేష్ఠుడు. ఎవరికినీ శిష్యుఁడుకాని యుత్కృష్టుఁడు, అవధూత.

అతివాది— సత్యము నాధారముగఁ గొని మిక్కిలి వాదించువాఁడు.

అతివాసము—శ్రాద్ధదినమునకుముందు దినముచేయు ఒక్క ప్రొద్దు.

అతివ్యాప్తిదోషము— ఒక లక్ష్యమునకుఁ జెప్పఁబడిన లక్షణము వేరొక లక్షణమునకును నుండుట. ఉదా॥ అవు కొమ్ములుగలది యనినచో వేరు జంతువునకును కొమ్ములు కలవు కావున లక్షణము అసందిగ్ధము కాదు.

అతిశూన్యము— విశుద్ధాకాశము.

అత్యంతాభావము— ఉత్పత్తినాశము లేకుండుట.

అథ— మంగళము, అనంతరము, ఆరంభము, ప్రశ్న, అంతయు. ఈ శబ్దము పూర్వము బ్రహ్మయొక్క కంఠమును భేదించుకొని వెడలినది గాన ఓంకారమున్ను అథశబ్దమున్ను మంగళప్రదము లందురు.

అద్వయానందము— బ్రహ్మము సత్య మనియు, నామ రూపాత్మక ప్రపంచము అసత్యమనియుఁ దోచుటచేతఁ గలిగెడి యానందము.

అద్వయుఁడు— తనకు సాటిలేనివాఁడు, దేవుఁడు.

అద్వంద్వుఁడు— తత్త్వజ్ఞుఁడు, నిస్సంగుఁడు.

అద్వైతమతము— జీవ బ్రహ్మలకు నైక్యమును ప్రతిపాదించుచు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలు ప్రమాణముగఁ జూపి శ్రీ శంకరాచార్యులవారిచే ఉద్ధరింపఁబడిన మతము. జీవేశ్వరులకైక్యము జెప్పెడి మతము. రెండవది లేనిది. ఏకము.

అధమకుంభకము— చెమటలు దిగ పోయునట్లు శ్వాసను కుంభించుట. "ప్రస్వేదం జనయేద్యస్తు ప్రాణాయామోహిసోఽధమః"

అధమవృత్తి— గురువులు కోపించి చెప్పినపుడు మాత్రమాపనిఁజేయుట.

అథర్వణ వేదోపనిషత్తులు—

ప్రశ్నోపనిషత్తు, అథర్వశిఖోపనిషత్తు, నృసింహతాపిన్యుపనిషత్తు, శరభోపనిషత్తు, రామతాపిన్యుపనిషత్తు, అన్నపూర్ణోపనిషత్తు, పాశుపతోపనిషత్తు, దేవ్యుపనిషత్తు, గణపత్యుపనిషత్తు, కృష్ణోపనిషత్తు, ముండకోపనిషత్తు. అథర్వశిరోపనిషత్తు, నారదపరివ్రాజకోపనిషత్తు, మహానారాయణోపనిషత్తు, శాండిల్యోపనిషత్తు, సూర్యోపనిషత్తు, పరబ్రహ్మోపనిషత్తు, భావనోపనిషత్తు, మహా వాక్యోపనిషత్తు, హయగ్రీవోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు, బృహజ్జాబాలోపనిషత్తు, సీతోపనిషత్తు, రామ రహస్యోపనిషత్తు, పరమహంసపరివ్రాజకోపనిషత్తు, ఆత్మోపనిషత్తు, త్రిపురాతపనోపనిషత్తు,

భస్మజాబాలోపనిషత్తు, గోపాలతపనోప నిషత్తు, దత్తాత్రేయోపనిషత్తు, గారుడానాం అథర్వణోపనిషత్తు.
[ వెరశి ముప్పది యొకటి ]

అథర్వము— ప్రాణము. (ప్రాణోవా అథర్వా)

అథర్వవేదము— బ్రహ్మవేదము. ఈ వేదము ఇరువది కాండలుగ విభజింపఁబడి యున్నది. బహ్మయను ఋత్విక్కు అవశ్యమెఱుంగ వలసిన విధి యీ వేదము నందుఁగలదు కావున నీ వేదమునకు బ్రహ్మవేదమని పేరుగల్గెను. ఇతర వేదములకంటె శాంతి పౌష్టిక కర్మలీ వేదమునం దధికముగఁ గలవు. ఈ వేదబ్రాహ్మణ గ్రంథమునకు గోపద బ్రాహ్మణమని పేరు.

అధికరణపంచాంగములు— బ్రహ్మసూత్రాది భాష్యోక్తములగు విచారణ చేయఁదగిన ప్రస్తావ విషయము నకు = విషయమనియు; సంశయము నకు = విశయమనియు; ఆక్షేపణకు = పూర్వపక్షమనియు; తన యభిప్రాయమును తగు ఆధారములతో స్థిరీకరించుటకు = సిద్ధాంతమనియు; ఇప్పిదమునకు = సంగతమనియుఁ జెప్పఁబడు ఐదు అంగములు.

అధికరణము— విషయ నిర్ణయ స్థానము, అధారము.

అధికారి— బ్రహ్మోపదేశమునకు అర్హుఁడు.

అధిదేవత— ఒక స్థానమునకు నధికారిగా నియమింపఁబడిన దేవత.

అధిభూతము— పంచ భూతములలో నెక్కువ భాగముఁగలది.

అధిష్ఠాత— ముఖ్యుఁడు.

అధిష్ఠానము— ఆక్రమించుట. ప్రభావము. అధారము.

అధోముఖాసనము— కపాలాసనము.

అధోరేతస్కుఁడు— అజితేంద్రియుఁడు.

అధోక్షజుఁడు— విష్ణువు, ఇంద్రియ జన్య జ్ఞానమునునధఃకరించినవాఁడు.

అధ్యయనము— గురుముఖముగఁ జదువుట.

అధ్యవసాయము— ఉత్సాహము, పూనిక, శ్రద్ధ.

అధ్యాత్మ— పరమాత్మ, జీవాత్మ, శరీరము ననుసరించి తెలిసి కొనఁదగిన ప్రత్యగాత్మ.

అధ్యాత్మ ప్రసాదము— లోకములో నిదివరకుఁ గలిగియున్న సకల వ్యాపారములున్ను ఒక్కమారుగఁ దన యాత్మలో స్ఫురించుట.

అధ్యారోపము— ఒక వస్తువునందు మరియొక వస్తువు నారోపముఁ జేయుట.

**అధ్యాస**— ఒక వస్తువునుఁ జక్కఁగఁ జూడ కుండుట వలన మఱియొక వస్తువుగఁ దలంచుట. (భ్రాంతి)

**అనభ్యుపగత ప్రారబ్ధము**— శరీరాంతరమునందు ననుభవింప వలసిన ప్రారబ్ధ భాగము.

**అనవచ్ఛిన్నము**— ఆవరణ రహిత పరిపూర్ణ వస్తువు.

**అనాత్మ**— నామరూపాత్మకమైన ప్రకృతి.

**అనామయము**— రోగము లేనిది,

**అనామిక**— పేరులేనిది. పవిత్రంపువ్రేలు లేక ఉంగరపువ్రేలు, వంగనిది.

**అనావృత్తి**— జన్మరాహిత్యము.

**అనాశకాయనము**— బ్రహ్మచర్యము.

**అనాహతచక్రము**— షడాధారచక్రములో హృదయస్థానమున నెనిమిది దళములుకలిగిన చక్రము.

**అనిరుద్ధము**—అహంకారము. అడ్డగింపఁబడినది.

**అనుజ్ఞాత**— స్వప్నయుతుఁడగు బ్రహ్మవేత్త.

**అనుజ్ఞానుతానుజ్ఞాత**— స్వప్నములో స్వప్నముననున్న బ్రహ్మవేత్త.

**అనుజ్ఞాతావికల్పుఁడు**— స్వప్నతురీయ తుఁడగు బ్రహ్మవేత్త.

**అనుజ్ఞైకరసానుజ్ఞాత**— సుషుప్తిలో స్వప్నముననున్న బ్రహ్మవేత్త.

**అనుజ్ఞైకరసావికల్పుఁడు**— సుషుప్తిలోఁ దురీయముననున్న బ్రహ్మవేత్త.

**అనుజ్ఞైకరసానుజ్ఞైకరసుఁడు**— సుషుప్తిలో సుషుప్తియుతుఁడగు బ్రహ్మవేత్త.

**అనుజ్ఞైకరసుఁడు**— సుషుప్త్యవస్థలో నున్న బ్రహ్మవేత్త.

**అనుజ్ఞైకరసోత**— సుషుప్తి జాగ్రమున నున్న బ్రహ్మవేత్త.

**అనుపలబ్ధి**— అభావము.

**అనుబంధచతుష్టయము**— అధికారి, విషయము, ప్రయోజనము, ఫలము.

**అనుభావము**— నిశ్చయము, ప్రభావము మాహాత్మ్యము.

**అనుభూతి**— అనుభవము (ప్రత్యక్షాది ప్రమాణజన్యజ్ఞానము.)

**అనుమానప్రమాణము**— ఒకగుర్తును బట్టి దానితో సంబధించిన వస్తువును ఊహించుట. ఉదా: పొగనుగాంచి నంతనే యగ్గియున్నదని యూహించుట. గురుతించిన వస్తువును లింగమనియు, ఊహించిన వస్తువును లింగి యనియుజెప్పంబడును.

**అనువిద్ధము**— సంబంధించినది.

**అనువృత్తి**— హారములోని దారమట్లు అంతటను నెడతెగకనుండుట.

**అనుశయము**— స్వర్గాదిభోగములందు అనుభవింపఁగా మిగిలియున్న కర్మ ఫలకించిత్ శేషము.

**అనుశ్రవవిషయము**— లోకాంతర (స్వర్గాది) ఆముష్మికభోగములు.

**అనుషంగము**— చేరిక.

**అనుష్ఠానము**— ఆచారము, నడవడి.

**అనుష్టుప్పు**— వాక్కు. ఎనిమిదియక్షరములుగల ఛందస్సు.

**అనుసంధానము**— కూర్పు.

**అనుస్మరణము**— తలంపు.

**అనృతము**— దబ్బర.

**అనుమానము**— అంతయు,వెలితిలేనిది.

**అనంత**— భూమి, పార్వతి; గరికగడ్డి.

**అనంతము**— ఓంకారము, ఆకాశము, తుదలేనిది, నిరుపాధికము, ఆవరణ లేని చిన్మాత్రస్వరూపము, ఉత్పత్తి నాశరహితము. తలయందును తోఁకయందును శ్వేతపద్మచిహ్నముఁగల నప్పవిశేషము.

**అన్నమయకోశము**— షడ్భావవికారసమన్వితమై, అన్నరసమువలన నుత్పత్తియై, దానివలననే పోషింపఁబడు స్థూలశరీరము. అన్నముచేఁగలుగు కార్యములయొక్క కూటమి అన్నమయకోశమనంబడును. (అన్నకార్యాణాం సమూహోఽన్నమయకోశః)

**అన్యోన్యాభావము**— చీకటియందు వెలుఁగు, వెలుఁగునందు చీకటి, అప్పుడేయుత్పత్తి, నాశముకల్గుట.

**అపగతము**— పోయినది. మృతము.

**అపఘనము**—శరీరము అవయవములు.

**అపరవిద్య**— పరమేశ్వరుని కన్యథా తెలుపువాక్యములు. ధర్మాధర్మములను, తత్ఫలములను, బోధించునట్టి వేదచతుష్టయము, తదంగషట్కము. (తత్రాపరాఋగ్వేదోయజుర్వేదస్సామవేదోఽథర్వవేదశ్శిక్షా-వ్యాకరణం నిరుక్తంఛందోజ్యోతిషమితి.)

**అపరాప్రకృతి**— అష్టమూర్తులు లేక అష్టప్రకృతులు. పరబ్రహ్మమును విడచి జగత్తును చూపించునది.

**అపరిచ్ఛిన్నము**— పూర్ణమైనది.

**అపరుఁడు**— ప్రత్యగాత్మరూపమున నుండువాఁడు.

**అపరోక్షజ్ఞానము**— తానే బ్రహ్మమనెడి దృఢనిశ్చయము. పరమాత్మ ప్రత్యగభిన్నమైనదనెడి జ్ఞానము.

**అపర్యాప్తము**— అమితము, అతృప్తి.

**అపవర్గము**— మోక్షము.

**అపవర్జనము**— ఈవి, మోక్షము.

**అపవాదయుక్తి**— అధ్యారోపమునకు. వ్యతిరేకము.

**అపానవాయువు**— గుదస్థానమున సంచరించెడు వాయువిశేషము.

**అపానాసనము**— మూలమునందలి వాయువునులేపి వ్యాపింపఁజేసి ప్రయత్నముచేత నొకపాదమును భుజముపైనుంచి మరియొక పాదమును నేలయందుమోపి నిలిచియుండుట. లోని కపీల్చుచుఁయుండవలెను.

**అపునర్భవము-** మోక్షము.

**అపూర్వత-** షడ్విధ లింగములలో నొకటియగు నితరశాస్త్రములచేతనే బోధయగు విషయము.

**అపూర్వము-** యజ్ఞమునందు వేల్వఁబడిన హోమద్రవ్యములు హుతమైన పిదప పొందియుండు సూక్ష్మరూపము.

**అపూర్వవాది-** మీమాంసకుఁడు.

**అప్పుబీజము-** వం యను నక్షరము.

**అప్రతర్క్యము-** మనోవాక్కులచేతఁ దెలియనశక్యమైనది.

**అప్రతిసంఖ్యానాశము-** స్వయముగనే కలుగు నాశము.

**అప్రమేయము-** మితిఁజెప్ప వీలుకానిది. వర్ణింపనలవికానిది.

**అబిందువు-** ఓత్వస్వరూపము.

**అభవుఁడు-** పుట్టుకలేనివాఁడు, శివుఁడు పరమాత్మ.

**అభావచతుష్కము-** ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అన్యోన్యాభావము అత్యంతాభావము.

**అభిక్రమనాశము-** ఆరంభించి మానుకొనుటచేఁ గలుగు దోషము.

**అభిధేయము-** అభిధానముచే సూచింపఁబడువస్తువు.

**అభినవక్లేశము-** సంసారము దానికి కారణమైన మనస్సుచేఁ గలుగు చింత.

**అభిమానము-** అహంకారవృత్తి.

**అభివాదనము-** గోత్రనామములఁజెప్పి మ్రొక్కుట.

**అభివ్యంగ్యాచిచ్ఛక్తి-** చిద్రూప పురుషునకు నతిసమీపమందుండి తత్సాన్నిధ్యముచే నభివ్యక్తమైన చైతన్యముఁగల చిత్తముయొక్క శుద్ధ సత్త్వభాగము.

**అభ్యాసము-** షడ్విధలింగములలో నొకటి. ప్రకరణ ప్రతిపాద్యమగు విషయమును ప్రకరణమధ్యమందు పలుమారు లుదహరించుట.

**అభ్యుత్థానము-** ఎదుర్కొనలేచుట.

**అభ్యుపగతప్రారబ్ధము-** వర్తమాన శరీరమున ననుభవింపవలసిన ప్రారబ్ధ భాగము.

**అమనస్కము-** తారక, సాంఖ్యయోగములనభ్యసించిన మీదఁగలుగుసిద్ధియగు ఉన్మన్యవస్థ. మనస్సులేనిది.

**అమరవారుణి-** నాలుకను పైభాగమున నున్న అంగిటియందు ప్రవేశింపఁ జేయుటవలనఁ గలుగు సుష్టముచేత ఎడమకనుబొమ ప్రక్కనుండు చంద్రునియొద్దనుండి స్రవించురసము. శివజలము, కల్లు.(లంబికాయోగము)

**అమరి-** ఉష:కాలమున నిద్రలేవగానే మూత్రించునపుడు మొదటితుది భాగముల వదలిపెట్టి మధ్యభాగమగు మూత్రము అమరవారుణి.ఇది కాపాలి

కుల సంప్రదాయము. (నిషేవ్యతే కేవల మధ్యాధారా కాపాలికైర్యోగి వరైఃకుమార్యాః) కుమారియనఁగ మనుష్యుని మూత్రము.

**అమర్షము-** గౌరవమును తక్కువఁ జేయుట, అవమానముఁగల్గించుట, మున్నగువానిచేఁ గలుగు క్రోధము. ఓర్వలేనితనము.

**అమావాస్యదృష్టి-** మనోగత లక్ష్యమును కనులుమూసికొని మనస్సుతోఁజూచునట్టి గాఢనిమిలిత దృష్టి.

**అమీ-** పరమాత్మ.

**అమూర్తములు-** వాయువు,ఆకాశము. రూపము కానరానివి.

**అమృతము-** యజ్ఞశేషమగు భోజనము నీరు, పాలు, సుధ, మోక్షము.

**అమృతాశీ-** భృత్యవర్గము భుజించిన వెనుకఁగుడుచువాఁడు. అమృతమును భుజించువాఁడు.

**అయమాత్మాబ్రహ్మ-** ఈయాత్మయే బ్రహ్మమని తెలుపు అథర్వణవేద మంచలి మాండూక్యోపనిషత్తులోని మహావాక్యము.

**అరణ్యము-** అడవి, అరణియందు బుట్టినది.

**అరణ్యాయనము-** బ్రహ్మచర్యము.

**అరములు-** బండియాకులు.

**అరిషడ్వర్గము-** కామ, క్రోధ, లోభ, మోహ. మద, మాత్సర్యములు.

**అరూపమనోనాశము-** కాలిపోయిన బట్ట మడతతో వస్త్రమువలెఁ గాన్పించినను, గాలిచే నెగురఁగొట్టబడినచో రూపము లేకపోవునట్లు, జ్ఞానాగ్నిచేఁ గాల్చివేయఁబడిన సూక్ష్మకారణ శరీరములుగల బ్రహ్మవేత్త ప్రారబ్ధాంతమున బ్రహ్మమందైక్యమగుట. దీనికే లింగభంగమని పేరు.

**అర్ఘ్యము-** పూజకుఁదగిన జలాది సామగ్రులు.

**అర్చిరాదిమార్గము-** దేవయానము.

**అర్థపంచకము-** 1 జీవము,బ్రహ్మము, ఉపాయము,పురుషార్థము, విరోధము. 2 స్వస్వరూప, పరస్వరూప, పురుషార్థస్వరూప, ఉపాస్యస్వరూప, విరోధి స్వరూపములు.

**అర్థవాదము-** ప్రకరణముచేఁ బ్రతిపాదింపఁబడిన యంశమునుగూర్చి యచ్చటచ్చటఁ జేయఁబడినస్తుతి. షడ్విధలింగములలో నొకటి.

**అర్ధమాత్ర-** ఓంకారముయొక్క చతుర్థపాదము. క్, ఖ్, గ్, మున్నగు స్వరములు చేరనిహల్లుల నుచ్చరింపఁగలకాలము. (వ్యంజనం త్వర్ధమాత్రకం)

**అర్ధమాత్రాప్రణవము-** అంతములేని అవయవాకారముఁగలది. కేవల పరబ్రహ్మమునే తెలుపునది.
(అర్ధమాత్రాప్రణవోఽనంతావయవాకారః)

**అర్ధశవాసనము-** వీరాసనము.

**అర్ధకాసనము-** రెండుకాళ్ళను భూమియందుంచి, పిఱుదులనుక్రింద మోపియైనను మోపకనైనను మోకాళ్ళమీద శిరస్సునుంచి, మోకాళ్ళను రెండుచేతులతోఁ జుట్టి పట్టుకొనుట.

**అరాసనము-** వీరాసనము యొక్క పర్యాయనామము.

**అర్చిమత్-** అదిత్యాది పదార్థములఁ బ్రకాశింపఁజేయువాఁడు.

**అలాబుపాత్రము-** సొరకాయబుఱ్ఱ.

**అలింగము-** ప్రధానతత్త్వము.

**అలింగసన్న్యాసము-** దండకమండలాదులుంచుకొనకుండు సన్న్యాసము.

**అలోకకల-** ప్రకృత్యతీతమగు తుర్యతుర్యమనెడి పదియాఱవకళ.

**అవచ్ఛిన్నము-** విశేషణాదులచేఁ బ్రత్యేకింపఁబడినది. ఉపాధియున్నగు వానిచేఁ దక్కినవానినుండి విశేషితమైనది.

**అవతారపురుషులు-** ప్రపంచమున ధర్మమునకుగ్లాని సంభవించి అధర్మము హెచ్చినపుడు ధర్మసంస్థాపనార్థమై నిత్యవిభూతి ననుభవించుచుండెడి మహాత్ములు భగవదంశమును తోడుగాఁగొని కాని, లేక స్వయముగఁ గాని, భూమియందవతరించి ధర్మోద్ధరణఁగావించు పుణ్యపురుషులు.

ఈయవతారములందు కపిల, వ్యాసాద్యంశావతారములు, పరశురామాద్యావేశావతారములు, మత్స్యకూర్మాది కళావతారములు, నృసింహ శ్రీరామకృష్ణాది పరిపూర్ణావతారములని భేదములుగలవు.

(నృసింహరామకృష్ణేషు షాడ్గుణ్యం పరిపూరితం అంశాంశాస్తథావేశః కలా పూర్ణప్రకథ్యతే వ్యాసాద్యైశ్చస్మృతః కృష్ణః పరిపూర్ణతమఃస్వయమ్)

**అవధారణము-** శ్రద్ధతోవినిగ్రహించుట.

**అవధూత-** అవధూతయనుపేరు పుటాక్షరములచే నెఱుఁగఁదగినది. (అక్షరత్వాత్ వరేణ్యత్వాత్ ధూతసంసారబంధనాత్, తత్త్వమస్యాదిలక్ష్యత్వాత్ అవధూత ఇతీర్యతే) అక్షరత్వము, వరేణ్యత్వము, ధూతసంసారబంధము, తత్త్వమస్యాది లక్ష్యత్వముఁగల మహాపురుషుఁడు.

**అవభృథము-** యజ్ఞాంతస్నానము.

**అవశిష్టము-** మిగిలినది. శేషము.

**అవశిష్టలింగములు-** దశేంద్రియములు. పంచతన్మాత్రలు.

**అవసథము-** ఇల్లు.

**అవస్థలు-** భూమికలు, సమయములు.

**అవస్థాత్రయము-** జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు.

**అవాంతరవాక్యములు-** జీవేశ్వరభేదనిరూపణ కలవి అనగా తత్పదార్థస్వరూపమునుగాని, త్వంపదార్థస్వరూపమునుగాని తెలుపువాక్యములు. (స్వరూపబోధకం వాక్య మవాంతవాక్యమ్)

**అవికల్పానుజ్ఞాత-** తురీయస్వప్నయుతుఁడగు బ్రహ్మవేత్త.

**అవికల్పానుజ్ఞైకరసుఁడు-** తురీయసుషుప్తియందున్న బ్రహ్మవేత్త.

**అవికల్పావికల్పుఁడు**- తురీయములోఁ దురీయముననున్న బ్రహ్మవేత్త.

**అవికల్పుఁడు**- తురీయావస్థయందున్న బ్రహ్మవేత్త.

**అవికల్పోత**- తురీయజాగ్రముననున్న బ్రహ్మవేత్త.

**అవిజ్ఞేయము**- ప్రమాణములచేతఁదెలియరానిది.

**అవిద్య**- జీవునితోఁగూడిన మూల ప్రకృతి.

**అవిద్యాక్లేశము**- నేను జీవుఁడనని నిర్ణయించుట. అవిద్య, రజోగుణము.

**అవిద్యావృత్తులు**-తమస్సు. మోహము, మహామోహము, తామిస్రము, అంధతామిస్రము.

**అవ్యక్తము**- స్పష్టముకానిది. బీజగణితము, మూలావిద్య, ఇంద్రియములకు గోచరింపనిది.

**అవ్యయము**- నాశములేనిది.

**అవ్యాకృతము**- నామరూపములతో వెలువడినది. ప్రపంచమును సృజింపవలయుననెడి ఇచ్ఛాశక్తి.

**అవ్యాప్తిదోషము**- ఒక లక్ష్యమునకుఁ జెప్పఁబడిన లక్షణము నాలక్ష్యము యొక్క యేకదేశమందు లేకుంటుట. ఉదా॥ ఆవు కపిలవర్ణముఁగలది యనుట.

**అశ్వత్థము**- రేపునిలుచునను నిశ్చయములేదు కావున నశ్వత్థమనఁబడును, (నశ్వఃఅపిస్థాస్యతీతి అశ్వత్థః) రావిచెట్టు, సంసారము, అశ్వరూపమగు అగ్నిని ధరించియుండునది.

**అశ్వమేధము**- అగ్నియందు నేయిని పోసివ్రేల్చుట. [అగ్నిర్వా అశ్వః ఆజ్యంమేధః. శతపథబ్రాహ్మణములోని వాక్యము.] ఇందుకు భిన్నముగ పూర్వప్రభువులు దిగ్విజయమునకై యశ్వమునుదెచ్చి పూజించి పిమ్మట కొంత అసహ్యకరమైన తంతుజరుపుచుండినట్లు తెలియుచున్నది. ఉదాహరణముగ హరివంశమున జనమేజయుని అశ్వమేధమున జరిగిన విషయమును జూచి రాజు కోపించి భార్యను బహిష్కరించుటయు, ఆతంతునడిపిన బ్రాహ్మణులను దేశభ్రష్టులఁగావించుటయు కాననగును మరియు శృంగారనైషధమున అ. 7 పద్యము 133 నందు యజమాన ప్రమదావికస్వర ........ అనుదానిని నీతివర్తను లెవ్వరును నామోదింపరు. కావుననే స్వామి దయానంద సరస్వతిగారు తీవ్రముగ ఖండించిరి.

**అశస్త్రవధ**- యోగ్యుఁడగువానియందు లేనిదోషమును కల్పించి చెప్పుట.

**అష్టకర్మలు**- వశ్యము, మారణము, స్తంభనము, మోహనము, విద్వేషణము, ఉచ్చాటనము, ఆకర్షణము, ఆవేశము.

**అష్టకష్టములు**- ఋణము, యాచన, వృద్ధత్వము, జారత్వము, చోరత్వము, దారిద్ర్యము, రోగము, భుక్తశేషమును భుజించుట.

**అష్టగణపతులు**- లక్ష్మీగణపతి,

క్షిప్రగణపతి, సిద్ధిగణపతి, చింతామణిగణపతి, శక్తిగణపతి, ఉచ్ఛిష్ట గణపతి, ఏకాక్షరగణపతి, కుమార గణపతి.

**అష్టగ్రాసభక్షణము-** ఎనిమిది కబళములయన్నమును మాత్రమే భుజించునియమము.

**అష్టనాగరాజములు-** అనంతము, కుళికము, వాసుకీ, శంకపాలక, తక్షక, మహాపద్మ, కర్కోటక, పద్మ [అనంతకుళికశ్చైవ, వాసుకీ శంకపాలకః తక్షకశ్చమహాపద్మ, కర్కోట పద్మయేవచ] వీనిని గురుతుతెలిసి కొను నుపాయము.

[1] అనంతమునకు తలయందు, వీపునందు శ్వేతపద్మమువలె గురుతులుండును.

[2] కుళికమునకు తలయందు శంఖమువలె గురుతులుండును.

[3] వాసుకి తోకయందు ఉత్పలము (కలువ) చిహ్నముండును.

[4] శంకపాలకకుతలయందు త్రిశూలము లేక అర్ధచంద్రునివలె గురుతుండును.

[5] తక్షకునికి శరీరమున కుంచేలువలె గురుతుండును.

[6] మహాపద్మమునకు పృష్టభాగమున చుక్కలుండును.

[7] కర్కోటకమునకు శిరస్సునందు మూడుకన్నులవలె గురుతుండును.

[8] పద్మనాగమునకు తోకయందు ఐదు ఎఱ్ఱని చుక్కలుండును.

శ్వేతపద్మ మనంతస్య, మూర్ధ్ని పృష్ట చదృశ్యతే శంఖంశేషస్యశిరసి వాసుకేప్పృష్టఉత్పలం త్రినేత్రాంకస్తు కర్కోటస్తక్షకశ్శశకాంకితః జ్వలత్త్రిశూలచంద్రార్థం శంకపాలస్యమూర్ధ్నిని రాజవత్తు సమోహిందూర్ధ్వమహాపద్మస్యపృష్టతః పద్మపృష్టచదృశ్యంతే రక్తాపంచబిందవః ఏవం వేత్తి జాత్యాదీన్నామచిహ్నం శిరోదితం। తస్యమంత్రౌషధాన్యేవ సిధ్యంతేనాన్యథా పునః॥ ఇంకను వివరములు వశీకరణ తంత్రమను కబ్బమునఁగాననగును.

**అష్టప్రకృతులు-** భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము,మనస్సు, బుద్ధి, అహంకారము.

**అష్టపాశములు-** దయ, జుగుప్స, మోహము, భయము, సంశయము, కులము, బలము, శీలము.

**అష్టభోగములు-** దాసులు, భృత్యులు సుతులు, బంధువులు, వస్తువులు, వాహనాదులు లేక అన్న, వస్త్ర, గంధ పుష్ప, శయ్యా, తాంబూల, స్త్రీ, గానమిత్యాదులు.

**అష్టమదములు-** కుల, బల, ధన, యవ్వన విద్యా, రాజ్య, తపోమదములు.

**అష్టమూర్తులు-** అష్టప్రకృతులు.

**అష్టలక్ష్ములు-** ధన, ధాన్య, జయ, బల, ధైర్య; రాజ్య, క్షమ, సంపల్లక్ష్ములు.

**అష్టవసువులు-** అగ్ని, పృథ్వి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుఁడు. స్వర్గము, చంద్రుఁడు, నక్షత్రములు లేక అజ్ఞానము, కామము, సుకృతదుష్కృతములు, పంచభూతములు.

**అష్టవిధకుంభకములు-** సూర్యభేదనము, ఉజ్జాయి, సీత్కారి, శీతలి, భస్త్రిక, భ్రామరి, మూర్ఛ, ప్లావిని. దీని వివరములు, యోగకుండలీ, యోగతత్త్వ హఠరత్నావళులందు కాననగును. వీని సంగ్రహము,

(1) సూర్యభేదనము వెలుపలనుండు ప్రాణమును కుడి నాడిచేత మెల్ల మెల్లగ నాకర్షించి, కుంభించిన తరువాత ఇడానాడిచేత రేచింపవలయును దీనివలన కపాలశోధనముగలుగును. ఇట్లు మఱిమఱల నభ్యసించుచుండవలెను.

(2) ఉజ్జాయి యనఁగఁ నోరుమూసికొని కంఠముమొదలు హృదయము వరకు తాకునట్లుగ నిడాపింగలా నాడులచేత మెల్లమెల్లగ ధ్వనియుక్తముగ వాయువును పూరించి, సూర్యభేదన కుంభకమువలె కేశాది నఖపర్యంతము, నిరోధముఁగలుగునటుల కుంభించి, తరువాత నిడా నాడిచే రేచించుట.

(3) శీతలియనఁగ పెదవులకు వెలుపల నుండునటుల నాలుకనుచాచి ప్రాణ వాయువును పూరించి, సూర్యభేదన కుంభకమువలె కుంభించి, మెల్లమెల్లగ నాసికారంధ్రముల వెంబడిని వాయువును రేచించుట.

(4) భస్త్రి కరమలవాని కొలిమితిత్తుల వలె మార్చి మార్చి రెండుముక్కుల ద్వారములలోను రేచక, పూరక కుంభకము లొనర్చుట.

(5) సీత్కారియనఁగ రెండుపెదవుల నడుమఁ జేర్చఁబడిన నాలుకచేత సీత్కారము చేయునట్టి పద్ధతిగా నోటితోఁబూరించి,నాసికాద్వారముల చేత రేచకముఁ చేయవలయును. ఇట్లు మాటికి మాటికిఁ జేయుట.

(6) భ్రామరియనఁగ వేగముగా శబ్దముతోడి మగతుమ్మెద నాదమువంటి నాదముఁ గలుగునట్లుగఁ బూరకముఁజేసి, ఆడుతుమ్మెద నాదము వంటి నాదము కలుగునట్లు మెల్ల మెల్లగ రేచకముఁజేయుట.

(7) మూర్ఛయనఁగ పూరకాంతమునందు మిగుల దృఢమైన జాలంధర బంధమునుఁజేసి, మెల్లమెల్లగ రేచించుట.

(8) ప్లావినియనఁగ వాయువుచేత సమగ్రముగఁ బూరింపఁబడిన కడుపుఁ గలవాఁడు జలముయొక్క లోతు నకుఁబోయి తామరాకువలెఁ దేలు చుండుట. ఇవిసంక్షిప్తములు.

**అష్టవిధగురువులు**- బోధక, వేదక, నిషిద్ధ, సూచక, వాచక, కారణ, విహిత, కామ్యక గురువులు.

**అష్టవిధ ప్రాణాయామములు**-

అంతఃపూరకములు 2 అంతఃకుంభకము 1 అంతరేచకము 1 బాహ్యాపూరకములు 2 బాహ్యాకుంభకము 1 బాహ్యారేచకము 1 అని 8 విధయులు.

(1) వాయువునాసికయొక్క కొనమొదలు శిరస్సువరకును, శిరస్సునుండి హృదయమువరకు గాలిపోవుట రెండును అంతఃపూరకములు.

(2) అపానము అణఁగి ప్రాణము హృదయమునఁ గలుగునట్టి పూర్ణావస్థ. అంతఃకుంభము.

(3) హృదయమునుండి ప్రాణముగోచరించుటకు వాయువు బయటప్రవేశించుట అనఁగశిరస్సు పర్యంతము పోవుట అంతరేచకము.

(4) వాయువు శిరస్సుమొదలు నాసికాగ్రమువరకును, నాశాసిగ్రమునుండి వెలుపల పండ్రెండంగులముల

వరకును పోవుటలు 2 ను బాహ్య పూరకములు.
(5) ప్రాణము అణఁగి అపానము ద్వాదశాంతమునందు కలుగకుండునట్టి పూర్ణావస్థ బాహ్యకుంభకము.
(6) బయటనుండి అపానము గోచరించుటకు వాయువులోపల ప్రవేశించుట బాహ్యరేచకము.

**అష్టవిధభక్తులు**-1 భగవద్భక్తులయందు ప్రేమ, 2 భక్తులు భగవంతునిభజింపఁ జూచి సంతోషించుట, 3 భగవంతుని పూజించుట 4 నిరాడంబరమగుపూజ, 5 భగవత్కథలవినుట, 6 దేహ పులకాంకితము, 7 భగవత్స్మరణ, 8 భగవద్వియోగము సహింపమి.

**అష్టవిధానందములు** -1 బ్రహ్మానందము, 2 వాసనానందము, 3 విషయానందము, 4 ముఖ్యానందము, 5 ఆత్మానందము, 6 అద్వయానందము, 7 నిజానందము, 8 విద్యానందము.

**అష్టసిద్ధులు**-అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము (అష్టాదశ సిద్ధుల జూడుము.)

**అష్టాంగములు**- జీవాంగము లగు విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ప్రత్యగాత్మలు నాలుగును ఈశ్వరాంగములగు విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృత, పరమాత్మలు నాలుగునుచేరి అష్టాంగములనఁబడును.

**అష్టాదశ-యజ్ఞము.** ఋత్విక్కులు 16 మంది యజమానుఁడు 1 యజమానుని పత్ని 1=18. ఈ పదునెనిమిదిమందిచే యజ్ఞమేర్పడుటచేత అష్టాదశయని యజ్ఞమునకు పేరుగల్గెను.

**అష్టాదశపురాణములు**- బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, భవిష్యోత్తరము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, బ్రహ్మకైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, గారుడము, వామనము, మాత్స్యము, కూర్మము బ్రహ్మాండము.

**అష్టాదశశక్తిపీఠములు**— 1 శాంకరీదేవి, లంకలోనుండినది. ఇప్పుడిది భగ్నమైపోయినది. 2 కామాక్షి, కాంచీపురముననున్నది. 3 శృంఖలాదేవి, ప్రద్యుమ్న మనఁబడు ఇప్పటి బంగాళములోని పాండువా 4 చాముండి, పశ్చిమసముద్ర తీరముననున్న క్రౌంచపట్టణము (5) జోగులాంబ, నైజాం రాజ్యములోని అల్లంపూరు (6) భ్రమరాంబ, శ్రీశైలము ఆంధ్రప్రదేశము. (7) మహాలక్ష్మి, పూర్వము కరవీరపుర మనఁబడుచుండిన బొంబాయి మాగాణమందలి కొల్హాపూర్. (8) ఏకవీరికాంబ, మయూరపురమున. (9) విరజాదేవి, వైతరణీనదీ తీరమున నున్న జాజిపూర్ అనఁబడు ఓడ్యానపురము. (10) మాణిక్యాంబ, ద్రాక్షారామము, తూర్పుగోదావరి మండలము (11) కామరూపి, అహిచ్ఛత్రపురము, అస్సాంరాష్ట్రము. (12) అలోపశాంకరి యనెడిమాధవి, ప్రయాగ. 13 మహాకాళి ఉజ్జయని, (14) పురుహూతిక, పిఠాపురము

66 భస్మజాబాలోపనిషత్తు అ
67 భావనోపనిషత్తు అ
68 భిక్షుకోపనిషత్తు శు. య
69 మహానారాయణోపనిషత్తు త్రిపాద్విభూతి } అ
70 మహావాక్యోపనిషత్తు అ
71 మహోపనిషత్తు సా
72 మండలబ్రాహ్మణోపనిషత్తు శు. య
73 మంత్రికోపనిషత్తు శు. య
74 మాండూక్యోపనిషత్తు అ
75 ముక్తికోపనిషత్తు శు. య
76 ముద్గలోపనిషత్తు ఋ
77 ముండకోపనిషత్తు అ
78 మైత్రాయణ్యుపనిషత్తు సా
79 మైత్రేయోపనిషత్తు సా
80 యాజ్ఞవల్క్యోపనిషత్తు శు. య
81 యోగకుండల్యుపనిషత్తు కృ. య
82 యోగచూడామణ్యుపనిషత్తు సా
83 యోతత్త్వోపనిషత్తు కృ. య
84 యోగశిఖోపనిషత్తు కృ. య
85 రామతాపనీయోపనిషత్తు అ
86 రామరహస్యోపనిషత్తు అ
87 రుద్రహృదయోపనిషత్తు కృ. య
88 రుద్రాక్షజాబాలోపనిషత్తు సా
89 వజ్రసూచ్యుపనిషత్తు సా
90 వరాహోపనిషత్తు కృ. య
91 వాసుదేవోపనిషత్తు సా
92 శరభోపనిషత్తు అ
93 శాట్యాయనీయోపనిషత్తు శు. య
94 శాండిల్యోపనిషత్తు అ
95 శారీరకోపనిషత్తు కృ. య
96 శుకరహస్యోపనిషత్తు కృ. య
97 శ్వేతాశ్వరోపనిషత్తు కృ. య
98 సన్న్యాసోపనిషత్తు సా
99 సర్వసారోపనిషత్తు కృ. య
100 స్కందోపనిషత్తు కృ. య
101 సరస్వతీరహస్యోపనిషత్తు కృ.య
102 సావిత్ర్యుపనిషత్తు సా
103 సీతోపనిషత్తు అ
104 సుబాలోపనిషత్తు శు. య
105 సూర్యోపనిషత్తు అ
106 సౌభాగ్యలక్ష్మ్యుపనిషత్తు ఋ
107 హయగ్రీవోపనిషత్తు అ
108 హంసోపనిషత్తు శు. య

**అసంప్రదాయ సమాధి**— లంబికా యోగమునవలంబించి ఖేచరీముద్రతోఁ జిరకాలము సమాధియందుండుట. ఈరీతిగా సమాధినిఁబొందిన వాఁడు స్వయముగఁగాక శిష్యాదులు కపాల కుహరమునఁ జొనిపియున్న నాలుకను బయటికి లాగివైచినఁగాని జాగ్రదవస్థకు రాఁజాలఁడు. ఈయోగికియెంత కాలమైనను శరీరముచెడదు. సమాధిలోనుండును.

**అసిపదార్థము**— జీవేశ్వరైక్యమును బోధించు మహావాక్యములోని పదము తత్పద, త్వం పద, వాచ్యార్థముల నిషేధించగ మిగిలిన లక్ష్యార్థములగు రెండింటికిని నైక్యమును బోధించు పదము.

**అసురులు**— ఆత్మజ్ఞానము లేక భోగలంపటులైనవారు.

**అసురసంపద**— తమోగుణ ప్రధానములగు హింస, దూషణ జార చోర నిద్రాలస్యాదులు, వ్యర్థప్రలాపములు.

**అసువు**-ప్రాణము మొదలైన జీవక్రియా నిమిత్తకమైనది.

**అసూయ**- ఇతరుల సౌభాగ్యము, సంపత్తి, విద్య, శౌర్యము, మొదలగు హేతువులచే సుగుణమందుకూడదోషారోపముఁజేయుట.

**అసంగము**- జ్ఞానభూమికాసప్తకమున మూఁడవదియగు తనుమానసియను భూమిక, సంగము లేకుండుట.

**అసంప్రజ్ఞాతము**- ధ్యానింపఁబడు వస్తువు చక్కఁగా ననుభవింపఁబడకుండుట.

**అసంప్రజ్ఞాతసమాధి**- మనోలయము, అనఁగా వాయువును సుషుమ్నా నాడి మార్గముగ బ్రహ్మరంధ్రమునఁజేర్చి, ప్రణవనాదముల వినుచు, మనసును చొక్కించి, నాదాంతర్గతమగు జ్యోతిని దర్శించి, యదియే తానను దృఢ నిశ్చయముతో సర్వమును మఱచి, నిశ్చలానందమున నుండుట.

**అసంపర్జ్ఞాతబాహ్యాంగములు**— ధారణ, ధ్యాన, సమాధులు.

**అసంభవదోషము**- ఒక లక్ష్యమునకుఁ జెప్పఁబడిన లక్షణము నాలక్ష్యమందెంతమాత్రను లేకుండుట.

**అసంభావన**- సంశయము.

**అసంభూతి**- ప్రకృతి, ప్రకృతికారణము అవ్యాకృతము, అవిద్య, సంభూతి, అసంభూతి, ఇవి సమానార్థకములు.

**అసంసక్తి**- జ్ఞానభూమికలలో నొకటి.

**అస్వప్నుఁడు**— పగటియందు నిద్దుర పోవనివాఁడు, దేవత.

**అహంకారము**— అంతఃకరణ చతుష్టయములలో నొకటి. అంతఃకరణము యొక్క తామసభాగము.

**అహంబ్రహ్మాస్మి**— మహావాక్య చతుష్టయములలో నొకటియగు యజుర్వేదములోని బృహదారణ్యా వాక్యము.

**అహంగ్రహోపాసనము**- ప్రణవోపాసనము. బ్రహ్మమును నాత్మగ గ్రహించిచేయు నుపాసనము. ఉ॥ దహర, శాండిల్య, ఉపకోసలాది విద్యలు.

**అహింస**- మనసా, వాచా, కర్మణా, ఏ ప్రాణికిని కీడుచేయకుండుట.

**అహీనయానము**- ఒక కర్త చేతనే నడిపించఁబడు యాగము.

**అక్షము**- రుద్రాక్షము, ఇంద్రియము, కన్ను, జపమాల, జూదము, జూదరి.

**అక్షమౌనము**- ఇంద్రియముల స్వేచ్ఛగఁ బోనివ్వక నరికట్టుట.

**అక్షయపాత్ర**- భిక్షాపాత్రము, ముష్టి.

**అక్షయము**- నాశములేనిది.

**అక్షరము**-నాశములేనిది, పరబ్రహ్మము, ముక్తి, శబ్దముయొక్క సంజ్ఞ.

**అక్షసరము లేక అక్షమాల**-తావళము జపమాల, అకారము మొదలు క్షకారమువరకు నక్షరక్రమముతో జపించుట కుపయోగించునది కావున

...మూల యనఁబడెను.

**[illegible]-** ...ప్రవస్తువందుఁ గంటి ...యందుండు పురుషుఁడు.

**అంగప్రదక్షిణము-** తనకుతానే కుడి వైపునకు ప్రార్థనాది సమయములందు చేయు నాత్మప్రదక్షిణము.

**అంగన్యాసము-** సంధ్యావందనాదు లందు యా యా యవయవములను స్పృశించుచు, నా యా దేవతను నావాహనముఁజేయుచు, హృదయాయ నమః శిరసేస్వాహా, శిఖాయవౌషట్, కవచాయహుం, నేత్రత్రయాయ వౌషట్, అస్త్రాయఫట్ అని యుచ్చరించుచుచేయు క్రియలు.

**అంగమేజయత్వము-** ఒడలు వణకుట. (అంగం+ఏజయత్వం)

**అం...-** ...నకు కరచరణాదు లెత్తుట, లేక సూర్య, చంద్ర, బ్రహ్మ, విష్ణు, రుద్రాదులే కనులు మొదలగు నవయవముల నధిష్ఠించి మెలఁగుట.

**అంగావబద్ధోపాసనము-** యజ్ఞకర్మల యం దంగములుగా ననుష్ఠింపఁబడువిద్యలు. ...ప్రత్యయము లనఁబడును.

**అంగకములు-** అవయవములు.

**అంగుష్ఠమాత్ర పురుషుఁడు-** ...బ్రహ్మము, జీవుఁడు.

**అంజనము-** కాటుక, మంత్రగాని ..., తలంటు, పిరా, నిప్పు, ... చెప్పునంతటి దిగ్గజము.

**అంజలి-** చేమోడ్పు, నమస్కార

**అండజములు-** గ్రుడ్లవలనఁ బు

**అండము-** గ్రుడ్డు, వృషణము.

**అండాండము-** భూచక్రము.

**అంతశ్శరీరము-** హృదయపుండరీ

**అంతఃకరణము-** మనస్సు, ... చిత్తము, అహంకారములు.

**అంతశ్శత్రువు-** మనలోపలి శత్రు హితశత్రువు.

**అంతఃకరణవృత్తులు-** సంకల్ప అధ్యవసాన, అభిమాన, అవధారణ

**అంతఃకుంభకము-** అష్టవిధప్రాణాయామములఁ జూడుడు.

**అంతఃప్రణవము-** బ్రహ్మమున బోధించుటకై వ్యవహారార్థ వ కల్పింపఁబడిన ప్రణవము.

**అంతర్దృశ్యానువిద్ధ సవికల్పసమా** కామాది స్వజ్ఞప్తి పర్యంతముగఁగ వృత్తులు తనయందుకలిగినపుడువాని నన్నింటికి విలక్షణమైన పరబ్రహ్మము తానని భావించుట.

**అంతరనవవిధ ప్రపంచములు-** కర్త, కర్మ, హేతువులగు బాహ్యత్రిపుటులు మూఁడు, జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములగు నంతరత్రిపుటులు మూఁడు, ద్రష్ట, దర్శన, దృశ్యములగు మధ్యత్రిపుటులు మూఁడు, ఇవి యన్నియుఁగలసి నవవిధ ప్రపంచములనఁబడును.

**అంతర నిర్వికల్పసమాధి-** బాహ్యాంతరవృత్తి శూన్యమై అఖండ పరిపూర్ణ

సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపమై యుండుట. అనఁగ అసంప్రజ్ఞాత సమాధి.

**అంతర పూరకములు-** అష్టవిధ ప్రాణాయామములఁ జూడుడు.

**అంతరరేచకము-** అష్టవిధప్రాణ, జూడుడు.

**అంతరశబ్దానువిద్ధ సవికల్పసమాధి-** రాగద్వేష, కామక్రోధ, లోభ, మద, మత్సర, ఈర్ష్యాసూయ దర్పాహంకారాది జ్ఞప్తిపర్యంతముఁగల సకలాంతర వస్తునామములును నేను గాననివిడచి, సర్వవిలక్షణమైన పరమాత్మ తానని యూహించుట.

**అంతరింద్రియ చతుష్టయము-** మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.

**అంతరాత్మ-** స్వప్నమునకు సాక్షిగనుండు, బ్రహ్మచైతన్యము.

**అంతరాయము-** విఘ్నము.

**అంతరాళము-** ఎల్లదిక్కులకును నడిమిచోటు.

**అంతర్ధానము-** మఱుఁగుట.

**అంతర్యాగము-** మానసపూజ.

**అంతర్యామి-**పరమాత్మ. లోపలనుండువాఁడు. మాయతోఁగూడిన పరమాత్మ.

**అంతర్వాణి-** శాస్త్రము నెఱిఁగినవాఁడు

**అంతరిక్షలోకము-** ద్యులోకమునకు దిగువనుండు మరీచిలోకమనంబడు సూర్యకిరణములుండు లోకము.

**అంతర్హితము-** మఱుఁగుపడినది.

**అంతర్భూతము-** లోపలనణఁగినది.

**అంతర్ముఖుఁడు-** నివురుగప్పిన నిప్పువలెనుండువాఁడు.

**అంతస్సు-** మనస్సు.

**అంతేవాసి-** శిష్యుఁడు, సమీపస్థుఁడు.

**అంతేవాసిత్వము-** శిష్యత్వము.

**అంధతమసము-** గాఢాంధకారము.

**అంధతామిస్రము-** దేహమే తానని తలఁచి అది నశించినఁ దాను నశించినట్లు తలంచుట.

**అంధము-** చీకటి, గ్రుడ్డిది.

**అంధస్సు-** అన్నము,

**అంబకము-** కన్ను, బాణము.

**అంభోలోకము-** ద్యులోకమున కావలనున్న జలమును ధరించు లోకము.

**అంహోపాపము-** శాస్త్రవిహితమైన కర్మ పరిత్యాగము.

**అంహస్సు-** పాపము, దోషము.

**అ-** బ్రహ్మ.

**అః-** బ్రహ్మ, విష్ణువు, శివుఁడు, శిఖ, చంద్రబింబము, సిద్ధమంత్రము.

**ఆకాశము-** బయలు. శబ్దగుణముఁగల మహాభూతము, దీనిసంబంధము అక్షరములు ఇఈ అం ఙఞణనము, జ్ఞానేంద్రియము శ్రోత్రము, కర్మేంద్రియము వాక్కు, వాయువుప్రాణము, ఉపవాయువు నాగము.

**ఆకాశబీజము-**హంఅనువర్ణముసూచన: ఇది వేదాంతమునకగును. ఛందస్సునందు పృథ్వీబీజము.

**ఆకూతము**- నిశ్చయజ్ఞానము.

**ఆకూతి**- క్రియాసంకల్పము.

**ఆగమప్రమాణము**- శ్రుతిస్మృతీత్యాది ప్రమాణములచేతను, విశ్వసనీయు లగు వారిమాటలచేతను, తెలిసికొను చిత్తవృత్తి.

**ఆగమములు**- శాస్త్రములు. వీనిచేత అర్థములు బుద్ధియందు ప్రవేశించుట చేత, ఆగమములనఁబడును. (ఆగచ్ఛంతి బుద్ధిమారోహంత్యర్థా ఏభ్యఇత్యాగమాః)

**ఆగర్భప్రాణాయామము**- మంత్రోచ్చారణ సహితముగఁజేయు ప్రాణాయామము.

**ఆగాపాపము**-శాస్త్రగర్హితకర్మాచరణము.

**ఆగామ్యకర్మము**-వర్తమానజన్మమునఁ జేయుచుండెడి పనులు.

**ఆగ్నేయస్నానము**- భస్మమును ఒడలికిఁ బూసికొనుట. స్నానపంచకమును జూడుడు.

**ఆగంతుకుఁడు**- ఇంటికివచ్చిన యతిథి

**ఆచార్య**- తనంతటనే మంత్రవ్యాఖ్యానముఁజేసెడి స్త్రీ.

**ఆచార్యుఁడు**- శాస్త్రార్థములఁ బ్రకటనఁజేసి, లోకులను శాస్త్రార్థములందుఁ జెప్పంబడిన యాచారముల ననుష్ఠించునట్లు కావించి, తాను నాప్రకార మనుష్ఠించునట్టి పుణ్యశీలుఁడగు గురుఁడు.

**ఆజ్ఞానము**- ఈశ్వరజ్ఞానము, అజ్ఞప్తి.

**ఆజ్ఞేయచక్రము**- భ్రూమధ్యస్థానము, "హంక్షం" అను నక్షరద్వయమే రెండు రేకులుగఁలిగి పరమాత్మకు పీఠమైన స్థానము. అంతఃకరణ భవనము.

**ఆణవదీక్ష**- మంత్రార్చనాసనధ్యానాది క్రియలుగల విధానముచేత నిర్వర్తింపఁబడు దీక్ష.

**ఆణవమలము**- బ్రహ్మమును,నాత్మాభివృద్ధి విషయమును, నెఱుఁగనీయని యహంకారవృత్తి.

**ఆతతాయి**- ఇండ్లకు నిప్పుఁబెట్టుట, ప్రాణులకు విషముఁబెట్టుట, పరస్త్రీ, పరధనముల నపహరించుట, మున్నగు దుష్కృత్యముల నొనర్చువాఁడు.

**ఆతిథ్యము**- అతిథులకొరకైన యన్నాదులు, అతిథులయందు భక్తి.

**ఆతివాహిత దేవతలు**- అర్చరాది మార్గమునఁ బోవువారిని నంచెలవారిగఁజేర్పించు శక్తులగు అగ్ని, జ్యోతి, అహస్సు, శుక్లపక్ష ఉత్తరాయణాభిమాన దేవతలున్ను, ధూమాది మార్గమునఁ బోవువారిని వారి గమ్యస్థానమునకు నంచెలవారిగఁ జేర్పించు ధూమ, రాత్రి, కృష్ణపక్ష దక్షిణాయనాభిమాన దేవతలును, నాతివాహిక దేవతలనఁబడుదురు.

**ఆతురసన్న్యాసి**- తలిదండ్రులు, భార్యాపుత్రాదులతోఁ దగవులాడియైనను, రోగాదులచే జీవితమునందు విరక్తిఁగలిగియైనను, సన్న్యాసాశ్రమమును స్వీకరించినవాఁడు.

**ఆత్మ**- మాయాశక్తికినాధారముగనుండు

సద్వయానంద చైతన్యము.
పరమాత్మ, జీవుడు, శరీరము, ఉదరము, స్వభావము, ధైర్యము.

**ఆత్మచైతన్యము—** వ్యవహార దశలో నాలుగు విధములుగఁ దోచునట్టి కూటస్థ, బ్రహ్మ, జీవ, ఈశ్వరులు.

**ఆత్మమంత్రము—** ప్రణవము.

**ఆత్మశుశ్రూష—** అన్నిటికన్ను నాత్మ ప్రియమైనది. గావునఁ గూటస్థాభిన్న పరబ్రహ్మమైన తన యందుఁ దాఁ దప్పక యుండుట.

**ఆత్మానందము—** వనితాది విషయాభిలాషలయందుఁ దోచు ప్రవృత్తులు.

**ఆదిభిక్షకుఁడు—** శివుఁడు.

**ఆదివిద్వాంసుఁడు—** కపిలమహాఋషి.

**ఆధానము—** ఇచ్చుట, పుచ్చుకొనుట, ఉంచుట.

**ఆధారశక్తి—** శక్తి స్వరూపిణియగు మూలాధార స్థితకుండలనీ శక్తి.

**ఆధి—** మనోవికారము, కష్టము.

**ఆధిదైవికతాపము—** అతివృష్టి, అనావృష్టి, పిడుగులు, భూకంపము, మున్నగువానిచే లోకులకు కలుగు కీడు.

**ఆధిభౌతికతాపము—** పంచ మహాభూతములచేఁ గలుగు కష్టములు.

**ఆధిభౌతికారిష్టక సూచనలు—** మరణకాల సూచకములగు వికార రూపములు కనఁబడుట, సూర్యునిఁ జూచిన ముక్కలైనట్లును, తూట్లుపడి యుండునట్లును కనఁబడుట.

**ఆధ్యాత్మికము—** ఆత్మకు సంబంధించిన దుఃఖము.

**ఆధ్యాత్మికతాపము—** శరీరేంద్రియములకు కలుగు వికలత్వము, వ్యాధులు తనకే కలిగినట్లు దుఃఖించుట.

**ఆధ్యాత్మికారిష్టక సూచకములు—** మరణకాల సూచకములగు చెవులు మూసుకొని వినిన లోని శబ్దములు వినఁబడకుండుట, నాలుకనుచాచి చూచిన నాలుక కొన కనఁబడక నుండుట, దీపమును జూచిన రెండు శిఖలుగఁ గనఁబడుట, మున్నగు చిహ్నములు.

**ఆనందమయకోశము—** ప్రియ, మోద ప్రమోద వృత్తులు కలిగి జగదుత్పత్తికిఁ గారణమగు నజ్ఞానము. మఱ్ఱి విత్తునందు దాని చెట్టు అణగియుండు నట్లు స్వరూప సుఖమునందు తన కారణ జ్ఞాన మణఁగి యుండు నిలకడ.

**ఆనుషంగికము—** చేరిక.

**ఆప్లుతుఁడు—** ఋషి.

**ఆపూర్తము—** వాపీ, కూప, తటాకములఁ ద్రవ్వించుట, అనఁగ ఒక ద్వార ముండు నూయిని వాపి యనియు, ద్వార రహితమైన నూయిని కూపమనియు, జలప్రవేశ నిర్గమనమార్గంబులు గలిగి జలసమృద్ధమగు నూయిని తటాక మనియు, అనేక ద్వారంబులుగలదానిని పుష్కరిణి యు, దీర్ఘాకారంబుగల నూయిని దీర్ఘిక యనియు గ్రహించునది (ద్వారహీనోభవేత్కూపో ద్వారేకైకేన

వాపికా। నైకద్వారా పుష్కరిణీ। దీర్ఘా కారాశ్చ దీర్ఘికా। కుల్యావిధూతతో యాశ్చ తటాకాః పరికీర్తితా) అన్నసత్ర ముల నెలకొలుపుట, దేవాలయముల నిర్మించుట, ప్రజోపకరమైన పూదోటలు, తోపులు మున్నగు వానిని నిర్మించి ప్రజా బాహుళ్యమున కుప కార మొనర్చుటకు అపూర్తము లేక పూర్ణ మనిపేరు. (వాపీకూపతటాకాది దేవతాయతనానీచ అన్న ప్రదాన మారామః పూర్ణమిత్యభిధీయతే)

**ఆపోజ్యోతి**— సమస్తమును పరిపా లించు స్వయంప్రకాశుఁడు.

**ఆభాసము**— లేనిది యున్నట్లు తోచుట.

**ఆముష్మికసుఖము**— స్వర్గాది భోగము లగు అభ్యుదయము, మోక్షసుఖ మగు నిశ్శ్రేయము.

**ఆరంభావస్థ**— నాదావస్థ భేదములఁ జూడుము.

**ఆర్జవము**— చక్కని నడవడిఁ గలిగి మనస్సునఁ దలఁచినట్లే వెలుపలఁ గూడ ప్రవర్తించు ఋజుభావము.

**ఆర్షము**— ఋషి సంబంధమైనది.

**ఆరురుక్షుఁడు**— జ్ఞాన భూమికలను క్రమముగఁబొంద నిశ్చయించువాఁడు. ముముక్షువు.

**ఆరురోహకులు**— యోగాంగముల నెక్కుచున్నవారు.

**ఆరూఢుఁడు**— బ్రహ్మవిద్వరుఁడు.

**ఆరూఢము**— ఎక్కినది, జ్యోతిశ్శా స్త్రమునందొక భాగము.

**ఆరూఢులు**— యోగజ్ఞానభూమికల నెక్కినవారు.

**ఆరోహణము**— ఎక్కుట, మెట్లు, నిచ్చెన.

**ఆళువారు**— హరిభక్తుఁడు, గరుత్మం తుఁడు.

**ఆవరణము**— తాను కూటస్థుఁడైయుం డియుఁ గూటస్థుని యెఱుఁగననెడి భ్రమ.

**ఆవరణశక్తి**— యథార్థ రూపమును మాటుపఱచి దానిని మఱియొక రూప ముగఁ దోచునట్లొనరించుచుండు మాయయొక్క తమోగుణము.

**ఆవేశికుఁడు**— అగంతుకుఁడు.

**ఆశయము**— అభిప్రాయము, మనస్సు, ఆధారము.

**ఆశిరము**— చక్కఁగఁ గాచిన పాలు మున్నగు వస్తువులు కలిపిన సోమ రసము, సోమపానము.

**ఆశీస్సు**— దీవన, హితముఁగోరుట, పాము కోఱ.

**ఆశ్రమములు**— బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసాశ్రమములు, తపో ధనులుండు మఠాదులు.

**ఆషాఢము**— బ్రహ్మచారి ధరించు మోదుగ కోల, చాంద్రమాన సంవత్స రమున నాల్గవ మాసము.

**ఆసనములు**— (1) బ్రహ్మనిష్ఠాభ్యాస కాలమునఁ గూర్చుండుటకై భూమిపైఁ బఱచు కొనునట్టి కృష్ణాజిన, వ్యాఘ్ర చర్మ, కుశ, కంబళాదులు. (2) వ్యాధులు రాకుండుట కొరకై యభ్యసించు యోగాసనాదులు, ఉ॥ పద్మ, సిద్ధ, కపాలాసనములు.

**ఆస్తిక్యము**— దేవుఁడున్నాఁడను నమ్మిక.

**ఆస్తేయము**— దొంగలింపమి.

**ఆహవనీయాగ్ని**— త్రేతాగ్నులలో నొకటి. ప్రాణవాయువు.

**ఆహుతి**— అగ్నిలో వ్రేల్చుట.

**ఇ**— రహస్యార్థము, ఈశ్వరుఁడు, మన్మథుఁడు, కిరణము.

**ఇడానాడి**— చంద్రనాడి, ఎడమ ముక్కు నకుఁ బోవుచున్న నరము.

**ఇతిహాసము**— పూర్వపు కథ.

**ఇదంద్రుఁడు**-- ఇంద్రుఁడు. పరబ్రహ్మము జీవునిచేఁ బ్రత్యక్షముగఁ జూడఁబడినవాఁడు కావున నిదంద్రుఁ డను నామము ప్రసిద్ధమాయెను. ఇదంద్రశబ్దమే వర్ణలోపముఁజేసి ఇంద్రశబ్ద మాయెను. జీవాత్మ పరబ్రహ్మమును ప్రత్యక్షముగఁ జూచినందునఁ బరబ్రహ్మమునకు ఇంద్రుఁ డను పేరు గల్గెను.

**ఇష్టాపూర్తములు**-- (ఇష్టము + ఆపూర్తము) ఇష్టమనఁగ నగ్నిహోత్రము, తపస్సు, సత్యసంధత, వేదవిధుల ననుష్ఠించుట, అతిథిపూజ, వైశ్యదేవమిత్యాదులు, (అగ్నిహోత్రం తపస్సత్యం। వేదానాంచానుపాలనం। ఆతిథ్యం వైశ్యదేవంచ ఇష్టమిత్యభిధీయతే) ఆపూర్తమనఁగ వాపీకూపతటాకాదుల నిర్మించుట. (వాపీకూపతటాకాది దేవతాయతనానిచ। అన్నప్రదానమారామః పూర్ణమిత్యభిధీయతే) ఆపూర్తమును జూడుడు.

**ఇహము**— భూలోకము.

**ఇహాముత్రార్థఫలభోగవిరాగము**-- భూలోకంబునంగల స్రక్చందనాది విషయ భోగములందును, స్వర్గలోకమునంగల యమృతపానాది భోగములందును ఆశను విడచియుండునట్టి సాధన చతుష్టమునందొక సాధన. స్రక్ అనఁగ పూలమాలలు. చందన మనఁగ శ్రీచందనాది పరిమళ ద్రవ్యములు.

**ఇంద్రియములు**--జ్ఞాన, కర్మ, అంతరేంద్రియములనఁబడు అవయవములు.

**ఇంద్రుఁడు**-- పరబ్రహ్మము, స్వర్గపతి, శ్రేష్ఠుఁడు, వీర్యము, బలము, వజ్రము మేఘము.

**ఈ**-- లక్ష్మీదేవి, సరస్వతి, నాలుక, ఇంద్రధనస్సు.

**ఈలువు**-- పాతివ్రత్యము.

**ఈశత్వము**-- జలమునందువలె భూమియందును మునుంగఁగల శక్తియు, భూత భౌతికముల సృష్టించి రక్షించి సంహరింపఁగలిగిన శక్తిని గలిగియుండు తపస్సిద్ధి.

**ఈశ్వరకలాచతుష్కము**-- పీత, శ్వేత, అరుణ, సిత అను నాల్గు వర్ణములు.

**ఈశ్వరచైతన్యము**- మాయోపాధితోఁ గూడిన చైతన్యము.

**ఈశ్వరత్రియము**- విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతులు.

**ఈశ్వరధ్యానము**- విషయ సంబంధమైన క్రియను లెన్నగా రహితమొనర్చి ఆత్మ ధ్యానము చేయుట.

(త్రిభిశ్చకరతై స్స్వమ్యల్। హిత్వావైష యికీం క్రియా। స్వాత్మైవచింతనం యత్తదీశ్వర ధ్యానమీరితం)

**ఈశ్వరప్రణిధానము-** ఈశ్వరుని వాఙ్మనఃకాయ కర్మల చేత స్తుతి, స్మరణ, పూజల నొనర్చుట.

**ఈశ్వరుఁడు-** బ్రహ్మమునందు కల్పితుఁడైన మాయాప్రతిబింబుఁడు. సృష్ట్యాదులొనర్చువాఁడు. (మాయ, తద్విశిష్టచిదాభాసుఁడును, తదధిష్ఠాన చైతన్యమునుఁజేరి యాశ్వరుఁడనఁబడును.)

**ఈషణత్రియము-** ధనేషణ, దారేషణ, పుత్రేషణలు. ఈషణమనఁగ కోర్కె.

**ఉ-** శివుఁడు, విష్ణువు, శిరస్సు, కన్ను.

**ఉత్కటాసనము-** పశ్చిమతానాసము.

**ఉచ్ఛ్వాసము-** రేచకము. (ఊపిరిని ముక్కులనుండి వెలికి వదలుట)

**ఉచ్చి-** బ్రహ్మరంధ్రము లేక మాడు పట్టు)

**ఉజ్జాయిని-** నోరు మూసికొని కంఠము మొదలు హృదయమువరకున్ను వాయువు నిలుచునట్లుగ నిడాపింగళలచేత వాయువు నాకర్షించి పూరించి శిరస్సు మొదలు కాలిగోరు వరకును వాయువును నిరోధించుట.

**ఉడ్యాణపీఠము-** అజ్ఞాచక్రము.

**ఉడ్యాణబంధము-** కుంభకాంతమునను రేచకమునకుమొదటను, నాభికిమీఁది క్రింది భాగముల వెనుకకు లాగుచుండు పద్ధతి.

**ఉత్కటాసనము-** రెండు కాళ్ళతోఁ గూర్చుండి గొంతును చాచియుండుట.

**ఉత్తమ కుంభకము-** ప్రాణాయామ సమయమున శరీరోత్థితిఁ గలిగియుండుట.

**ఉత్తమ ప్రాణాయామము-** మూఁడు ఉద్ఘాతములు లేక ముప్పదియారు మాత్రల కాలమువరకుచేయునట్టి ప్రాణాయామము.

**ఉత్తమాంగాసనము-** పద్మాసనస్థుఁడై చేతుల నేలనూని, శిరస్సును వంచియుంచుట, కొందఱు కుక్కుటాసనస్థుఁడైయుండి, తలను క్రిందికి వంచియుంచుట, ఉత్తమాంగాసన మందురు. దీనిని లౌల్యాసనమనియు జెప్పుదురు.

**ఉత్తరమీమాంస-** వ్యాసరచితమగు బ్రహ్మసూత్రములతో నొప్పి మంత్రవాదంబైన దేవతాలక్షణములఁ బ్రతిపాదించెడి దేవకాండమున్ను, నాలుగధ్యాయములు గలిగి పరబ్రహ్మమును ప్రతిపాదించు బ్రహ్మకాండమున్ను గల వేదాంత గ్రంథము. పూర్వమీమాంస జూడుడు.

**ఉత్తరాఘము-** భగవత్సమాశ్రయణానంతరము, దేహావసాన పర్యంతము పూర్వవాసనాబలముచే చేయఁబడు చేతన కృతకర్మము.

**ఉత్తరాయణ పుణ్యకాలము-** మకర సంక్రాంతి లేక పెద్దపండుగ యని చెప్పఁబడుచుండు సూర్యుఁడు మకర రాశిలోఁ బ్రవేశించుదినము. శేషుఁడు భూమిని కుడి భుజము నుండి ఎడమ భుజమునకు మార్చుకొనుననియు, ఆ దినమే సంక్రాంతి

పండుగకు మునుపటి దినమగు భోగి పండుగయనియుఁ జెప్పుదురు.

**ఉత్థానకూర్మాసనము**- కుక్కుటాసనస్థుఁడైయుండి, అట్లే రెండు చేతులతోఁ గంఠమును పట్టుకొని భుజములతోఁ గంఠమును హత్తించి, కూర్మమువలె వెలికిలఁ బడియుండుట.

**ఉత్సూత్రము**- సూత్రములోనున్న యొక సూచనను ఇంచుకనిమిత్తముగఁగైకొని స్వయముగనే కార్యమును నిర్వహించుట.

**ఉదానవాయువు**- కంఠమందుండెడి వాయు విశేషము.

**ఉద్ఘాతము**- కనిష్ఠప్రాణాయామము లేక పన్రెండు మాత్రల కాలమువరకుఁ జేయు ప్రాణాయామము.

**ఉద్భిజ్జములు**- భూమిని బెకలించుకొని పుట్టు, తరు, లత, గుల్మాదులు, (ఉత్+భిత్+జ.)

**ఉద్గీథ**- బ్రహ్మ ప్రణవము.

**ఉద్గీథమ్**- ఓంకారము, ప్రాణము. (ఉత్=ప్రాణము, గీ=వాక్కు, థమ్=అన్నము)

**ఉపక్రమోప సంహారములు**- షడ్విధ లింగములలో నొకటి. ప్రకరణమునకు ప్రారంభమునఁ బ్రతిపాదించిన విషయమున్ను, అట్లు ప్రతిపాదించిన విషయమును ప్రకరణాంతమున నుపసంహరించుట.

**ఉపకుర్వాణ బ్రహ్మచారి**- నియమపూర్వకముగ వేదము నభ్యసించు బ్రహ్మచారి.

**ఉపజనాపాయము**- ఉత్పత్తి నాశములు.

**ఉపజ్ఞ**- తనంతట పుట్టిన జ్ఞానము.

**ఉపజీవకము**- ఒక దానికాశ్రయమిచ్చునది. ప్రభువులు మొదలగు వారిట్టివారె.

**ఉపజీవ్యము**-ఒకదానినాశ్రయించి బ్రతుకునది. సేవకులు మొదలగు వారిట్టివారే.

**ఉపద్రష్ట**-చూచువాఁడు. సాక్షీభూతుఁడు

**ఉపనిషత్తు**- బ్రహ్మవిద్య.

**ఉపనిషత్తి**- ప్రకరణమందుఁ జెప్పఁబడిన విషయమును సాధించు నిమిత్తము అచ్చటచటఁజెప్పఁబడినయుక్తి. షడ్విధ లింగములలో నొకటి.

**ఉపరతి**- విహితములైన సకల కర్మలను జ్ఞాననిష్ఠావిధిచేతఁ గ్రమక్రమముగ విడుచుట, విశ్రాంతి, శమము, శాంతి, ఉపరతి, ఉపశమనము ఇవి సమానార్థకములు.

**ఉపవాసి**- నిరశన వ్రతుఁడు. సమీప వర్తియగువాఁడు.

**ఉపశాంత తేజుఁడు**- మరణించినవాడు.

**ఉపసద్వ్రతము**- ఆవుపాలనుమాత్రము పుచ్చుకొనుచుఁజేయు వ్రతము.

**ఉపసంక్రమణము**- అన్నమయాది పూర్వకోశాభిమానియగు నాత్మను ప్రాణమయాది యుత్తరకోశమున కాకర్షించుట.

**ఉపసంక్రాంతి**- ఉన్న యాధారమును విడచి, సమీపమందలి మఱియొక యాధారమును చేరుట.

**ఉపస్పర్శము-** ఆచమనము.

**ఉపసేచనము-** అన్నభక్షణములకు సాధనములగు కూరలు.

**ఉపాధానము-** ఆధారము. ముఖ్యకారణము.

**ఉపాధేయము-** గ్రహింపదగినది.

**ఉపాసనలు-** ఉపనిషత్తులందు బ్రహ్మ ప్రాప్తికొరకు ముముక్షువు లుపాసింపఁదగు విధానములఁ దెలుపు ముప్పది రెండు విద్యలున్ను, కామ్యకర్మలకు వాంచితఫలముల నొసఁగఁగల పదునాలుగు విద్యలున్ను, మొత్తము నలువదియారు విద్యలను ఉపాసన లందురు.

**ఉపాసనా భేదములు-** అహంగ్రహోపాసనలు, తటస్థోపాసనలు అంగావబద్ధోపాసనలు.

**ఉపాంగము-** వస్త్రాభరణ లేపనాదులు

**ఉపాంశుస్వాధ్యాయము-** అన్యులకు వినఁబడకుండునట్లు జపించుట అనగ చిఱునాలుక సమీపమున జపించుట.

**ఉభయవేదాంతులు-** సంస్కృతభాష యందుండు వేద శిరస్సులగు ఉపనిషత్తులు, ద్రావిడ (తమిళ) భాష యందు పరమ భాగవతులగు పన్నిద్ధరాళ్వారులు రచించియుండు నాలాయిర (నాలుగువేల పద్యములు), ప్రబంధము ఉభయ వేదాంత ములగును. ఈ యుభయ వేదాంతములను నమష్టించు శ్రీ రామానుజీయ వైష్ణవులను ఉభయ వేదాంతులందురు.

**ఉభయాత్మక ప్రణవము-** విరాట్టును బోధించు ప్రణవము.

**ఊతులు-** భగవానుఁడొనర్చు భక్తజనోద్ధరణము, పోషణము.

**ఊర్ణనాభి-** సాలీడు అను ఈగపులి.

**ఊర్ధ్వపుండ్రములు-** వైష్ణవమతస్థులు లలాటము, బ్రహ్మరంధ్రము, కంఠము, మెడ, హృదయము, భుజములు ఉదరము, మున్నగు స్థలములందు శ్వేతమృత్తిక, హరిద్రాచూర్ణము, గోపీచందనము, శ్రీచందనము, కుంకుమపూవు మున్నగుద్రవ్యములతోధరించు పట్టివర్ధనములులేక పంగనామములు. గోపీచందనము లభింపనపుడు తులసివేరు ప్రక్కనున్నుండు మంటిని తీసి యూర్ధ్వపుండ్రముల ధరింతురు. సన్యాసి మాత్రము ఏకోర్ధ్వపుండ్రమును ధరింపవలెను. ఇంకను వివరములు వాసుదేవోపనిషత్తు నందుఁ దెలియఁదగును. (పరమ హంసో లలాటే ప్రణవేనైక మూర్ధ్వపుండ్రం ధారయేత్)

**ఊర్ధ్వపుండార్థము-** త్రిపుండ్రములు, త్రిమూర్తులు, సవిత్రుమంత్రమందలి భూః భువః, సువః అను మూడు వ్యాహృతులు. ఋక్ యజుస్ సామ వేదములు. దక్షిణ, గార్హపత్య, ఆహవనీయములను మూడగ్నులు. త్రికాలములు, మూడవస్థలు. జీవాత్మ, పరమాత్మ, అంతరాత్మలను త్రివిధాత్మలు. అకార, ఉకార, మకారములు కలిసిన యోంకారమునకు నీ త్రిపుండ్రములు గురుతుగానున్నవి. కావున

ప్రణవాధికారియే యీ త్రిపుండ్ర ముల ధరింప నర్హుఁడని వాసుదేవోపని షత్తు ఆజ్ఞాపించుచున్నది.

**ఊర్ధ్వము-** పొడవైనది. ఉపరితలము.

**ఊర్ధ్వరేతస్కుఁడు-** అస్ఖలితేంద్రి యుఁడు. శివుఁడు. జితేంద్రియుఁడు. ఋషి.

**ఊర్మి-** కెరటము లేక అల.

**ఋ-** ఆకాశము.

**ఋక్కులు-** పాదమునకిన్నియక్షరము లుండవలయునను నియమముఁగల గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్ మున్నగు ఛందోబద్ధములగు మంత్ర విశేష ములు. ఋక్కు అనగా వాక్కని యర్థము.

**ఋగ్వేద జన్మస్థలము-** హిమాలయ పర్వతమునకు దక్షిణము,శతద్రునదికి పడమర, సింధూనదమునకు తూర్పు గాఁగల ప్రదేశము. శతద్రు నదిని ఇప్పటివారు సట్లెజ్ (SUTLEJ) అందురు.

**ఋగ్వేదము-** పాద బద్ధములగు మంత్ర ములకు ఋక్కులనిపేరు. ఈ వేదము నందిట్టి మంత్రములే యుండుట వలన ఋగ్వేదమని పేరు గల్గెను. ఈ వేదమునకు ఇరువదియొక్క శాఖలు గలవు. ఆ యిరువదియొక శాఖలలో శాఖలశాఖ, బాష్కలశాఖ యని రెండు శాఖలు మాత్రము ఇప్పుడు నిలచియున్నవి. యజ్ఞ సమ యములందు హవిర్భాగములగ్రహించు నిమిత్తము హోతయను ఋత్విక్కు ఈ వేద మంత్రములచే దేవతల నాహ్వానించును కావున నీ వేదమునకు హొత్ర వేదమనియునుపేరు గలదు. ఈ ఋగ్వేదము పది మండలములుగ విభజింపఁబడి యున్నది. ఒక శాఖ వారు ఎనిమిది యష్టకములుగ విభ జించి యున్నారు. (ఏకవింశతి భేదేన ఋగ్వేదో భేదితోమునా)

**ఋతము-** సత్యము, పూజితము, వెలుఁగు, కాకి యరపు.

**ఋతంభర-** యథార్థజ్ఞానము. దూరపు వస్తువులను, కంటికిఁగనఁబడని సూక్ష్మవస్తువులను, కనఁబడని యాత్మను తెలిసికొనుట.

**ఋతంభరాప్రజ్ఞ-** అధ్యాత్మ ప్రసాద ము వలనఁ గలిగెడు సత్యమగు జ్ఞానము.

**ఋషి-** గురుకులవాసానంతరము ఆశ్ర మాంతరమును పొందక, వ్రతము, తీర్థస్నానము, శీలత్వములు గల్గిన బ్రహ్మచారి. జ్ఞానాధికుఁడు, వేదము, వెలుఁగు, ముని.

**ఋషిపంచమి-**భాద్రపద శుద్ధ పంచమి నాడు సప్తర్షుల నుద్దేశించి చేయఁబడు వ్రతము.

**ఋషులు-**చక్షురాది జ్ఞానేంద్రియములు. కుహక, మాయ, శాఠ్య, అహంకార, దంబ, అనృత, వర్జితులగు సమ్యగ్ద ర్శనముఁగల పెద్దలు.

**ౠ-** ఉదకము.

**ఌ-** స్వర్గము.

**ౡ-** శుభమునుఁ గలుగఁ జేయువాఁడు. తల్లి, కన్ను, దేవత, విలాసము.

ఏ- ఉదకము, విష్ణువు, అకాశము.

**ఏకగురుఁడు-** ఒక గురుని యొద్దనే వేదాదివిద్యలనేర్చినవాఁడు.

**ఏకజీవపక్షము-** ఉన్నది యొక జీవుఁడే. ఆ జీవుఁడు బ్రాంతివలనఁ బరమేశ్వరునియందు తనయట్టివారి ననేకులఁ జూచుచున్నాఁడనువారి పక్షము.

**ఏకదండి-** జ్ఞానమను నేకదండమును దాల్చి పరమేశ్వరునియందు ధారణాబుద్దిఁగలిగి యుండువాఁడు. (జ్ఞానదండో ధృతోయేన యేకదండిస ఉచ్యతే)

**ఏకర్షి-** అగ్ని. అథర్వవేదులయొక్క అగ్ని ఏకఋషి యనఁబడును.

**ఏకపాదము-** అకారాత్మకమగు అవిద్యాపాదము.

**ఏకమాత్ర-** లఘ్వక్షరముచ్చరించు కాలము. చిటికె వేయునంతకాలము. (ఏకమాత్రోభవేద్ధ్రస్వః)

**ఏకపాదాసనము-** కూర్చుండి ఒక పాదమును చాచి వేఱొక పాదమును మెడమీఁద నుంచి, రెండు చేతులను గ్రుచ్చి దానిమీఁద నుంచుట.

**ఏకరసము-** మాఱులేని తన్మాత్ర.

**ఏకస్థూణము-** బ్రహ్మదండి లేక వెన్నెముక.

**ఏకవింశన్మహాదీక్షలు-** విరాగమోక్షములగు శాంభవత్రయ దీక్షలు. వివరము:- శాంభవత్రయదీక్షలనగ శివసంబంధమగునవి. అందు క్రియాంతర్గత దీక్షలు, మనుదీక్షాంతర్గత దీక్షలు. వేదదీక్షాంతర్గత దీక్షలు. యేడు దీక్షలు గలిగియు (1) క్రియాంతర్గత దీక్షలు ఆజ్ఞాదీక్ష, ఉపమాదీక్ష, కలాభిదీక్ష. స్వస్తికారోహణదీక్ష, భుదీక్ష, అయత్తదీక్ష, స్వాయత్త [illegible] (2) మనుదీక్షాంతర్గములు ఏ[illegible] ఏకాగ్రదీక్ష, దృఢవ్రతదీక్ష, పం[illegible] యార్పణదీక్ష, అహింసాదీక్ష, లిం[illegible] దీక్ష, మనోలయదీక్ష, సద్యో[illegible] దీక్షలు. (3) వేతదీక్షాంతర్గత[illegible] ఏడు:- సమయదీక్ష, నిస్సంశా[illegible] నిర్వాణదీక్ష, తత్త్వదీక్ష, అధ్యాత్మ[illegible] అనుగ్రహాదీక్ష, సత్వశుద్ధి దీక్షలు.

**ఏకాగ్రచిత్తము-** మనస్థితి భేదవజూడుము.

**ఏకాగ్రత-** ఒకే విషయమునఁ నెలకొను చిత్తధర్మము.

**ఏకాగ్రము-** బాహ్య విషయములఁ ప్రవర్తింపని చిత్తపరిణామ భేద[illegible]

**ఏకాదశద్వారపురము-** శరీరము. [illegible]రము:- శీర్షణ్యములగు నేత్ర ద్వా[illegible]ములు రెండు, శ్రోత్రద్వారము రెండు, నాశికాద్వారములు రెం[illegible] ముఖద్వారము ఒకటి. అధోద్వార[illegible] లగు నాభి, గుదము. ఉపస్థ, బ్రహ్మరంధ్రము. మొత్తము పదుకండు ద్వారములదిగాన నీపేరు శరమున కయ్యెను.

**ఏకాదశరుద్రులు-** (1) జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, ఆత్మయనెడు మనస్సు ఒకటి. ఈ పదునొకండుగురు శరీరమును విడచి పోవునపుడు,ఆశరీరమునకు సంబంధులను

ఏడ్చునట్లు చేయుటంబట్టి రుద్రులని పేరు గల్గెను. (2) ఉగ్రుఁడు, సోముఁడు, శబరుఁడు, మృగవ్యాధుడు, రంతిజుఁడు, భిక్షకుఁడు, అహిర్బుధ్న్యుఁడు, పినాకి, పాదుకేశ్వరుఁడు, కాపాలికేయుఁడు, భౌముఁడు.

**ఏకాదశేంద్రియములు**— జ్ఞాన, కర్మేంద్రియములు పది, మనసు ఒకటి, పదుకొండు.

**ఏకాక్షరము**— ఓంకారము.

**ఏకాంతము**— విజన ప్రదేశము.

**ఏకేంద్రియసంజ్ఞ**— సుఖదుఃఖములఁ జెందక, కామక్రోధాదుల వర్జించి, భయరహితుఁడై, మూఁడవ దశయందుండు బ్రహ్మవిద్వరుఁడను స్థిత ప్రజ్ఞుఁడుండు స్థితి.

**ఏకోనవింశతిముఖులు**— పందొమ్మిది ముఖములు గలవారు. అనఁగ జ్ఞాన కర్మేంద్రియములు పది, ప్రాణాది వాయువులు ఐదు, అంతఃకరణములు నాల్గు, ఈ పందొమ్మిదింటిని ముఖములుగాఁ గల్గిన జాగ్రత్స్వప్నములకు కర్తలగు విశ్వతైజసులు లేక ఓంకారముయొక్క ప్రథమద్వితీయమాత్రలు.

**ఏజయత్వము**— వణఁకు.

**ఏనస్సు**— ఇంద్రియ నిగ్రహము లేక స్వేచ్ఛగాఁ జరించుట వలనఁగలిగిన ప్రతిఫలమగు పాపము.

**ఐ**— శివుఁడు.

**ఐహికసుఖము**— ధనధాన్యాద్యైశ్వైశ్వర్య సమృద్ధి.

**ఓ**— కమలము, గొడుగు, ఉదకము, కుబేరుఁడు, చంద్రుఁడు, యోని, ఇంద్రుఁడు, బృహస్పతి, బ్రహ్మదేవుఁడు.

**ఓజము**— దేహములోనుండు ఎనిమిదవ ధాతువు.

**ఓజస్సు**— తేజము, బలము, ఉత్సాహము.

**ఓతృ**— జాగ్రదావస్థలోనున్న బ్రహ్మవేత్త.

**ఓతప్రోత**— పడుగుపేకలు. బట్టల నేతకు ప్రధానములగు నిడివి నూలును పడగనియు, అడ్డపునూలు పేకయనియుఁ జెప్పఁబడును.

**ఓతప్రోతభావము**— పరస్పరము ఐక్యముఁగల అన్వయము వ్యతిరేకము.

**ఓతానుజ్ఞాత**— జాగ్రదావస్థయందు స్వప్నమనుభవించు బ్రహ్మవేత్త.

**ఓతానుజ్ఞైకరసుఁడు**— జాగ్రతలో సుషుప్తి ననుభవించు బ్రహ్మవేత్త.

**ఓతావికల్పుఁడు**—జాగ్రతలోఁ దురీయ మనుభవించు బ్రహ్మవేత్త.

**ఓతోత**— జాగ్రతలో జాగ్రతఁగలిగియుండు బ్రహ్మవేత్త.

**ఓంకారము**—ప్రణవము, పరబ్రహ్మము ప్రాకృతా ప్రాకృతములగు సర్వ పదార్థములను సృష్టిస్థితిలయములఁ జేయఁగల యాదికారణము, చిదాకాశము, వేదము.

**ఓంకారమునకుపర్యాయనామములు**- ప్రణవము, సర్వవ్యాపి, అనంతము, తారము, సూక్ష్మము, శుక్లము, వైద్యుతము, పరంబ్రహ్మము, తారకము, ప్రళయము, బ్రహ్మము, ప్రకాశము,

విద్యుత్తు, మహదేవుఁడు, తురీయము, కారణము, ఏకము, ప్రత్యక్కు, భగవన్, శాంతమూలము, మహాలక్ష్మి, మహామాయ,మహాదేవి,మహాసరస్వతి, సూత్రము, ఉద్గీథము, ఏకాక్షరము, మూలమంత్రము, సర్వవ్యాపి, ఇంకను గలవు.

**ఓం తత్సత్**—పరంబ్రహ్మము. (ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణః స్మృతః)

**ఓం హి**— సన్న్యాసులు ప్రణము నుచ్చరించెడి ధ్వని.

**ఔ**— కుమారస్వామి, చంద్రకళ, అనంతుఁడను సర్పము. సిద్ధపురుషుల విమానము.

**ఔదుంబరుఁడు**— ప్రొద్దున నిదుర నుండి లేచినదే యే దిశను జూచునో యా దిక్కునఁబోయి యందున్న ఔదంబరి (మేడి) బదరీ (రేగు) నీవార శ్యామాకాదులచేఁ గర్మల నాచరించువాఁడు.

**కనిష్ట ప్రాణాయామము**— పంత్రెండు మాత్రల కాలము రేచించి పూరించి కుంభించుట. దీనిని ఉద్ఘాత మని చెప్పుట గలదు.

**కనీనిక**— కంటి నల్లగ్రుడ్డు.

**కన్ఫూషియస్ మతము**— క్రీస్తు శకమునకు పూర్వము 478-551 లకు మధ్యకాలమున మధ్యచీనాదేశమున నొకానొక సంఘ సంస్కర్త బోధించిన మతము.

**కపాలభాతి**— కమ్మరివాని తిత్తులవలె నతివేగముతోఁగూడిన రేచక పూరములు చేయు పద్ధతి. ఇందుచేఁ గఫరోగములు నివర్తించును.

**కపాలాసనము**— చేతుల వ్రేళ్ళు సు గూర్చి శిరస్సుయొక్క వెనుకభాగము క్రిందనుండఁజేసి తలక్రిందుగానిలచి భ్రూమధ్యమును జూచుచుండుట.

**కమండలువు**— ఋష్యాదులు నీటికై యుపయోగించెడుచెంబు లేక కుండిక.

**కరన్యాసము**— షడంగ సహిత షట్పల్లవముల నుచ్చరించుచు చేతివ్రేళ్ళను స్పృశించు క్రియావిశేషము.

**కర్పూరములు**-ఇవి పదునైదు జాతులు. ఘనసారము, భీమసేనము, ఈశావాసము, ఉదయభాస్కరము. కమ్మకర్పూరము,ఘటికము,తురుదాహము, తుషారము, హిమరసము, హరతి, శుద్ధము, హిక్కరి, పోతాశ్రయము, పోతాశము, మున్నగునవి.

**కర్తృత్రియము**- జీవ, ఈశ్వర, ప్రత్యక్కులు.

**కర్మచండాలురు**- దూషకుఁడు, క్రియా శూన్యుఁడు, నికృష్టుఁడు, దీర్ఘకోపుఁడు.

**కర్మజన్యతాదాత్మ్యము**- తాదాత్మ్యత్రయమును జూడుడు.

**కర్మతన్మాత్రియ**- వచన, దాన, గమన, విసర్జన, ఆనందములు.

**కర్మత్రియములు**- (1) పుణ్య, పాప, మిశ్రమకర్మలు లేక (2) విధి, నిషేధ, ప్రాయశ్చిత్తములు.

**కర్మదేవతలు**- మనుష్యలోకమున జన్మించి సుకృత, దుష్కృతముల నాచరించి యా కర్మల ఫలప్రభావము వలన భోగార్థము దేవదేహమును

దాల్చి, దేవలోకమునకుఁ బోయిన వారు.

**కర్మదేవుఁడు**— అశ్వమేధాది యజ్ఞము లఁజేసి యున్నత పదము నొందిన వాఁడు.

**కర్మయోగము**— ఈశ్వరార్పణ బుద్ధితోఁ బ్రతిఫలాపేక్షరహితుఁడై విధిహిత కర్మల నాచరించుచుండుట.

శ్రీ మద్భగవద్గీత యందొక యధ్యాయము

**కర్మసాక్షులు**— సూర్య, చంద్ర, యమ, కాల, పంచభూతాదులు.

**కర్మంది**— సన్యాసి, కర్మందుఁడను ఋషి చెప్పిన సూత్రముల నధ్యయనముఁ జేయువాఁడు.

**కర్మేంద్రియములు**— వాక్పాణిపాద పాయురుపస్థలు.

**కర్కోటకుఁడు**— తలయందు కన్నుల వలె మూఁడు గురుతులుండు సర్ప విశేషము.

**కలయతులు**— సమయమునకై వేచి యుండి యనర్థమును గలిగించు వారు.

**కల్పము**— వేదషడంగములలో నొకటియై, వేదమంత్రములఁ బఠింపుచుఁజేయవలసిన పనులను బోధించు శాస్త్రము. కాలపరిమితి.

**కల్పములు**— సృష్టికర్తయగు బ్రహ్మ యొక్క యహోరాత్రములకు కల్ప మందురు. ఇదియే సృష్ట్యాదియనఁ బడును. ఈ కల్పములు జ్యోతిశ్శాస్త్ర ములందు ముప్పదివరకుఁ గాన్పించు చున్నవి. శ్వేతవరాహకల్పము, నీలలోహితకల్పము, వామదేవకల్పము, రాథాంతర కల్పము, రౌరవకల్పము, దేవకల్పము, బృహత్కల్పము, కందర్పకల్పము, సద్యకల్పము, ఈశానకల్పము, తమస్కల్పము, సారస్వతకల్పము, ఉదానకల్పము, గారుడకల్పము, కౌర్మకల్పము, నారసింహకల్పము, సమానకల్పము, అగ్నేయకల్పము, సోమకల్పము, మానసకల్పము, తత్పురుషకల్పము, వైకుంఠకల్పము, లక్ష్మీకల్పము, సావిత్రీకల్పము, ఘోరకల్పము, వరాహకల్పము, వైరాజికకల్పము, గౌరీకల్పము, మాహేశ్వరకల్పము, పితృకల్పము. ఇందు ఒక్కొక్క కల్పమునందును దేవలోకమున పదునలుగురు ఇంద్రులును భూలోకమున పదునలువురు మనువులున్ను అధికారము వహించి యుందురఁట.

**కల్పసూత్రములు**— పూర్వపు మహర్షులు తమ యనుయాయులగు శిష్య, పుత్రపరంపరలననుష్ఠింపవలసినవేద విధులను సంగ్రహించి తెలిపిన విధి వాక్యములు. ఋగ్వేదులకు ఆశ్వలాయన సూత్రము, శుక్ల యజుర్వేదులకును ప్రథమ శాఖవారికిని కాత్యాయనసూత్రము, కృష్ణయజుర్వేదులకు ఆపస్తంబ బోధాయన సూత్రములు, సామవేదులకు త్రాహియాయనసూత్రము, వైఘానసులకు ఆపస్తంబభేదమగు వైఘానస సూత్రము లనుష్ఠేయములగును. వివరము:— ఆపస్తంబసూత్రము, అగస్త్యశాకల్య సూత్రము, బోధాయన సూత్రము,

అగ్నివైశ్యసూత్రము, అశ్వలాయన సూత్రము, వాధూలసూత్రము, శాంబవీయసూత్రము, శౌనకీయసూత్రము, కౌండిన్యసూత్రము, కాత్యాయన సూత్రము, సత్యాషాఢ సూత్రము, కౌషీతకీసూత్రము, త్రాహియాయణ సూత్రము, హిరణ్యకేసినూత్రము, జైమినీయసూత్రము, వైఖానస సూత్రము. భారద్వాజ సూత్రము, మాధ్యందినసూత్రము, శాండిల్య సూత్రము ఇత్యాది సూత్రములు గలవు.

**కలాధ్వములు**—నివృత్తి, విద్య, ప్రతిష్ట, శాంతి, శాంత్యతీత, శాంత్యతీతోత్తర కళలు.

**కల్పాంతప్రళయము**— బ్రహ్మదేవునకు నూరు సంవత్సరములాయువు నిండిన పిదప పంచభూత సహితముగ మూలప్రకృతి మాత్రావశేషముగఁ గలుగు ప్రళయము.

**కవి**— భూతకాలజ్ఞుఁడు, కవీశ్వరుఁడు, శుక్రుఁడు, నీరుకాకి, జలపక్షి

**కవ్యము**— జలపక్షుల మాంసముతో వండిన కూరలు.

**కషాయము**- రాగాది రోషమువలన బహిర్ముఖమైన సంస్కారము. మ్రానిపట్టలు, వేళ్ళు, ఓషధులు నీటవేసి మరగకాచిన నీరు. ఇట్టి కషాయమున ముంచి జేగురురంగు కలుగఁజేసిన బట్టను కాషాయమందురు. ఈ బట్టలను చతుర్థాశ్రమస్థులు ధరింతురు.

**కళ**— చిత్కళ, క్షేత్రజీవుల చైతన్య ప్రకాశమే కళ యనఁబడును.

**కళాధ్వము**- నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి, శాంత్యతీతములనునైదుకళలు. ఈ కళలలో మంత్ర, పద, వర్ణ, తత్త్వ భువనాధ్వములు చేరి యున్నవి.

**కా**— మాయ.

**కాకపాదము**— నాలుగు మాత్రల కాలము.

**కాకమతము**— అభ్యాసయోగము. కా, యనగ మాయ, మాయ యెవని యధీనమునయున్నదో యతుఁడు కాకుఁడు. అనగా మహేశ్వరుఁడు. అట్టి కాకుని చేర్పించు మతము కాకమతము.

**కాకాక్షిగోళన్యాయము**— కాకిరెఁగల యొక కనుగ్రుడ్డే రెండుపక్కల యందుండు గోళములయందు వచ్చును. ఏ ప్రక్కకు తిరిగిన నా వైపుకు నా గ్రుడ్డే తిరిగివచ్చి చూపు నొసంగును. (ఏకైవ దృష్టిః కాకస్య, వామదక్షిణ నేత్రయోః యాత్యాయాత్యేవమాసంద ద్వయేతత్త్వ విదోవిదుః)

**కాకి**— సుఖదుఃఖముల ననుభవించుచుండు జీవుఁడు వాయసము.

**కాకుఁడు**- మహేశ్వరుఁడు, కాయనఁబడు మాయను సధీనమున నుంచుకొనినవాఁడు కాకుఁడు.

**కాత్యాయని**- సగము ముదిసి కాషాయ వస్త్రముఁ గట్టియుండెడు స్త్రీ, విధవయైన స్త్రీ, పార్వతీదేవి.

**కపాలభాతి**- కమ్మరివాని తిత్తులవలె నతివేగముతోఁగూడిన రేచక పూరకములుచేయుపద్ధతి. ఇందుచే కఫరోగములు నివర్తించునట.

**కపాలాసనము–** చేతుల వ్రేళ్ళను గూర్చి శిరస్సుయొక్క వెనుకభాగము క్రిందనుండఁజేసి తలక్రిందుగానిలచి భ్రూమధ్యమును జూచుచుండుట.

**కామదహనాసనము–** కాలిముని వ్రేళ్ళను భూమియందూన్చి, మోకాళ్ళను భూమియందూననీయక, మడిమెలను గుదస్థానమున హత్తించి, హంసదండముపైఁ జేతులనుంచి భ్రూమధ్యమును వీక్షించుచుండుట.

**కామరూపపీఠము–** మూలాధార చక్రము.

**కామాఖ్య–** కుండలినీ.

**కామ్యకగురువు–** పుణ్యకర్మల నుపదేశించి, ఇహపర సౌఖ్యములఁ గలుగఁ జేయువాఁడు.

**కామ్యకర్మ–** ఫలము నపేక్షించి చేయు కర్మ.

**కామ్యవిద్యలు–** ప్రతిఫలాపేక్షతో సత్కర్మలు, యోగధ్యానాదులొనర్చువారి నిమిత్తమై వేదమందుఁ జెప్పఁబడిన పదునాలుగు కామ్యవిద్యలు.

| కామ్య విద్యలు: | ఉపనిషత్తు: |
|---|---|
| 1. తైత్తిరీయే పురుషవిద్య | తైత్తి. |
| 2. ఉద్గీథో ఖఘువప్రణవవిద్య | చాం. |
| 3. ప్రణవే పరోవరీయస్త్వాది దృష్టివిద్య | చాం. |
| 4. ప్రణవే హిరణ్మయ విశిష్ట భగవదృష్టివిద్య | చాం. |
| 5. జైష్ఠశ్రేష్ఠ ప్రాణవిద్య | చాం. |
| 6. ప్రాణవానస్త్వ దృష్టివిద్య | చాం |
| 7. చాందోగ్యే పురుషవిద్య | చాం. |
| 8. హనోపాయన చింతవిద్య | చాం. |
| 9. ప్రణవే రసతత్త్వాది దృష్టివిద్య | చాం. |
| 10. నామప్రకృతిమ బ్రహ్మ దృష్టివిద్య | చాం. |
| 11. ఉద్గీదాదౌ ఆదిత్య దృష్టివిద్య | చాం. |
| 12. మనశ్చితా వాక్చితాదివిద్య | బృహదార్యము |
| 13. కృత్స్నోద్గీథ విద్య | బృహ. |
| 14. జీవేబ్రహ్మదృష్టి విద్య | బృహ. |

**కాయమ్–** చిటికెనవ్రేలు దర్భ వ్రేలు కొనలనుండి విడిచెడు ఋషిసంబంధమగు తీర్థము.

**కారకభ్రమ–** ప్రతి క్రియకును దేహాది కర్తలైదుగు రేర్పడియుండగఁ గేవల మాత్మయే కర్తయని తలంచుట.

**కారకవ్యాపారము–** కర్త, కర్మ, కరణము, సంప్రదానము, అపాదానము అధికరణము, అను నాఱును కారకములనంబడును. ఇవి ప్రతి కార్యమునకును కావలసినవియే. వీని వ్యాపారమే కారకవ్యాపారము.

**కారణగురువు–** శివజీవైక్యజ్ఞానమును గలుగఁజేయువాఁడు.

**కారణము–** ఓంకారము, హేతువు, శాక్తేయ మతస్థులు సారాయమున కుంచిన పరిభాష.

**కార్యబ్రహ్మము–** హిరణ్యగర్భుఁడు.

**కార్మికమలము–** పుణ్య, పాప, సుఖ, దుఃఖాది ద్వంద్వ రూపమైయుండి గురు, శాస్త్ర, బోధనలయందు బుద్ధినిఁ జొరనీయనిది.

**కాలకృత పరిచ్ఛేదము–** ఒక కాలమున నుండి మఱియొక కాలమున లేకుండుట.

**కాలక్లృప్త ప్రాణాయామము-** పదియారు మాత్రల కాలము రేచించి, ముప్పదిరెండు మాత్రలు పూరించి పదియారు మాత్రల కాలము వరకు కుంభించుట.

**కాలత్రియము-** భూత, భవిష్యత్తు, వర్తమానములు.

**కాలదీర్ఘప్రాణాయామము-** ఇరువది నాలుగు మాత్రల కాలము రేచించుట.

**కాలాగ్ని-** పాదములయందుండుఅగ్ని. పంచాగ్నులలో నొకటి. అతలాది పాతాళాంతములగు సప్తతలముల యొక్క అధోభాగమునందు ప్రతిష్టితమైయున్న యగ్ని. ఈ యగ్నియే శరీరమునందుండి మూలాగ్నియనంబడుచున్నది.

**కాశీక్షేత్రత్రియము-** వారణాసి ఉఖీఉషామఠము వద్దనుండు గుప్తకాశి, బారాహట్ వద్దనుండు ఉత్తరకాశి.

**కాష్ఠమౌనము-** చేష్టారహితుఁడైయుండుట.ఇంద్రియచేష్ట లుడిగియుండుట.

**కిలికర్మము-** నందులయం దంటియుండు కఫరోగనివర్తికై హఠయోగులు చూపుడు వ్రేలితోడను, నడిమి వ్రేలితోడను చిఱునాలుకను పట్టి అపుడపుడు అదుముచుండు పద్ధతి.

**కీలకము-** మర్మము, మేకు.

**క్రియాత్రియము-** మణి, మంత్ర, ఔషధములు.

**క్రియాద్వైతము-** మనోవాక్కాయకృతములైన సర్వకర్మలను సాక్షాత్పరబ్రహ్మమునందు సమర్పించుట.

**క్రియాభ్రమ-** దేహగతములగు క్రియలను ఆత్మగతములని తలంచుట.

**కుక్కుటాసనము-** పద్మాసనమునుండి మోకాళ్ళకును తొడలకును నడుమ చేతులను దూర్చి చక్కగ నేలపై నూని పైకెగసినట్లుండుట.

**కుటీచకసన్యాసి-** భూసంచారముఁ జేయుటకు సమర్థత లేకుండుటంజేసి విధిప్రకారము సన్యసించి గ్రామమునందుగాని, నదీతీరమునందుగాని మఠమును నిర్మించుకొని, కాషాయదండకమండలముల ధరించి, శరీరపోషణకు మాత్రము వలయు భోజనము దినమున కొకపూట మాత్రము భుజింపుచు, బ్రహ్మనిష్ఠయందుండువాఁడు.

**కుటీచకుఁడు-** త్రిదండియై గృహమునందు వసించి, పుత్రుఁడు భిక్షాన్నమును బెట్టుచుండగ భుజించుచుండునట్టి సన్యాసి.

**కుటుంబము-** తలిదండ్రులు, కొడుకులిద్దరు, కోడండ్రిద్దరు, కూతురు, భార్య, అతిథి, తాను, అను పదుగురు కుటుంబమగును. (మాతాపితా స్నుషే పుత్రౌ। పుత్రీభార్యాఽతిథి స్స్వయం। దశ సంఖ్యా కుటుంబీతి విష్ణునోక్త ద్విజోత్తమ)

**కుబ్జికాసనము-** పాదములను మార్చియుంచి తిర్యక్కువలె కొంచెమువంగి మోకాలియందు తలనుంచి యుండుట.

**కుమారుఁడు**— పుత్రుఁడు, గుహుఁడు. పాపమును పోఁగొట్టువాఁడు. ఐదుకు పైఁబడి పండ్రెండేండ్లకు లోఁబడిన ఈడుగలవాఁడు.

**కులశేఖరులు**— వైష్ణవ మతమును స్వీకరించిన క్షత్రియులు.

**కుళికుఁడు**— సర్పవిశేషము. దీనికి తల యందు శంఖమువలె గురుతుండును.

**కూటస్థుఁడు**— దశేంద్రియములు, అంతఃకరణములు, జ్ఞాన తన్మాత్రలు, ఇచ్ఛాద్వేష సుఖ దుఃఖాదికము లన్నియుఁజేరి కూటమనంబడును. అట్టి కూటమునందుండువాఁడు కూట స్థుఁడు. ఈ కూటమునకు క్షేత్రమని పేరు. (కూటస్తిష్ఠతీతి కూటస్థః) నిర్వి కార అధిష్ఠాన చైతన్యము శరీరమున వ్యాపించియుండు దశయందలి దానికిఁగల్గిన పేరు, క్షేత్రజ్ఞుఁడు.

**కూర్మవాయువు**—అవులింతలఁ గలుగఁ జేయు వాయు విశేషము.

**కూర్మావతార స్థలము**— ఉత్తరభారత దేశమున సంయుక్త రాష్ట్రమున అయోధ్య ప్రాంతములోని కుమాన్ డివిజన్ అనఁబడు కూర్మాచలముపై నున్న క్రాంతేశ్వరక్షేత్రము కడ హింగుళాదేవ్యాలయమునకు కతిపయ దూరమున శ్రీ మహావిష్ణువు జ్యేష్ఠ బహుళ త్రయోదశినాడు కూర్మావ తారము ధరించెనట.

**కూర్మాసనము**— గుదమున కుభయ పార్శ్వములందును రెండుకాళ్ళ మడి మెల హత్తించి రెండు మోకాళ్ళను భూమియందుంచి నిక్క చక్కఁగఁ గూర్చుండుట.

**కృకరవాయువు**— కనులయందుండెడి వాయు విశేషము.

**కృచ్ఛ్రవ్రతములు**— ప్రాజాపత్య కృచ్ఛ్రము, తప్తకృచ్ఛ్రము, సాంత పన కృచ్ఛ్రము, పారాకకృచ్ఛ్రము, కృచ్ఛ్రాతికృచ్ఛ్రము, చాంద్రాయణ కృచ్ఛ్రము, త్రిరాత్ర కృచ్ఛ్రము, పాదకృచ్ఛ్రము, త్రిపాదకృచ్ఛ్రమత్యా దులు.

**కృతవిప్రణాశము**— చేయఁబడిన కర్మలు అనుభవమునకు రాక నశిం చుట.

**కృపాసిద్ధులు**— భగవత్కృపవలనను, పూర్వకృత పుణ్యవిశేషము వలనను అల్పకృషిచేతనే ముక్తులగువారు.

**కృత్తివాసుఁడు**—కృత్తి అనగ చర్మము. చర్మమును వసనముగఁ గలవాఁడు కృత్తివాసుఁడు, శివుఁడు.

**కృష్ణుఁడు**—పూర్ణానందమయుఁడు. (కృష్ =పూర్ణము, ణ =ఆనందము) (కృషిర్భూవాచకశ్శబ్దోణశ్చ నిర్వృతి వాచకః విష్ణుస్తద్భావ యోగాచ్చ కృష్ణో భవతి సాత్వతః) గీతాచార్యుఁడు, నల్లనివాడు.

**కృష్ణాజినము**— జింకతోలు. యోగులు, జ్ఞానులు, భక్తులు ధ్యానాదులకుగాను కూర్చుండునపు డుపయోగించెడి యాసనమని, కృష్ణాజినమనినంతనే జింకచర్మమనుకొనుటజగత్ప్రసిద్ధము. ఐనను వీని భేదములిందు నుదహ రించినటుల గ్రహింతురుగాక!

హరిణస్తామ్రవర్ణస్స్యాత్। ఏణకృష్ణ ప్రకీర్తితః। కురంగ ఈషత్తామ్రస్స్యాత్ ఏణతుల్యా కృతిర్మహాన్। ఋశ్యోనీ లాంగకోలోకే। సరోజ్ఞఇతికీర్తితః। పృష తశ్చంద్రబింబస్యాద్ధరిణాకించిదల్పకః। న్యంకుర్బహువిషాణోఽథ శబరోగ వయోమహాన్। రాజీవస్తుమృగోజ్ఞేయో రాజిభిః పరితోవృతః।యోమృగశ్శృంగ హీనస్స్యాత్సముంతీతి నిగద్యతే॥ (అర్క ప్రకాశము 7 శతకము)

(1) హరిణము : తామ్ర వర్ణముగల్గి యుండు జింక. (2) ఏణము : కృష్ణ వర్ణము అనగా నల్లని వర్ణముగల జింక. (3) కురంగము : కొద్దిగతామ్ర వర్ణముగల్గి ఏణము పోలికతో గొప్ప ఆకృతిగల జింక. (4) ఋష్యము : నల్లని రూపముగల్గి సరోజ్ఞమని ప్రసిద్ధంబైయుండు జింక. (5) పృష తము : తెల్లని మచ్చలుగల్గి హరిణము నకన్న కొంచెము చిన్నదిగ నుండు జింక. (6) న్యంకువు : పలువ కొమ్ము లు గలిగిన జింక. (7) రాజీవము : చారలుగల జింక. (8) ముండి : కొమ్ములులేని జింక.

**కేదారము–** భ్రూమధ్య స్థానము, నంజ నేల.

**కేవలకుంభకము–** రేచక పూరకముల విడిచి ముఖ్యముగ వాయునిరోధ మొనర్చునట్టి ప్రాణాయామము.

**కేవలీభావము–** దృశ్యరహితమగు నాత్మస్థితి.

**క్లేశపంచకము–** అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినవ, క్లేశములు.

**కైవర్తులు–** వైష్ణవ మతమును స్వీక రించిన వడ్డెరలు. పడవల నడుపు వారు.

**కైవల్యానాడి–** సుషుమ్నానాడికి లోపల నుండునాడి. ఈ నాడిలోనికి ప్రాణ వాయువును జొనిపినయోగి బ్రహ్మ కల్ప పర్యంతము స్థూల శరీరమును శిథిలముఁ గానీయక నుంచుకొనఁ గలఁడు. (మత్తత్త్వ వేత్తుః కరణాళి రాదౌ। కైవల్యనాడ్యంతర చిత్తమేత్య। ఆబ్రహ్మ కల్పం విలయం భజన్ సన్। కాయేన కైవల్య మహప్యతిష్ఠేత్)

**కోపాగ్ని–** నేత్రములయందున్నయగ్ని. పంచాగ్నులలో నొకటి.

**కోశములు–** ఈ స్థూలదేహమైనది జడ ములై యుండు సుషుప్తి, మూర్ఛ. మరణకాలములయందు వేఱు పడి యున్నది. ఇట్టి క్షణభంగురమైన శరీ రమును నే నని యభిమానించుటం బట్టి, కత్తికి ఒరవలె కప్పియుండుట చేత కోశమనఁబడు చున్నది. (కోశ మనగా ఒర).

**కోష్ఠాగ్ని–** గార్హపత్యాకృతి గలిగి నాభి యందుండి చతుర్విధాన్నముల జీర్ణిం పఁ జేయునగ్ని.

**కౌమం–** నారచీర.

**కౌలులు–** ముక్తులు లేక పరమహంసలు. శాక్తేయులు,సిద్ధులను కౌలులందురు. వారినే వేదాంతులు పరమహంస లందురు. బౌలసంప్రదాయక వైష్ణ వులు సాయుజులు అని యందురు.

**కమ్–** సుఖము, శిరస్సు, ఉదకము.

కంఠముద్ర- జాలంధర బంధము.

కః- బ్రహ్మ, విష్ణువు, పరమాత్మ, వాయువు, సూర్యుఁడు, అగ్ని, యముఁడు, చిత్తము, బుద్ధి, సముద్రము, తెలుపువన్నె, పసుపువన్నె.

కుండలినీశక్తి -

ప్రబోధసమయములు- ప్రాణాయామ మొనర్చునపుఁడు, శక్తి చాలనముఁ జేయునపుడు, మహాత్ములయాశీస్సును బొందినపుడు, అనుభవజ్ఞుఁడగు గురువు స్పర్శదీక్ష నొసఁగినపుడు, భక్తి పరవశుఁడై యుచ్చైస్స్వరమున భగవానునిఁ గీర్తించునపుడు, మంత్ర జపముఁ జేయునపుడు, భక్తి, జ్ఞాన, వైరాగ్య బోధకములగు గ్రంథముల నేకాగ్రతతోఁ జదువునపుడు, పరిశోధన సలుపునపుడు, జ్ఞానయోగమునందుండి యాత్మ విచారము సలుపునపుడు, శ్రద్ధతో సత్కర్మ లాచరించునపుడు, నిండిన దుఃఖముతో నుండునపుడు, అత్యాశ్చర్యకర విషయముల వినినపుడు కుండలినీ తనంతట తానై మేల్కొని యూర్ధ్వగతిని చరించును.

కుండలినీనామములు- కుండలినీ, కుటిలాంగి, భుజంగీ, శక్తి, ఈశ్వరి, కుండలి, అరుంధతి, బాలరండ ఇత్యాదులు.

కుండలినీశక్తి— ఇది యూర్ధ్వకుండలి అధఃకుండలి యని రెండు విధములు. మూలాధారమున గుద గుహ్యములకు మధ్య శిరస్సు నుంచుకొని తోకఁ బైకెత్తుకొని, నిదురించుచుండును. దీనిని యధఃకుండలి యందురు. దీనిని యోగులు, జ్ఞానులు ప్రాణాయామము చేతను, ధ్యానము చేతను నిద్రలేపుదురు. అపుడు సుషుమ్నా నాళము ద్వారా గ్రంథుల భేదించుకొని శిరస్సు పైకెత్తుకొని సహస్రారము జేరును. అదియే యూర్ధ్వకుండలి. దీనినే వైష్ణవులు శేషశయనమనియు, శైవులు నాగాభరణమనియు, ఇట్లే యితరులు భిన్నభిన్నములుగాఁ దలంతురు.

కుండలినీశక్తి పంచగతులు—

పిపీలకగతి, విహంగగతి, మర్కటగతి, మండూకగతి అనియైదు విధములు-అందు (1) పిపీలకగతి యనఁగ యోగియైనవాడు, మనస్సును ధ్యానమునందేకాగ్రపరచినపుఁడు, కుండలినీశక్తి వెన్నెముకమధ్యమునఁనుండు సుషుమ్నానాడి ద్వారా యూర్ధ్వగామి యగును. అపుడు చీమలబారు ప్రాకునట్లు ప్రాకుచుఁ బోయి, భ్రూమధ్యమునఁ జేరి, యటనుండి సహస్రారము జేరును. (2) విహంగగతి యనఁగ, రెక్కలు విదల్చుకొని పోవు పక్షి విధమునఁ కుండలినీ సహస్రారము జేరును. (3) మర్కటగతి యనఁగ, నొకకొమ్మ నుండి వేరొక కొమ్మకు దాటు కోతివలె దూకుచుఁబోయి, సహస్రారమును జేరు కుండలినీ నడక. (4) మండూకగతి యనఁగ కుండలినీ, కప్పవలె దుముకుచుఁబోయి సహస్రారము జేరును. (5) సర్పగతి యనఁగఁ బాము మెలికలు తిరిగి పరుగెత్తునట్లు, కుండలినీ సహస్రారమును జేరు పద్ధతి.

ఈ యైదు గతులలో కుండలినీ సహస్రారముజేరినచో సమాధి సిద్ధించును.

**కుంభకము—** ఉచ్ఛ్వాస నిశ్శ్వాస నిరోధము రేచించినమీదట గాలిని లోనికి దీయక నిలుపుట బాహ్య కుంభకము పూరించినమీదట గాలిని వెలుపలికి వదలక నిలుపుట అంతః కుంభకము.

**కుః—** భూమి, పాపము, నింద.

**క్రతువు—** యూపస్తంభ సహిత యజ్ఞము. అవశ్యము జేయుదునని నిశ్చయించుట.

**క్రమముక్తి—** వైరాగ్యోపశాంతులు గలిగి, అర్చిరాది మార్గము ద్వారా సూర్య, బ్రహ్మ, ఉపాసనా మూర్తుల లోకములఁజేరి, యందెచటనైనను బ్రహ్మవిచారణఁజేసి కడపటముక్తిఁ బొందుట.

**ఖగాసనము—** కపాలాసనము.

**ఖేచర్యాసనము—** బీజముల క్రింది నరములయందు ఎడమకాలి మడమనుంచి, మోచేతిని మోకాలియందు అంగుళిని వెడల్పుజేసి యుంచి, నాసికాగ్రమును వీక్షించుచుండుట.

**ఖేచరీబీజము—** హ్రీం, కారము.

**ఖేచరీమంత్రము—** హ్రీం భం సం మం పం సం క్షం అను బీజాక్షరములు.

**ఖేచరీముద్ర—** లంబికా యోగము. లంబిక యనఁగ చిఱునాలుక. నాలుకకు క్రిందిభాగమునసున్న నరమును అంటియున్న మాంసమును బంగారు శలాకతోఁ గొద్దికొద్దిగ ఛేదించి, నిడివిగ నాలుకను సాగదీసి, పిమ్మట నాలుకను కపాలకుహరమున చొప్పించి, భ్రూమధ్యమున దృష్టినుంచు ముద్ర. ఇది మిక్కిలి అపాయకరమైనది. అనుభవజ్ఞులగు గురుల ఆజ్ఞానుసారము అభ్యసింపవలెను. ఈ విషయము యోగకుండల, శాండిల్య ఉపనిషత్తులలో వివరముగ తెలుపఁబడియున్నది. పంచ ముద్రలలో నొకటియగు భ్రూమధ్యమున చూపు నిలిపి చూచుముద్ర.

**ఖం—** ఇంద్రియము, సుఖము, ఆకాశము, నక్షత్రము, దయ, పలకము, బిందు, శూన్యము, సంవేశము, రంధ్రము.

**ఖః—** శాంతరసము.

**గజకరణి—** యోగులు అపానవాయువును కంఠనాళమునకు లేపి, భుజించిన యన్నమును, త్రాగిన నీరును, వాంతిఁజేయుపద్ధతి. వాంతి యనఁగా డోకు.

**గతాయాత—** చిత్తభేదములఁజూడుము.

**గమనము—** పోవుట.

**గరిమసిద్ధి—** తన శరీరమునైనను, లేక తలచిన వస్తువులనైనను, వలసినంత బరువుగా నుండునట్లు చేసికొనఁగల తపఃసిద్ధి.

**గర్భదాసులు—** పూర్వకాలమునఁ గొందఱు బిడ్డలను పుట్టగానే, వారి తలిదండ్రుల నుండి కొని పెంచి,బానిసలగా నుపయోగించుకొనువారఁట. అట్టివారే గర్భదాసులు.

**గర్భాసనము—** ఉత్థాన కూర్మాసనస్థుఁ

డైయుండి, కంఠమునందు రెండు చేతులను నుంచుకొని, నిక్కియుండుట.

**గహ్వరేష్ఠుఁడు—** అతి కష్టమైన ప్రదేశమందుండువాఁడు. అనఁగ హృదయ గుహయందుండువాఁడు గహ్వరమనఁగ గుహ.

**గాయత్రీముద్రలు—** సుముఖ, సంపుట, వితత, విస్తృత, ద్విముఖ, త్రిముఖ, చతుర్ముఖ, పంచముఖ, అధోముఖ, షణ్ముఖ, వ్యాపక, అంజలి, శకట, యమపాశ, గ్రథిత, ఉన్ముఖ, ప్రలంబ, ముష్టిక, మత్స్య, కూర్మ, వరాహ, సింహాక్రాంత, మహాక్రాంత, ముద్గర, పల్లవముద్రలు.

**గాయత్రీమంత్రము—** గాయత్రీ ఛందస్సు ననుసరించి యారక్షములు పాదముగఁ గలిగి నాలుగు పాదములతో రచింపఁబడి యుండు సవితృదేవతాక మంత్రము. గాయత్రి యనినంతనే సంధ్యావందనాదులందు ప్రార్థన కొరకై యుపయోగపడు సవితృ దేవతాక మంత్రమనియే తలంపునకు వచ్చును, నాలుగు పాదములలో నిరువది నాలుగక్షరములచే వారివారి యిష్ట దేవతా మంత్రముల నిమిడ్చి జపింతురు.

**గార్హపత్యాగ్ని—** గృహపతి యింట సర్వదా యుంచుకొనియుండు అగ్ని. అపానము.

**గాంధారినాడి—** కుడి నేత్రమందలి ముఖ్యమగు నరము.

**గ్లాని—** మనోవ్యాధి, రోగము, ముసలితనము, దప్పి, వ్యాయామము, సురతము, ఇత్యాదులచేఁగల్గు దౌర్బల్యము.

**గుడాకేశుఁడు—** నిద్రను జయించినవాఁడు.

**గుణరహితాకాశము—** చిత్తాకాశమునందు కెవలశూన్యమైన యాకాశము.

**గుణవైరాగ్యము—** త్రిగుణములయందలి యాశ లేకుండుట.

**గుణోపసంహారము—** ఒక స్థలమునఁ జెప్పఁబడియున్న ధర్మములకు సమానముగ, మరియొక స్థలమునకుఁ దెచ్చుకొనుట.

**గుప్తాసనము—** సిద్ధాసన భేదము.

**గుల్ఫాసనము—** సిద్ధాసన భేదము.

**గుహ—** కోశపంచకము.

**గూఢసుప్తి—** తుర్యగాయను నేడవ జ్ఞానభూమిక.

**గృహస్థుఁడు—** బ్రహ్మచర్యాది నియమపూర్వకముగ సాంగముగ వేదము నభ్యసించి, గుర్వనుజ్ఞాతుఁడై, స్నాతక వ్రతుఁడై, విధిహితముగ మంచి భార్యను పరిగ్రహించి శ్రౌత స్మార్త కర్మల నాచరించువాఁడు.

**గృహస్థాశ్రములు—** వార్తాక, శాలీన, యాయావర, ఘోర సన్యాసములు. (వివరము లాయాపదములకడ జూడుడు)

**గృహ్యకర్మలు—** గృహ్య సూత్రములందు చేయవలసినదిగఁ జెప్పఁబడియుండు గర్భాధానాది షోడశకర్మలు.

**గో—** గోవు, భూమి, నాలుక, నేత్రము, ఉదకము, యజ్ఞము, చంద్రుఁడు.

**గోమాంసము—** నాలుక, పశుమాంసము (ఖేచరీముద్రను, అమరవారుణిని జూడుడు)

**గోముఖము—** జపము చేయునపుడు అక్షరమాలాదులు ఇతరులకు కనుపించ నీయక చేతికి తగిలించుకొను చిన్న సంచి.

**గోముఖాసనము—** ఎడమకాలి మడమ కుడివీపు ప్రక్కగాను, అట్లే కుడికాలి మడమ ఎడమవీపు ప్రక్కగాను, మోకాలిమీద మోకాలిని కదియనుంచుట. అనఁగాఁ గూర్మాసనమువలె భూమియందుంచక శరీరమును చక్కఁగ నిక్కించుచు, భ్రూమధ్యమును వీక్షించుచుండుట.

**గోరక్షాసనము—** భద్రాసనము. గోరక్షుల వారికిది ప్రియమైన దగుటచే దీనికీ పేరు గల్గెను.

**గోలాంగూలన్యాయము—** గ్రుడ్డివానికి దారిఁజూపిన యొకఁడు, గ్రుడ్డివాఁడు పోవలసిన యింటియావు కనుఁబడగ, నీ యావు తోకను బట్టుకొని పోయిన నిన్ను నింటికి జేర్చునని చెప్పగ, గ్రుడ్డివాడావుతోకను బట్టుకొనిపోగ ఆవు ఇంటికి పోక, వేరెచటికోపోయెను. గ్రుడ్డివాడు ఇల్లు చేర లేక పోయిన యుదాహరణము.

**గోల్లాటమండపము—** నెత్తికిపైన శిరస్సునకు క్రిందనుండు భాగము. (లలాటోర్ధ్వే తథాలక్ష్యేయోగీగోల్లాటమండపే)

**గోళకీపాశుపతశైవము—** తొల్లింటి త్రిపుర రాజ్యమునందు గోళకీ యనఁబడు గిరియందలి మఠము వారనుష్ఠించు నాచారముల వలనఁ గలిగిన పేరు. పాశుపతమును జూడుడు.

**గౌణాత్మ—** ఒక పురుషుని సింహమని వర్ణించినట్లు పుత్రుని యాత్మయనుకొనుట.

**గౌణార్థము—** గుణములయందలి పోలికచే నొక పదార్థమునందు మరియొక పదార్థమును నారోపించి చెప్పుట. ఉదా॥ ఈ రాజు సింహము అనినచో సింహమునకుఁగల పరాక్రమగుణ మితఁడియందు గలదని భావము.

**గౌణులు—** వైష్ణవమతమును స్వీకరించిన రాజులు.

**గౌః—** గో ను చూడుడు.

**గ్రహములు—** ఇంద్రియములు. జీవుని సంసారమందు బంధించునవి గావున నింద్రియములకు గ్రహములని పేరు. సూర్యాది నవగ్రహములు పట్టుకొనుట. (వాక్కు, ప్రాణము, జిహ్వ, నేత్రము, శ్రోత్రము, మనస్సు, హస్తము, త్వక్కు ఇవి గ్రహములనఁబడును)

**గ్రహాతిగ్రహలక్షణము—** గ్రహము ఒక వస్తువును లేక విషయమును పట్టుకొనునది. అతిగ్రహముపట్టుకొనిన దానినిఁ బట్టుకొనునది ఉదా॥ హస్త

ము గ్రహము కర్మచేయుట అతి గ్రహము, చెవిగ్రహము వినుట అతి గ్రహము.

గ్రహీత— ఆత్మ. పురుషుఁడు.

గ్రంథి— అధ్యంకి, జ్ఞానప్రతిబంధక మగునది ముడి.

ఘటము—శరీరము. కుండ. కుండ పగిలి నట్లే శరీరము నశించునది గావున శరీరమునకు ఘటమని గౌణార్థము.

ఘటావస్థ- లయ యోగసిద్ధి.

ఘటాకాశము- కుండకులోపలి బయలు.

ఘటావస్థ- నాదావస్థ భేదము లఁ జూడుడు.

ఘోరవృత్తి- కామాది లక్షణములు గల వృత్తి వృత్తిత్రయములో నొకటి.

ఘోరసన్యాసికుఁడు- వడికట్టిన శుద్ధ జలముతో స్వకార్యముల నిర్వర్తించుచు, ప్రతి దినమును హింసావిము ఖతచే శిలోంచవృత్తికుఁడైన గ్రామ వాసియగు గృహస్థుఁడు.

ఘం- అమృతము.

ఘ్రాణేంద్రియము- ముక్కు.

చక్రాసనము- కుడికాలిమడిమయందు ఎడమతొడను, ఎడమకాలి మడిమయందు కుడి తొడను చేర్చి శరీరమును నిక్కినట్లు చేయుట.

చక్రికర్మము- ప్రేగులయందలి దుర్మలములు వెలియై మూలచక్రము విస్తరించుటకును, శూల, గుల్మము మున్నగు రోగములు నివర్తియై దీప నము కల్గుటకును, రెండు చేతుల యందలి నడిమివ్రేళ్ళ కొనగోళ్ళను తీసివైచి ఆగిసె నూనెలోనైనను నేతి లోనైనను నడిమి వ్రేళ్ళను ముంచి, గుదద్వారమునకు లోపల పోవునట్లుచేసి, మెల్లగ వాయువును హృదయమువరకు లాగి, గుదము వెడల్పగునట్లు మూడు నాలుగుమార్లు చక్కగ తిరుగునట్లు చుట్టవలయును. ఈ రీతిగ నజీర్ణాది దోషములు నివర్తియగు వరకు హఠయోగులీ క్రియ నాచరింతురు.

చత్వబుద్ధి- విషయములను చక్కగ నడిగి విసుగులేక వినుటయందోర్పు గల బుద్ధి విశేషము.

చతురంగనమస్కారము- గురువులు మున్నగు పూజ్యులకు వారి కుడిపాద మును కుడిచేతను ఎడమ పాదమును ఎడమచేతను స్పృశించుటయు, వాచా స్తుతించుటయు, మనసా ధ్యానించు టయు ప్రదక్షిణము చేయుటయు నగును.

చతుర్థప్రాణాయామము- కేవల కుంభకము లేక శూన్యము.

చతుర్దశవిద్యలు- ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణ వేదము,శిక్షా, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, మీమాంస, న్యాయ, ధర్మశాస్త్రములు, పురాణములు.

**చతుర్దశేంద్రియములు**— జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పది, అంతరింద్రియములు నాలుగు.

**చతుర్విధప్రాణాయామములు**— రేచకము, పూరకము, కుంభకము, కేవల కుంభకమనఁబడు శూన్యకము.

**చతుర్విధపురుషార్థములు**—ధర్మ, అర్థ, కామ, మోక్షములు.

**చతుర్విధముక్తులు**—సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములు.

**చతుర్విధశుశ్రూషలు**— స్థానశుశ్రూష అంగశుశ్రూష, భావశుశ్రూష, ఆత్మ శుశ్రూషలు.

**చతుర్విధసన్న్యాసులు**— కుటీచక, బహూదక, హంస, పరమహంసలు.

**చతుర్విధసృష్టులు**— గర్భ కోశమునఁ బుట్టు జరాయుజములు, గుడ్లవలనఁ బుట్టు అండజములు, చెమటవలనఁ బుట్టు స్వేదజములు, భూమిని పెకలించుకొని పుట్టు ఉద్భిజ్జములు (ఉత్+భిత్+జ) అనఁగ మనుష్యాదులు, పక్ష్యాదులు, ఈరుపేను మున్నగునవి, తరులతా గుల్మాదులు.

**చతుర్యుగములు**— కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము.

**చతుర్యుగకాలపరిమితి**— కృతయుగ సంవత్సరములు 1728000. త్రేతాయుగ సంవత్సరములు 1296000. ద్వాపరయుగ సంవత్సరములు 864000. కలియుగ సంవత్సరములు 432000. విరాట్పురుషుని ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలు దినమొక్కటికి 21600. ఈ హంసలను 80 చే గుణించిన కృతయుగ కాలమును, 60 చే గుణించిన త్రేతాయుగకాలమును, 40 చే గుణించిన ద్వాపరయుగ కాలమును, 20 చే గుణించిన కలియుగ కాలమును తెలుపు సంఖ్య వచ్చును.

అరువదిని అరువదితో పెంచిన మొత్తమును మఱల అరువదితో పెంచి వచ్చిన మొత్తమును 8, 6, 4, 2 లతో పెంచిన కృత, త్రేత, ద్వాపర, కలి యుగ సంవత్సరములు వచ్చును.

మఱియొకవిధము—

$60 \times 60 \times 60 = 21600.$

$60 \times 60 = 3600 \times 60 = 21600$

ఈరీతిగ యుగ సంవత్సర సంఖ్య వెలుఁగ వచ్చును.

$216000 \times 8 = 1728000.$

$216000 \times 6 = 1296000.$

$216000 \times 4 = 864000.$

$216000 \times 2 = 432000.$

సూచన:— ఆర్యులు తొలుత యుత్తర ధ్రువప్రాంతములలో వసించుచుండి, అటనుండి హిమాచల ప్రాంతములకును పిమ్మట సింధూనద ప్రాంతములకు వచ్చి చేరిరనియు. వారిపూర్వపు నివాసస్థానమగు ఉత్తర ధ్రువమున నుత్తరాయణ దక్షిణాయనములు ఒకరాత్రి ఒక పగలనియు ఆర్యులు సింధూప్రాంతములందు రచించిన జ్యోతిష గ్రంథములలో కాలమానము స్థానికము విడచి ధ్రువకాలమును గైకొనుటచే నొక సంవత్సరమునకు 359 సంవత్సరములు అధికముగ చేర్చి పొరబడిరనియు, అందుచే

కృతయుగ సం॥రములు 4800, త్రేతకు 3600, ద్వాపరకు 2400, కలికి 1200 అంతుచతుర్యుగముల సంవత్సరములు 12000 పన్నెండు వేలనియు నమ్మఁదగిన పెక్కు ఆధారములతో ననుభవజ్ఞులగు కాలవేత్తలు నుడువుచున్నారు.

**చతుర్వ్యూహములు—** విశిష్టాద్వైత సాంప్రదాయమునఁ దెలుపునట్టి అది, ద్వితీయ చతుర్వ్యూహములు.

వివరణ:—పరమేశ్వరుఁడు పరరూప, వ్యూహరూప, విభవరూప, అంతర్యామి రూప, అర్చారూపములతో వెలయుచుండును. అందు

(1) పరరూపము - పరమపదమందుండును. (2) వ్యూహరూపము - సృష్టిస్థితిలయ కర్తయై రక్షకత్వము వహించియుండును. (3) విభవరూపము - అవతారమూర్తులుగ నుండును. (4) అంతర్యామిరూపము - ముముక్షువులగు భక్తులకు ప్రోత్సాహమిచ్చి దర్శము లొసంగుచుండును. (5) అర్చారూపము - భక్తులకు దర్శనార్చనాది సౌలభ్యమునకై శిల,దారు, లోహ, లేప్య, లేఖ్య, సైకతి, మృణ్మయి. మణిమయి, స్థూలరూపముల వెలయుచుండును. పాంచరాత్రాగమోక్తములగు రెండు వ్యూహములలో "నాదివ్యూహమున" వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధములను నాలుగు వ్యూహములున్ను, వీని యాధిపత్యమునఁ బ్రతీ వ్యూహమ్మునకును ఐదు వ్యూహములుగ ఇరువది వ్యూహములును మొత్తము ఇరువది నాలుగు వ్యూహములై యున్నవి.

క్రమముగ పరబ్రహ్మమునకు వాసుదేవుఁడనియు, జీవునకు సంకర్షణుఁడనియు, మనస్సునకు ప్రద్యుమ్నుఁడనియు,అహంకారమునకు అనిరుద్ధుఁడనియు, వ్యవహరింతురు. వ్యూహమనఁగ రచన యగును.

ఇఁక ద్వితీయ చతుర్వ్యూహమూర్తులు సృష్టిమొదలు ముక్తివరకు కర్తలు, వ్యవహర్తలు నగుదురు. వాసుదేవుఁడు ప్రథముఁడుగఁగల వ్యూహమున కేశవ, నారాయణ, మాధవ, అధోక్షజ, పురుషోత్తమ, మూర్తులును సంకర్షణ వ్యూహాధిపత్యమున గోవింద విష్ణు, మధుసూదన, ఉపేంద్ర, అచ్యుతమూర్తులును, ప్రద్యుమ్న వ్యూహమునకు క్రింద త్రివిక్రమ, వామన, శ్రీధర, నృసింహ, జనార్ధన వ్యూహములును, అనిరుద్ధుఁడు ప్రధముఁడుగఁగల వ్యూహమున హృషీకేశ, పద్మనాభ, దామోదర, హరి, శ్రీకృష్ణమూర్తులును వ్యూహమూర్తులగుదురు. విష్ణ్వాలయములందు వ్యూహమూర్తులకుఁగల నాలుగు భుజములలోను రెండు ఊర్ధ్వముగను రెండు అధోముఖముగ నుండును, పై భాగమునున్న కుడి చేయి ఒకటనియు కుడిక్రింది చేయి రెండు అనియు పైభాగపు ఎడమ చేయి మూఁడు అనియు, ఎడమ క్రిందిచేయి నాలుగు అనియు గుర్తించి, యా చేతులలో శంఖచక్రగదా పద్మముల ధరింపఁజేసి వైభవిలాస

మూర్తులనియు, విలాసమూర్తులనియు వ్యవహరించుచున్నారు. అర్చామూర్తులకు ఉదాహరణముగ కేశవమూర్తికి కుడి పైచేయిన శంఖము కుడి క్రింది చేయినచక్రము, ఎడమ పైచేయిన గద ఎడమక్రిందిచేయినపద్మములుండును.

ఈనాలుగు వస్తువులు మార్చి మార్చి మూర్తిభేదములుగల్పించియున్నారు. (కేశవాదే చతుర్బాహోర్దక్షిణోర్ధ్వకరం క్రమాత్। శంఖచక్రగదాపద్మాయుధై। కేశవ ఉచ్యతే)

విష్ణు దేవాలయములలో నీ యాయుధ ధారణవలన పేర్లు గుర్తింపవచ్చును.

| | నామములు | మూర్తులు | కుడి వైపు | | ఎడమ వైపు | |
|---|---|---|---|---|---|---|
| | | | పైచేయి | క్రింది చేయి | పైచేయి | క్రింది చేయి |
| 1 | (1) వాసుదేవ వ్యూహము | వైభవవిలాసము | చక్రము | గద | పద్మము | శంఖము |
| 2 | కేశవమూర్తి | ,, | శంఖము | చక్రము | గద | పద్మము |
| 3 | నారాయణమూర్తి | ,, | పద్మము | గద | చక్రము | శంఖము |
| 4 | మాధవమూర్తి | ,, | చక్రము | శంఖము | పద్మము | గద |
| 5 | అధోక్షజమూర్తి | విలాసము | గద | శంఖము | చక్రము | పద్మము |
| 6 | పురుషోత్తమమూర్తి | ,, | పద్మము | శంఖము | గద | చక్రము |
| 7 | (2) సంకర్షణ వ్యూహము | ,, | శంఖము | పద్మము | చక్రము | గద |
| 8 | గోవిందమూర్తి | వైభవవిలాస | గద | పద్మము | శంఖము | చక్రము |
| 9 | విష్ణుమూర్తి | ,, మూర్తి | పద్మము | శంఖము | చక్రము | గద |
| 10 | మధుసూదనమూర్తి | ,, మూర్తి | శంఖము | పద్మము | గద | చక్రము |
| 11 | ఉపేంద్రమూర్తి | విలాసము | గద | చక్రము | పద్మము | శంఖము |
| 12 | అచ్యుతమూర్తి | ,, | పద్మము | చక్రము | శంఖము | గద |
| 13 | (3 ప్రద్యుమ్న వ్యూహము | ,, | శంఖము | గద | పద్మము | చక్రము |
| 14 | త్రివిక్రమమూర్తి | వైభవవిలాస | గద | చక్రము | శంఖము | పద్మము |
| 15 | వామనమూర్తి | ,, మూర్తి | శంఖము | చక్రము | పద్మము | గద |
| 16 | శ్రీధరమూర్తి | ,, మూర్తి | చక్రము | గద | శంఖము | పద్మము |
| 17 | నృసింహమూర్తి | విలాసము | పద్మము | గద | శంఖము | చక్రము |
| 18 | జనార్దనమూర్తి | ,, | చక్రము | శంఖము | గద | పద్మము |
| 19 | (4) అనిరుద్ధ వ్యూహము | ,, | గద | శంఖము | పద్మము | చక్రము |
| 20 | హృషీకేశ | వైభవవిలాస | చక్రము | పద్మము | శంఖము | గద |
| 21 | పద్మనాభమూర్తి | ,, మూర్తి | పద్మము | చక్రము | గద | శంఖము |
| 22 | దామోదరమూర్తి | ,, మూర్తి | శంఖము | గద | చక్రము | పద్మము |
| 23 | హరి మూర్తి | విలాసము | చక్రము | పద్మము | గద | శంఖము |
| 24 | శ్రీకృష్ణమూర్తి | ,, | గద | పద్మము | చక్రము | శంఖము |

**చతుష్పాత్తు**— అకార, ఉకార, మకార, అర్ధమాత్రలే నాలుగు పాదములుగంగల ప్రణవము లేక పరబ్రహ్మము.

**చతుష్పాదములు**— (1) అవిద్యాపాదము, విద్యాపాదము, ఆనందపాదము, తురీయపాదములు. జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయములు. (3) భ్రూమధ్యము, కంఠము, హృదయము, నాభి.

**చతుష్పీఠము**— భ్రూమధ్యము.

**చరు**— బియ్యముతో వండిన హోమ ద్రవ్యము. (ఇగురబెట్టిన యన్నము)

**చరమశ్లోకము**— శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునకు బోధించిన శ్రీమద్భగవద్గీతలోని కడపటి యధ్యాయములోనిదగు "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ అహంత్వాం సర్వపాపేభ్యో మోక్ష ఇష్యామి మాశుచ" అను నుపదేశము. అసంగ సకల ధర్మములను సకలాన్యాశ్రయములను వదలి పరమేశ్వరు నొక్కరునే దిక్కని దృఢముగ నమ్మియుండనిచో నట్టి భక్తునికి ఇహపరముల సౌఖ్యముల నిచ్చి కాపాడెడి బాధ్యత తానే వహింతునని చెప్పిన ప్రమాణ వచనము.

**చర్యాపాదచతుష్టయము**— ఉపనిషత్తులందు జీవేశ్వరైక్యముకొఱకు జ్ఞానమార్గమును ప్రతిపాదించినట్లు అగమములు తత్సిద్ధికై చర్యా, క్రియా. యోగ, జ్ఞానములను నాలుగు సాధనముల బోధించును. అందు చర్యాపాదమున భువిగల సమస్త దేవాలయములు, తీర్థములు, క్షేత్రముల దర్శించుటకును, క్రియాపాదమున ఇష్టదేవతల నారాధించుటకును, యోగపాదమున ప్రాణాయామాది సాధనల జేయుటకును, జ్ఞానపాదమున సర్వము ను పరబ్రహ్మ స్వరూపముగ భావించి యా పరబ్రహ్మమే తానని తెలియుటకును బోధించును.

**చాత్తాదవైష్ణవులు**— వైష్ణవ మతమును స్వీకరించిన శూద్రులు.

**చాతుర్మాస్యలు**— ఆషాఢ, శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ మాసములు.

**చాతుర్మాస్యవ్రతము**— శ్రీ విష్ణుదేవుండు యోగనిద్ర యందుండుటకు ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు శయనింతురనియు, కార్తీకశుద్ధ ఏకాదశినాడు యోగనిద్రనుండి లేతురనియు, కాబట్టి యీ నాలుగు మాసములు సన్యాసులు, భక్తులు అవశ్యముగ నియమ పూర్వక వ్రతము నాచరింపవలెనని పెద్దలు చేయు వ్రతము. భగవంతుండు యోగనిద్రనుండి లేచెడి మాసము గనుక కార్తీక శుద్ధ ఏకాదశికి ఉత్థాన ఏకాదశియని పేరు గలదు.

**చార్వీబుద్ధి**— ఊహాపోహలయందు నేర్పుగల బుద్ధి విశేషము.

**చిచ్ఛక్తి**— పరబ్రహ్మమునందుఁ దోచిన మాయ, ఓంకారము, సగుణ బ్రహ్మము. సర్వేశ్వరుఁడు ఈ చిచ్ఛక్తి యందు కలిగిన రజస్సత్వతమో గుణములే బ్రహ్మ, విష్ణు, రుద్రులు.

**చిత్తకల**— రాజయోగము యొక్క ఫలము. ఉత్తమాధికారి లక్షణము లగు యుక్తి శాస్త్రోక్తమగు సింద్రియ నిగ్రహములచేత నసంప్రజ్ఞాత సమాధి వరకుఁగల మోక్షమునందుండుట చిత్తకల యనంబడును.

**చిత్తధర్మములు**— సర్వార్థత, ఏకాగ్రతా పరిణామములు.

**చిత్తభేదములు**— విక్షిప్తత, గతాయాత, సంశ్లిష్టత, సులీనతా యనునవి. (1) విక్షిప్తత యనునది బ్రహ్మనిష్ఠాభ్యాసముఁజేయు కాలమందు చిత్తమైనది, నిష్ఠయందు స్వారస్యమును విడచి, సంసారమునందుఁ బ్రవర్తించు చిత్తవృత్తి.

(2) గతాయాత యనునది స్వరూపమందు సమరసమైన చిత్తము, వెంటనే బహిర్ముఖమై మరల స్వరూపమందే వచ్చి లీనమగునట్టి చిత్తవృత్తి. (3) సంశ్లిష్టత యనునది చిత్తము స్వరూపమందే యుండ, దానియందు సమరసమగునపుడు ప్రాప్తమగు బ్రహ్మానందమువలన నుప్పొంగుచుండు చిత్తవృత్తి.

(4) సులీనతా యనఁగ కడలినుండి పొంగిపొరలిన యుప్పునీరు, వెలుపలి పల్లములో నిలచి, మరల పోఁజాలక తడియారియుప్పుగా ఘనీభవించును. ఈ యుప్పును మరల నీటిలోఁగరగిపోవును. అట్లు పరబ్రహ్మ రూపమునుండి బహిర్ముఖమైన చిత్తము, తన జన్మస్థానమగు నా స్వరూపమందే లీనమై, యా మహాసుఖ ప్రాప్తియొక్క యానందోద్గారమునహా శాంతమై కేవలము జ్ఞప్తిమాత్రమునై యుండునట్టి స్థితి.

**చిత్తము**— బుద్ధి, మనస్సు, అహంకారముల యొక్క గుణసామాన్యావస్థకు చిత్తమని పేరు. దీనికి నాత్మయొక్క తాదాత్మ్య ప్రతిఫలనము వలన చేతనజ్ఞానముకలిగి, గుణముల పరిణామ భేదమువలన ప్రత్యేక వ్యాపారములు గలదిగనుండినప్పటికిని, సామాన్యముగ చిత్తమని పేరు.

**చిత్తరూపభేదములు**— జాగ్రదవస్థయందలిచిత్తమునకు ఘోరమనియు, స్వప్నావస్థ యందలి చిత్తమునకు శాంతమనియు, సుషుప్త్యవస్థయందలి చిత్తమునకు మూఢమనియు పేర్లు. చిత్తమనినను మనస్సనినను ఒక్కయర్థమునే సూచించును.

**చిత్తలాలనము**— మూలాధారము మొదలు ప్రతి ఆధార చక్రమునందును చిత్తము నిలిపి యభ్యసించుట.

**చిత్తస్థైర్యము**— ధారణ.

**చిత్తవృత్తిపంచకము**— ప్రమాణవృత్తి, విపర్యయవృత్తి, వికల్పవృత్తి, నిద్రావృత్తి, స్మృతివృత్తులు.

**చిత్తాకాశము**— తన కంటికిఁ దెలియు నంతటి దూరములోఁ గనుబడు నాకాశము.

**చిత్తి**— నిర్వికల్ప జ్ఞానము.

**చిత్తు**— చిత్. అనగా మాయాసంబంధము లేని పరమాత్మ.

**చిదంబరము**— చిదాకాశము, శివమూర్తి యొక్క దేవసభ, రాజసభ, నటనసభ, కనకసభ, జ్ఞానసభ, అను నైదు సభలు కలిగిన ఆనంద తాండవపురమను చిదంబరమను తమిళదేశమందలి పట్టణము.

**చిదాభాసుఁడు**— చిత్తు లక్షణములు లేకనే చిత్తువలెఁ దోచువాఁడు. జాగ్రదావస్థతోఁగూడిన జీవునకు చిదాభాసుఁడు వ్యావహారికుఁడు, విశ్వుఁడు, అను పేర్లు గలవు. మిథ్యా భూత చిత్తుఁడు.

**చిన్ముద్ర**— చిటికెనవ్రేలు, ఉంగరపువ్రేలు, నడిమివ్రేలు, మూటిని చక్కగ చాచి రెండవ వ్రేలి కొనను బటనవ్రేలి కొనతోఁ జేర్చియుంచుట. దీని భావము అణవ మలమును ఆశుద్ధ మాయను ద్వంద్వ కర్మలను తొలగించి జీవుని యాశ్వరునియందు ఐక్యపరుపవలయునని పూర్వకాలమున సనకాది మహామునులకు దక్షిణామూర్తిస్వామి యుపదేశించిన మౌనముద్ర. తత్త్వమసి అను నర్థము నిచ్చు ముద్ర.

**చేతనకారణవాదము**— జ్ఞానవంతమగు పదార్థమే యీ ప్రపంచమునకు కారణమగును. జడము కానేరదను వాదము.

**చంద్రికళాషోడశము**— అమృత, మానద, పూష. తుష్టి, పుష్టి, అరతి ధృతి, శశిని, చంద్రిక, కాంతి, జ్యోత్స్న, శ్రీప్రీతి, అంగద, పూర్ణ, అపూర్ణ, కామగ, అనునవి.

**చంద్రిద్వారము**— తాలు మూలము. (తాలుమూ లేచ చంద్రమాః)

**చంద్రిబీజము**— సకారము.

**చంద్రిమండలము**— అనాహత చక్రము.

**చాంద్రాయణవ్రతము**— చంద్రగతి ననుసరించి తాను భుజించెడి యన్నమును కృష్ణ పక్షమునఁ దగ్గించుచుఁ బోయి శుక్ల పక్షమున హెచ్చించుచు చేయు వ్రతము, అసఁగ పిడికెడు ప్రమాణముగల అన్నపుముద్దను శుద్ధ పాడ్యమి నాడారంభించి, తిథిసంఖ్య ప్రకారము హెచ్చించుచు పూర్ణిమ నాడు పదునైదు కబళములఁ దినవలెను. అట్లే కృష్ణ పాడ్యమినాడు పదునాలుగు కబళముల దిని, రోజుకొక ముద్దను తగ్గించుచు కృష్ణ చతుర్దశి నాడు ఒక్క కబళము అన్నమునుదిని అమావాశ్యనా డుపవసించు వ్రతము.

**చ్యుతి**— తన స్థానమునుండి భ్రష్టుఁడగుట. జారుట.

**ఛాందసుఁడు**— ఛందశ్శాస్త్రమునందలి మాత్రలు గణములను మాత్రము పాటించుచు వ్యాకరణమును, సాహిత్యమును చెడినను సరకుగొనక నుండువాఁడు.

**జడసమాధి**— నిర్వికల్ప సమాధి.

**జపతపస్సు**— పరులు మెచ్చుకొని తనను సత్కరించుటకై దంబ పూర్వకముగ చంచల చిత్తముతోడ నుపయోగము లేని రీతిఁగ నొనర్చు తపస్సు.

**జపము**— వేదమునందుఁ జెప్పినట్లు మంత్రమును పఠించుట కల్పసూత్రము, వేదము, స్మృతి, పురాణేతిహాసముల ననవరతము నభ్యసించుట.

**జన్మవలనఁగలిగినసిద్ధులు**— పూర్వజన్మలందు కలిగియుండిన సమాధి బలముచేఁ బక్షులు, జలచరములు, సర్పములు, పిశాచములు, మున్నగు ప్రాణులను నిమిత్తముఁ జేసికొని యుండుట.

త్రితయ వ్యవహర్తలగు విశ్వ, తైజస ప్రాజ్ఞులు. కించిజ్జత్వముతోఁ గూడిన త్వంపదవాచ్యార్థము.

**జీవత్రియము**- విశ్వ, తైజస, ప్రాజ్ఞులు.

**జీవన్మృతుఁడు**- లోభి, దరిద్రుఁడు, కష్టజీవి, నిత్యరోగి, యాచకుఁడు, బ్రతికియుఁ జచ్చినవానితో సమానుఁడు.

**జీవన్ముక్తులు**- బ్రహ్మవిదుఁడు, బ్రహ్మవిద్వరుఁడు, బ్రహ్మవిద్వర్యుఁడు, బ్రహ్మవిద్వరిష్ఠుఁడు.

**జీవపర్యాయనామములు**- విశ్వుఁడు, వ్యవహారికుఁడు, ప్రాతిభాసికుఁడు, తైజసుఁడు, ప్రాజ్ఞుఁడు, ప్రత్యగాత్మ, చిదాభాసుఁడు, కూటస్థుఁడు, కాక. ఇత్యాదులు.

**జీవన్ముక్తి**- బ్రహ్మవిచారముచే జీవభ్రమ తొలఁగి పరబ్రహ్మమే తానై యుండుట.

**జీవాత్మ**- జాగరమునకు సాక్షిగ నున్న బ్రహ్మ చైతన్యము.

**జీవుఁడు**- కూటస్థునియందు కల్పితుఁడైన అంతఃకరణ ప్రతిబింబుఁడు. జాగ్రత మొదలు మోక్షమువరకుఁ గల సంసార నిర్వాహి. అంతఃకరణము, తద్విశిష్ట చిదాభాసుఁడు, తదధిష్ఠాన చైతన్యము, చేరి జీవుఁడనఁబడును. ప్రాణముల ధరించువాఁడు (వ్యు) త్వంపద వాచ్యార్థము.

**జంగమ మనస్సు**- వాక్కువలన వెలువడు అక్షరములు, మంత్రములు, స్వరములు.

**జంగమము**- చైతన్యముఁగలది. తిరునది అనఁగ చేతనము.

**జః**- జపము.

**జ్ఞాతృజ్ఞేయములు**- విజ్ఞానమయకోశము.

**జ్ఞానతన్మాత్రలు**- శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు.

**జ్ఞానత్రియములు**- (1) సంజ్ఞాన, విజ్ఞాన, ప్రజ్ఞానములు. (2) స్వజ్ఞానము, ప్రాపకజ్ఞానము, ప్రాప్యజ్ఞానములు. వివరణ:— జీవుఁడైన తన రూప మెఱుఁగుటయే స్వజ్ఞానము, తన యభీష్టము నుత్తరకాలమునఁ దప్పక లభింపఁజేయు సాధన మెఱుఁగుట ప్రాపక జ్ఞానము. చేతసులచే బ్రార్థింపఁబడు ఫలమిట్టిదియని యెఱుఁగుట ప్రాప్య జ్ఞానము.

**జ్ఞానపాదము**- సమస్తమును తన యుపాసనామూర్తి కన్యము లేదని తలఁచి నిశ్చయించుకొనుట.

**జ్ఞానప్రతిబంధత్రియము**-
(1) భూత, వర్తమాన, భావి ప్రతిబంధములు. (2) సంశయము, అసంభావన, విపరీత భావనలు. సంశయముఁ దొలగించుట కుపాయము శ్రవణమున్ను అసంభావన దొలగించుట కుపాయము మననమున్ను, విపరీత భావనను దొలగించుట కుపాయము నిధిధ్యానము లనఁబడు దీర్ఘ యోచనయున్ను సాధనము లగును.

**జ్ఞానభూమికాసప్తకము**- శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్త్వాపత్తి,

త్రితయ వ్యవహర్తలగు విశ్వ, తైజస ప్రాజ్ఞులు. కించిజ్జ్ఞత్వముతోఁ గూడిన త్వంపదవాచ్యార్థము.

**జీవత్రయము**- విశ్వ, తైజస, ప్రాజ్ఞులు.

**జీవన్మృతుఁడు**- లోభి, దరిద్రుఁడు, కష్టజీవి, నిత్యరోగి, యాచకుఁడు, బ్రతికియుఁ జచ్చినవానితో సమానుఁడు.

**జీవన్ముక్తులు**- బ్రహ్మవిదుఁడు, బ్రహ్మవిద్వరుఁడు, బ్రహ్మవిద్వర్యుఁడు, బ్రహ్మవిద్వరిష్ఠుఁడు.

**జీవపర్యాయనామములు**- విశ్వుఁడు, వ్యవహారికుఁడు, ప్రాతిభాసికుఁడు, తైజసుఁడు, ప్రాజ్ఞుఁడు, ప్రత్యగాత్మ, చిదాభాసుఁడు, కూటస్థుఁడు, కాక. ఇత్యాదులు.

**జీవన్ముక్తి**- బ్రహ్మ విచారముచే జీవభ్రమ తొలఁగి పరబ్రహ్మమే తానై యుండుట.

**జీవాత్మ**- జాగరమునకు సాక్షిగ నున్న బ్రహ్మ చైతన్యము.

**జీవుఁడు**- కూటస్థునియందు కల్పితుఁడైన అంతఃకరణ ప్రతిబింబుఁడు. జాగ్రత మొదలు మోక్షమువరకుఁ గల సంసార నిర్వాహి. అంతఃకరణము, తద్విశిష్ట చిదాభాసుఁడు, తదధిష్ఠాన చైతన్యము, చేరి జీవుఁడనఁబడును. ప్రాణముల ధరించు **వాఁడు** (వ్య) త్వంపద వాచ్యార్థము.

**జంగమ మనస్సు**- వాక్కువలన వెలువడు అక్షరములు, మంత్రములు, స్వరములు.

**జంగమము**- చైతన్యముఁగలది. తిరుగునది అనఁగ చేతనము.

**జః**- జపము.

**జ్ఞాతృజ్ఞేయములు**- విజ్ఞానమయ కోశము.

**జ్ఞానతన్మాత్రలు**- శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు.

**జ్ఞానత్రయములు**- (1) సంజ్ఞాన, విజ్ఞాన, ప్రజ్ఞానములు. (2) స్వజ్ఞానము, ప్రాపకజ్ఞానము, ప్రాప్యజ్ఞానములు. వివరణ:— జీవుఁడైన తన రూప మెఱుఁగుటయే స్వజ్ఞానము, తన యభీష్టము నుత్తర కాలమునఁ దప్పక లభింపఁజేయు సాధన మెఱుఁగుట ప్రాపక జ్ఞానము. చేతనులచే బ్రార్థింపఁబడు ఫలమిట్టిదియని యెఱుఁగుట ప్రాప్య జ్ఞానము.

**జ్ఞానపాదము**- సమస్తమును తన యుపాసనామూర్తి కన్యము లేదని తలఁచి నిశ్చయించుకొనుట.

**జ్ఞానప్రతిబంధత్రయము**-

(1) భూత, వర్తమాన, భావి ప్రతిబంధములు. (2) సంశయము, అసంభావన, విపరీత భావనలు. సంశయముఁ దొలగించుట కుపాయము శ్రవణమున్ను అసంభావన దొలగించుట కుపాయము మనన మున్ను, విపరీత భావనను దొలగించుట కుపాయము నిధిధ్యాసము లనఁబడు దీర్ఘ యోచనయున్ను సాధనము లగును.

**జ్ఞానభూమికా సప్తకము**- శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్వాపత్తి,

సంసక్తినామిక, పదార్థభావన, తురీయములనునవి.

**జ్ఞానము-** అర్థమును ప్రకాశింపఁజేయునది. (అర్థ ప్రకాశోహి జ్ఞానమ్)

**జ్ఞానలింగము-** అనాహత చక్రమునుండి కుడివైపునకుఁ దిరిగి హృదయమునఁ బ్రవేశించుచున్న కుండలినీ శక్తి.

**జ్ఞానసాధ్యరాజయోగము-** నిర్వికల్ప సమాధి.

**జ్ఞానాగ్ని-** ఆత్మయందుండు పంచాగ్నులలో నొకటి.

**జ్ఞానాత్మ-** జాగ్రత్స్వప్న సుషుప్తులను మూఁడవస్థలకు సాక్షిగనుండు బ్రహ్మ చైతన్యము.

**జ్ఞానేంద్రియపంచకము-** కనులు, చెవులు, నాలుక, ముక్కు, చర్మము.

**జ్ఞేయము-** తెలియఁ దగినది. బాహ్యాంతరంబుల నిండియు, ఒక్క రూపుఁడయ్యు పెక్కు రూపములఁ జెలఁగుచు, సర్వభూతములకు భర్తయై, భోక్తయై, హేతువుగనుండునదియే జ్ఞేయ మనంబడును.

**జ్యేష్ఠము-** ప్రాణము. పెద్దది.

**జ్యోతిదర్శనసమయములు-** సూక్ష్మ పానముఁజేసి చొక్కియుండెడి వేళ, సామిత ధారణముచేసి మెలఁగు వేళ, జడళికపైనంబునడచివచ్చిన వేళ, సురతమైహాయినిసొక్కు వేళ, ఒంటరిగాఁ జీకటింటనుండెడివేళ, సలుకతోఁ బవళించినట్టి వేళ, తెరగొప్ప మనమున దిగులు చెందినవేళ, భక్తిఁ గన్నట్టి విరక్తివేళ, లభ్యాభావంబుఁ జూడసలక్షణముగఁ బండువెన్నెలగతి గానఁబడునుముక్తి మదరిపు విపాల మునిజన హృదయలోల వేణుగోపాల భక్త సంత్రాణ శీల.

**జ్యోతిష్మతి-** సత్వగుణ సంబంధమగు ప్రకాశము. మంచివెలుఁగు మానేరు తీగయను (మాల్కంగిని) ఓషధీ విశేషము.

**టిట్టిభాసనము-** చేతుల రెండింటిని నేలయం దూని, రెండు పాదములను శిరస్సు పైనుంచి వెనుక భాగమును పైకెత్తుట.

**తటస్థోపాసనలు-** కర్మ, బ్రహ్మ, సంబంధులు కాక, తటస్థముగనుండు కామ్య విద్యలగు ప్రతీకోపాసనములు.

**తత్-** సజాతీయ, విజాతీయ, స్వగత భేద శూన్యమునై, నామరూప రహితమునై సృష్టికిఁ బూర్వమునను. సృష్ట్య అనంతరమునను, ఏక రూపముననుండు సద్వస్తువు. ఇది తత్పదార్థము. దీనికి వాచ్యార్థము ఈశ్వర స్వరూపము, లక్ష్యార్థము పరమాత్మ స్వరూపము.

**తత్పదవాచ్యార్థుఁడు-** సమిష్టి శరీరాపస్థాత్రయాత్మకయైన మాయ. విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృత నామకంబగు మాయా బ్రతిబింబేశ్వర చైతన్యమగు నీశ్వరుఁడు.

**తత్త్వజ్ఞచతుష్టయము-** జీవన్ముక్తులఁ జూడుడు.

**తత్త్వత్రయము**– చిత్తు, అచిత్తు. ఈశ్వరుఁడు లేక జీవుడు, ప్రకృతి, బ్రహ్మము.

**తత్త్వాకాశము**– వివిధాశ్చర్య అపరిమిత కాంతులచే నిండియుండునట్టి యాకాశము. పంచాకాశములలో నొకటి.

**తత్త్వాధ్వము**– పృథివ్యాది తొంబది యారు తత్త్వములు.

**తద్వనమ్**– పరబ్రహ్మము. ప్రాణిసమూహమనెడి వనము (తస్య ప్రాణిజాతస్యవనం తద్వనం కేనోపనిషత్తు)

**తన్మయము**— సర్వకర్మ పరిత్యాగ పూర్వకముగ పర బ్రహ్మమునందుఁ గూడి యుండుట మైమఱపు.

**తన్మాత్ర**— తత్ అనగా సచ్చిదానంద మూర్తి, మాత్ర అనఁగ కొలత, (తత్ + మాత్ర) సచ్చిదానందమూర్తి యొక్క కాంతి వలనఁ గలుగు స్పందనముయొక్క పరిమితి.

**తనుమానసి**— శుభేచ్ఛ, విచారణల సాధనలు పూర్తియై, ధారుణములగు విషయేంద్రియముల త్రిప్పలలోఁ దగులక, మనస్సును క్షీణింపఁజేయు భూమిక.

**తనూనపాత్**— అగ్ని. తను అనఁగ గోవులు. నపాత్ అనఁగ మనుమడు, అనగగోవులవలన నేయిపుట్టుచున్నది. నేయి పోయుటవలన హోమకుండమునుండి అగ్ని రగులుచున్నది. కావున గోవులకు అగ్ని మనుమఁడని చెప్పఁబడినది.

**తపస్వి**— తపస్సుఁగలవాఁడు.

**తపస్సు**— ఉపవాసాదులచేఁ దనువును తపింపఁ జేయుట.

**తప్తకృచ్ఛ్రము**– మూఁడు రోజులు ఆరు పలముల వేఁడి నీరును, మూఁడు దినములు మూఁడు పలముల వేఁడి పాలను, మూఁడు దినములు ఒక పలము మేపకు వేఁడి నేయినిఁ ద్రాగి, మూఁడు దినములు శుష్కోపవాసము గావించు వ్రతము.

**తమస్సు**– స్వరూపాప్రకాశము. చీకటి.

**తలములు**– అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళములను ఏడు అధోభువనములు.

**తళఘులు**– వైష్ణవ మతమును స్వీకరించిన వందిమాగధులను భట్రాజులు.

**తక్షకుఁడు**– సర్ప విశేషము. దీనికి కుంచెలువలె శరీరమున గుర్తుండును, వడ్రంగి.

**తాదాత్మ్యత్రయము**– సహజన్య, కర్మజన్య, భ్రాంతిజన్యములు.

(1) సహజన్యతాదాత్మ్య మనఁగ, అహంకారమునందు ప్రతిబింబించి ఆ ప్రతిబింబమున్ను ఆ యహంకారమున్ను కూడి తప్తాయః పిండమువలె నొక్కటై చిత్తువలెఁ దోచుట.

(2) కర్మజన్యతాదాత్మ్య మనఁగ, చిత్ప్రతిబింబమునుగూడి చిత్తువలెఁ దోచునట్టి యహంకారము స్థూల దేహముతోఁ జేరినపుడు, దానికి కర్మజన్య తాధాత్మ్యమని పేరు.

(3) భ్రాంతి జన్యతాదాత్మ్య మనఁగ, వర్ణాశ్రమములను అంటగట్టుకొని

యుండు, చిత్తవృత్తులతోఁగూడి యుండెడు అహం శబ్దార్థమైన సాక్షితోడి తాదాత్మ్యము, భ్రాంతి జన్యతాదాత్మ్యమనఁబడును.

**తాదాత్మ్యము-** ఏకీభావము. కూడిక లేక కలయిక.

**తామసజ్ఞానము-** కారణము లేనిదియు అసత్యమునునైన యొక కార్యమే సర్వార్థసిద్ధియని దానియం దాసక్తిఁ గలిగియుండునట్టి జ్ఞానము.

**తామసతపస్సు-** తెలివిలేని పట్టుదలతోడను కష్టముగను జేయు తపస్సు.

**తామసపూజ-**భూతప్రేతములకుఁజేయు పూజ.

**తామిస్రము-** విషయ భోగేచ్ఛకు విఘాతము కలుగుట వలనఁ గలుగు క్రోధము.

**తారకము-** ఓంకారము. వివేకమువలనఁ బుట్టిన జ్ఞానము.

**తారము-** ఓంకారము. ఈ యోంకారము నుచ్చరించుట వలన జననమరణ రూపమగు సంసారమును దరింపఁ జేయును కావున తారమనంబడును.

**తార్కికమతము-** జగత్తునకు పరమాణువులే కారణమను సిద్ధాంతముగల మతము. ఈ దర్శనమునకు కాణాదమను పేరుకూడ కలదు. దీని మూలకర్త కణాదుఁడను ఋషి.

**తితీక్ష-** ప్రారబ్ధ వశమునఁ గలుగు సుఖదుఃఖాదులగు ద్వంద్వముల సహించుట.

**తిరుపణ్యులు-** వైష్ణవ మతమును స్వీకరించిన పంచములు.

**తిరుమంత్రరహస్యము-**బదరికాశ్రమమందు పరమేశ్వరావతారమగు నరుని విషయము.

**తిరుమంత్రము-** విశిష్టాద్వైతులనుసంధానముఁజేయు అష్టాక్షరియను ప్రణవపూర్వక నమోనారాయణాయ అను మంత్రము. ఇందు మూఁడు పదములుగ విభజింపబడి మూఁడర్థముల దెలుపుచున్నది. మొదటి పదమగు ఓంకారమున శేషత్వమున్ను, రెండవ పదమగు నమః అను దానికి పారతంత్ర్యమున్ను, మూఁడవ పదమగు నారాయణాయ అను దానికి కైంకర్యమున్ను, తెలుపుచున్నవి.

**తిరోధానమలము-** పర బ్రహ్మమందు అనిత్య బుద్ధినిఁ బుట్టించి బ్రహ్మేతరమందు సత్యబుద్ధినిఁ గలిగించి దుఃఖింపఁ జేయునది.

**తులసి-** విష్ణు పూజకు మిగుల శ్రేష్ఠమగు పత్రి. తులసియందు పెక్కు సుగుణములుండుటచే భక్తులకేకాక వైద్యులకును ప్రియతమమైనది. తులసికి సంస్కృతమున "సురస" యనియు, తెనుఁగున "గగ్గెర" యనియు, ఆంగ్లమున "హోలీబేసిల్" అనియు, పేర్లు. తులసిలోఁ బలు జాతులుగలవు. తులసి, కృష్ణతులసి, రామతులసి, లక్ష్మీతులసి, మరువకతులసి వీనిని మాత్రమే భగవదార్చనకుపయోగింతురు. భూతులసి, అడవితులసి, రుద్రజడతులసి. కుక్కతులసి. వీనిని మందులకు మాత్రమే యుపయోగింతురు.

**తురీయము-** నాల్గవ అవస్థ. బ్రహ్మము. నాల్గవది. సప్తజ్ఞాన భూమికలలోనొకటి.

మొదలట్టి యారు భూమికల నెఱింగి, దేనియందును భేదము లేమినిందెలిసి కొని, పరబ్రహ్మ స్వరూపముగనుండు స్థితి. ఈ యేడవ భూమికను బొందిన పురుషుఁడు నిరంతరము నిర్వికల్ప సమాధి యందుండుచు, నెప్పుడును మేల్కొనఁడు. ఇతరులు లేపినను లేవఁడు. ఈతఁడే బ్రహ్మవిద్వరిష్ఠుఁడను జీవన్ముక్తుఁడు. (తురీయము, అర్ధమాత్రకము, ఎరజ, ఉన్మని, శుద్ధసత్త్వము ఇవి సమానార్థకములు)

**తురీయానందము-** అష్టవిధానందముల మీఱిన నిర్విషయానందము.

**తుర్యగ-** ఏడవ జ్ఞాన భూమిక.

**తుర్యగావివిధనామములు-** తుర్యగ, తురీయగ, తుర్యగతి, తుర్యావస్థ, తురీయావస్థ, ప్రణవస్వరూపము ఇత్యాదులు.

**తుర్యము-** పంచావస్థలలో నొకటియగు నాల్గవ యవస్థ. జ్ఞానభూమికా సప్తకమున నాల్గవ భూమికయగు సత్త్వాపత్తికిన్ని ఏడవ భూమికయగు తుర్యగా యను దానికిన్ని పేరు.

**తూలావిద్య-** జీవునియందు గల్గిన యవిద్య.

**తృణజలూకన్యాయము-** ముంగాళ్లతో నొక తృణముం బట్టుకొని వెనుకటి కాళ్ళను విడచిపెట్టు పురుగు వలె, జీవుఁడు వేఱొక శరీరమును జూచుకొని యీ శరీరమును విడచుచున్నాడనుట.

**తేజస్సు-** మహత్పంచ భూతములలో నొకటియగు శబ్ద, స్పర్శ, రూపములను మూడు గుణములుగల అగ్ని. ప్రకాశము.

**తైజసుఁడు-** స్వప్నావస్థయందు అంతఃప్రజ్ఞఁ గలిగి సూక్ష్మ ప్రపంచము ననుభవించు జీవుడు.

**తైతిలము-** స్థైర్యము లేక గమనము.

**తంత్రములు-** కర్మలు, యుక్తులు, బ్రహ్మ స్వరూపమగు మోక్ష స్వరూపమును ప్రతిపాదించు గ్రంథములు. ఇవి కపిలాదులచేఁ జేయఁబడెను. వీని కనుకూలముగ పంచశిఖుడు మున్నగు మునులు కొన్ని స్మృతుల రచించిరి. అర్థ విశేష పరిజ్ఞానమును కల్గించునది యగుటచే తంత్రమనఁబడును. (తంత్ర్యతే "వ్యుత్పాద్యతే" అనేనేతి తంత్రం)

**తంద్రి-** నిద్రకుముందు వచ్చునట్టి సోమరితనమునైన తామస వృత్తి.

**త్రయోదశేంద్రియములు-** జ్ఞాన, కర్మేంద్రియములు పది, మనోబుద్ధ్యహంకారములు మూఁడు అంతు పదమూఁడు.

**త్వంపదవాచ్యార్థుఁడు-** జీవుఁడు.

**త్వంపదార్థము-** దేహేంద్రియాదుల కతీతమై, సాక్షిభూతమగు చైతన్యము. దీనికి వాచ్యార్థుఁడు జీవుఁడు లక్ష్యార్థము పరమాత్మ స్వరూపము.

**త్వష్ట-** వజ్రాయుధముఁ జేసినశిల్పి.

**త్వగింద్రియము-** జ్ఞానేంద్రియములలో నొకటి యగు చర్మము.

**త్రికాలములు**-భూత భవిష్యద్వర్తమాన కాలములు.

**త్రికూటము**- భ్రూమధ్యస్థానము. ఇడా పింగళా సుషుమ్నానాడులు కలయు చోటు. పర్వత విశేషము.

**త్రిగుణములు**- రజస్సత్వతమో గుణములు.

**త్రిగుణసమయములు**- సోమ, గురు వారములందు ఉదయాది సత్వగుణ వేళ. మంగళ,శుక్రవారములందు ఉదయాదిగరాజసవేళ. ఆది, బుధ,శనివారములందు దయాగతామస గుణవేళ.

**త్రిదండి**- త్రికరణములఁ పాపకార్యములఁ జొరనీయక దండించువాడు. (వాగ్దండో మనోదండకాయ దండ స్తథైవచ, యస్యైతే నిహితాబుద్ధి త్రిదండీతి న ఉచ్యతే) త్రికరణములనగ మనస్సు, వాక్కు, కాయములు, వైష్ణవ సన్యాసి.

**త్రిదోషములు**- అతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభములు.

(1) అతివ్యాప్తి, యనఁగ నొక లక్ష్యమునకుఁ జెప్పఁబడిన లక్షణము, వేరొక లక్ష్యమునకు నూడ నుండుట.
(2) అవ్యాప్తి యనఁగ నొక లక్ష్యమునకుఁ జెప్పఁబడిన లక్షణము నాలక్ష్యముయొక్క ఏకదేశమున లేకుండుట.
(3) అసంభవము అనగ ఒక లక్ష్యమునకుఁ జెప్పఁబడిన లక్షణము నాలక్ష్యమం దెంతమాత్రమును లేకుండుట.

**త్రిపాదములు**- ఉకార, మకార, అర్ధ మాత్రా స్వరూపములైన విద్యా పాదము, ఆనందపాదము, తురీయ పాదములు.

**త్రిపుటి**- జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు. ద్రష్ట. దృశ్య, దృష్టులు.

**త్రిపుటిత్రియము**- (1) జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు. (2) ద్రష్ట దర్శన దృశ్యములు. (3) కర్తృ, కర్మ, కార్యములు.

**త్రిపుటిభేదములు**— బాహ్య త్రిపుటి, అంతర త్రిపుటి, అంతరాంతర త్రిపుటి.

**త్రిపుండ్రములు**— శైవ, వైష్ణవాది మతస్థులు నొసట ధరించెడు మూఁడు లేఖలు.

**త్రిమూర్తులు**— బ్రహ్మ, విష్ణు, రుద్రులు.

**త్రిరత్నములు**— జైన మతమునందలి మోక్ష సాధనములగు సమగ్దర్శనము, సమ్యక్ జ్ఞానము, సమ్యక్చరిత్రములు.

**త్రిరాత్రికృచ్ఛ్రము**— మూఁడు దినములుపవసించు వ్రతము.

**త్రివిధక్రియలు**— మణి, మంత్ర, ఔషధములు.

(1) మణి:-పాదరసమును గడ్డకట్టించి సారణలిచ్చి మణిగా నొనర్చి యామణి మహిమచేఁ గొన్ని సిద్ధుల నలవరచు కొనుట.
(2) మంత్రము:- మంత్ర శాస్త్రరీత్యా మంత్రసిద్ధిఁ గావించుకొని స్తంభన మారణాది క్రియల నొనర్చుట,
(3) ఔషధము:- అంకోలము

మొదలైనవృక్షమూలికలచేసిద్ధించగల ఆకలి దప్పులు లేకుండుట, వ్యాధులు లేకుండఁ జేసికొనుట, యిత్యాదులు.

**త్రివిధతపస్సులు**— శారీరక తపస్సు, వాచిక తపస్సు, మానసిక తపస్సు.

**త్రివిధదోషములు**— త్రిదోషములఁ జూడుము.

**త్రివిధమౌనములు**— వాఙ్మౌనము, అక్షమౌనము, కాష్టమౌనము.

**త్రివృత్సూత్రము**— ఒక్కొక్క పేటయందు మూడేసి దారములుఁ గలది. జంధ్యము (యజ్ఞోపవీతము)

**త్రివృత్కరణము**—జలము,అన్నము, ఓజస్సు, ఈ మూడింటిని పంచీకరణమున పంచ భూతముల కలుపునట్లు జలార్ధభాగమున తక్కిన రెండింటిని పాతిక భాగమున కలుపుట. అట్లే తక్కినవికూడ. సత్వరజస్తమో గుణములుకూడ ఒకటితోనొకటి పైవిధముగ కూడును. అదియు త్రివృత్కరణమే.

**త్రివేణీసంగమము**— భ్రూమధ్యస్థానము. ప్రయాగ క్షేత్రమున గంగా యమునా సరస్వతీ నదులు కలియు చోటు.

**త్రిశక్తులు**— ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి.

**త్రిసంధ్యలు**— రాత్రికి, పగటికి, మధ్యకాలమగు ప్రాతఃకాలమున గాయత్రీ దేవ్యుపాసన ప్రాతః సంధ్య.
పూర్వాపరయామములకు సంధికాలమగు మధ్యాహ్నమునఁజేయు సావిత్రీ దేవ్యుపాసన మాధ్యాహ్నిక సంధ్య.
పగటికి, రాత్రికి సంధికాలమగుప్రొద్దు గ్రుంకెడి వేళలో జేయుసరస్వతీదేవ్యుపాసన సాయం సంధ్య.

**త్రిస్థానములు**— భ్రూమధ్యము, కంఠము, హృదయము.

**త్రిస్థూణములు**— సంచిత, ఆగామి, ప్రారబ్ధకర్మలు.

**త్రేతాగ్నులు**— గార్హపత్య,ఆహవనీయ, దక్షిణాగ్నులు, ఈ యగ్నుల నారాధించువారు త్రేతాగ్నులనఁబడుదురు.

**త్రైవర్ణికులు**— వైష్ణవ మతమును స్వీకరించిన కోమట్లు.

**దమము**— బాహేంద్రియ నిగ్రహము. అనగా నింద్రియముల విషయముల నుండి మరల్చుట.

**దర్భాసనము**— రెల్లుగడ్డితో అల్లబడిన తడికె. కుశాసనము (కుశాసనే జ్ఞానసిద్ధి)

**దశవిధనాడులు**— ఇడా, పింగళా, సుషుమ్న, గాంధారి, హస్తి, పూష, పయస్విని, అలంబుస, కుహు,శంఖినీ అను నరములు.

**దశనాములు**— శ్రీ శంకరాచార్యుల సంప్రదాయము ననుసరించిన సన్యాసులకు సరస్వతీ, పురి, భారతి, పద్మ, తీర్థ, ఆశ్రమ, వన, అరణ్య, పర్వత, సాగర, అను బిరుద నామములు. నామాంతరమున సంప్రదాయమును గుర్తించుటకై యుంతురు. వీరినే దశనాము లందురు.
**ఉదా॥** సుబ్రహ్మణ్యభారతి, విద్యారణ్య, రామతీర్థ యిత్యాదులు.

(తీర్థాశ్రమ వనారణ్యగిరిపర్వతసాగరాః సరస్వతీ భారతీచైవ పురీతి దశ నామకాః)

**దశబలములు**— బుద్ధి, కాంతి, వీర్యము ధ్యానము, కృప, శీలము, బలము, దానము, శ్రద్ధ, ఉపేక్ష. ఇవికలవాఁడు దశబలుఁడు.

**దశవిధప్రణవనాదములు**— యోగాభ్యాస కాలమున ప్రాణాయామాదులొనర్చునపుడు యోగికి వినఁబడునట్లు హృదయమునుండి కలుగు శబ్దజాలము. చిణి, చిణిచిణి, ఘంట, శంఖ, వీణ, తాళ, వేణు, భేరి, మృదంగ, మేఘగర్జన, ఇవి సాధకునకు వినఁబడును.

**దశవిధవైష్ణవులు**— యామునేయులు లేక శ్రీవైష్ణవులు, కులశేఖరులు, త్రైవర్ణికులు, చాత్తానులు,నంబిళ్లలు, నంజియ్యరులు, తళఘులు, గౌణులు కైవర్తులు, నాచ్చాంబిళ్లలు.

**దశాంగధూపము**— గంధకము, మహిషాక్షి, గుగ్గిలము ప్రతీది ఐదేసి భాగములు. శ్రీచందనము, జటామాంసి, ప్రతీది నాలుగేసి భాగములు. సర్జరసము, కురువేరు, ప్రతీది మూఁడేసి భాగములు నేతితో వేయించిన నఖము చిప్పలు, వెట్టి వేళ్ళు, ప్రతీది రెండేసి భాగములు, పచ్చకర్పూరం కస్తూరి ఒక్కభాగము.ఈదశాంగధూపము వేసినచో నవగ్రహ దోషములు శాంతించును. పిశాచములు పారిపోవుటయే గాక ఈశ్వర ప్రీతికరమైనదికూడ అగును. (నశ్యంతి యస్య ధూపే నవగ్రహ పిశాచకాః) (దశాంగ విపధూపస్తు రుద్రస్యాపి మనోహరేత్) అర్క ప్రకాశము.

**దశాంగులం**— (1) మాయాప్రకృతి, ఐదు భూతములు, అంతఃకరణ చతుష్టయము. (2) కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ దశకము. (3) దశదిశలు. (4) నాభికిపైన పదియంగులముల ప్రదేశమునందలి హృదయ గుహ. వీనిని దశాంగులము లందురు. (సభూమీ విశ్వతోవృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులం)

**దశేంద్రియములు**— జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు.

**దశోపనిషత్తులు**— ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య. బృహదారణ్యోపనిషత్తులు.

**దహరము**— హృదయ కమలము, సూక్ష్మము.అల్పము. (తతో రక్తోత్పలాభాసం హృదయాయతనం మహత్, దహరం పుండరీకంతత్ వేదాంతేషుని గద్యతే) సూ— హృదయ కమలమును జూడుడు.

**దహరాకాశము**— హృదయకమలమున నున్న సూక్ష్మాకాశము.

**దక్షిణాగ్ని**— త్రేతాగ్నులలో నొకటి.

**దక్షిణాయనము**— కటక రాశియందు సూర్యుఁడు ప్రవేశించుకాలము.

**దాన్త్యులు**—దమముఁగలవారు.దమము— అంతరింద్రియ నిగ్రహము, దీనిని గలవారు.

**దారేషణ**— భార్యయం దనురక్తి.

**దివ్యస్నానము**— ఎండ కాయుచు

వర్షము కురియునపుడు చేయు స్నానము.

**దీర్ఘప్రాణాయామము**— నియమిత సంఖ్యకన్న నెక్కువగఁజేయు ప్రాణాయామము.

**దీక్షాత్రియము**— (1) స్వస్తికారోహణ దీక్ష, స్పర్శదీక్ష, దృగ్దీక్ష లేక వేదదీక్ష. (2) దృగ్దీక్ష, వాగ్దీక్ష, స్పర్శదీక్షలు (3) అణవదీక్ష, శాంభవదీక్ష, శాక్త దీక్ష.

**దురోణము**— యజ్ఞమునందు సోమరసముంచునట్టి పాత్రము. గృహము.

**దుర్దర్శనుఁడు**— అత్యంతాయాసముచేఁ దెలియఁదగినవాఁడు.

**దూ**— ప్రాణదేవత. ఈ దేవతకు మృత్యువు దూరమున నుండుటచే నీపేరు గల్గెను.

**దృక్కు**— చూచువాఁడు. సాక్షి.

**దృక్కు పర్యాయనామములు**— సంవిత్తు, జ్ఞప్తి, జ్ఞానము, బోధము, చైతన్యము.

**దృఢజ్ఞానము**— సంశయ విపరీతములు లేని జ్ఞానము.

**దృశ్యము**— చూడఁబడునది.

**దృష్టవిషయము**— స్త్రీ సంభోగము, అన్నపానములు, ఐశ్వర్యమున్నగు ఐహికభోగములు.

**దేవుఁడు**— బుద్ధి బలముచేఁ బ్రకాశించు విద్వాంసుఁడు.

(1) స్వయం ప్రకాశేన దీవ్యతి ఇతి దేవః

(2) విద్వాన్ సోహిదేవః

**దేవత్రియము**— వసు, రుద్ర, ఆదిత్యులు.

**దేవదత్తవాయువు**— ఆవులింతలఁ గలుగఁజేయు వాయు విశేషము.

**దేవయానము**— అర్చిరాది మార్గము, సూర్యనాడిగుండ ప్రాణమును వదలిపోవుట. సూర్యలోకము.

**దేవాష్టకము**— బ్రహ్మ, ప్రజాపతి, దేవ, గంధర్వ, యక్ష, రాక్షస, పితృ, పిశాచములు.

**దేశకృతపరిచ్ఛేదము**— ఒక చోటనుండి మరియొకచోట లేకుండుట.

**దేశకృష్టప్రాణాయామము**— నాశికనుండి పండ్రెండంగులముల వరకు శ్వాసమును విడచుట.

**దేశదీర్ఘప్రాణాయామము**— నాశికనుండి పదియారంగుళముల వరకు రేచించుట.

**దేహళీదీపన్యాయము**— ఇంటి గడప యందుంచిన దీపము, ఇంటి లోపలను, వెలుపలను ప్రకాశించునట్లు రెండు విధములుగా నన్వయింపఁ జేయుట.

**దేహత్రియము**— స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు.

**దేహి**— దేహమునకు ఒడయుఁడు, జీవుఁడు.

**దైనందినప్రళయము**- బ్రహ్మదేవుఁడు నిదురించునపుడు పంచభూత శేషముగఁ గలుగు ప్రళయము.

**దైవతీర్థము**- చేతివ్రేళ్ళ తుదనుండి విడచెడు దేవ సంబంధమగు తీర్థము.

**దైవవిత్తము**- దేవతాజ్ఞానము. దేవుని సొమ్ము.

**దైవసంపద**- సత్త్వగుణ ప్రధానములగు శాంతము, మర్యాద, తత్త్వ విచారము, బుధజన సేవనము మున్నగునవి.

**దండప్రణామము**- దేహమును దండాకారముగ భూమియందుంచి, కాలు సేతులను చాచి, రెండు హస్తములను మొగ్గవలె ముడిచి చేయు నమస్కారము. (నిధాయ దండవద్దేహం, ప్రసార్య చరణౌ కరౌ, బద్ధ్వాముకుళవత్పాణీ ప్రణామో దండ సంజ్ఞితం)

**దండము**- లాతాము. యోగ దండము, హంసదండము, కొయ్య, శిక్ష. నమస్కారము, నీతి, లాతాము ను చూడుడు.

**దండాసనము**- కూర్చుండి చేతివ్రేళ్ళను జేర్చి బొమ్మనందుంచుకొని, కాలి మడమలను ఆనికాఁజేర్చికొని తొండలను, చీలమండలను, పాదములను, భూమియందు చక్కగ నానునట్లు చాచి, దండమువలె శయనించుట, శవాసనము.

**దాంతుఁడు**- తపఃక్లేశాదుల నోర్చువాఁడు.

**ద్వయము**- విశిష్టాద్వైత సాంప్రదాయ సిద్ధమగు పవిత్ర మంత్రము. శ్రీమన్నారాయణ చరణం శరణం ప్రపద్యే అను తిరువద్యేయము. విష్ణులోకమందు పరమేశ్వరుని దేవియగు పెరియపిరాట్టియను ప్రకృతియగు లక్ష్మీమాతయొక్క సహాయమున పరబ్రహ్మమగు విష్ణుదేవుని ప్రసన్నుని గావించుకొన వచ్చునను నిశ్చయము.

**ద్వంద్వములు**- రాగద్వేషములు. సుఖదుఃఖములు మున్నగు జంటలు.

**ద్రష్ట**- చూచువాఁడు.

**ద్రవ్యభ్రమ**- పృథివ్యాది ద్రవ్యముల వలనఁ బుట్టిన శరీరమును నాత్మగ భ్రమించుట.

**ద్రవ్యాద్వైతము**- తనకును జాయా సుతాదులకును నితరప్రాణులకును దేహము; పంచ భూతాత్మకత్వము నొక్కటేయనియు, పరమాత్మ స్వరూపమున నొక్కటేయనియు నభేదముగ నాలోచించి యందఱి యర్థకామముల నొక్కటిగాఁ జూచుట.

**ద్రోణకలశము**- యజ్ఞములందు సోమరసము నుంచుటకై చేయఁబడిన పాత్ర.

**ద్వాదశతేజోలింగములు**- సేతుసీత నగముల మధ్యగల శివలింగములు పంచభూతముల పేరుతో స్థాపితమైనవి.

(1) సౌరాష్ట్ర దేశమందలి సోమనాథ లింగము,

(2) శ్రీశైలమందలి మల్లిఖార్జున లింగము.

(3) ఉజ్జయినియందలి మహాకాళేశ్వర లింగము.

(4) చేదిదేశముననున్న అమరేశ్వర మందలి ఓంకారేశ్వర లింగము.
(5) హిమనగరమున కేదార నాథమందలి కేదార లింగము.
(6) ఢాకినీ క్షేత్రముననున్న భీమ లింగము.
(7) కాశీ క్షేత్రమందలి విశ్వేశ్వర లింగము.
(8) నాశిక సమీపస్థమగు త్ర్యంబక పర్వతమందలి గౌతమేశ్వర లింగము.
(9) చితాభూమి వైద్యనాథ ధామ మందలి విద్యానాథ లింగము.
(10) ద్వారకయందలి నాగేశ్వర లింగము.
(11) రామేశ్వరమందలి రామనాథ లింగము.
(12) నిజాము రాజ్యమున డియోఘర్ నందలి ఘృష్టేశ లింగము.

**ద్వాదశనదీనదపుష్కరములు—** పుష్కరుఁడు, పుణ్య సరస్సు, ఆయా నదీనదములందు పండ్రెండేండ్లకొకపరి సంగమించి పండ్రెండు దినములుందురఁట. బృహస్పతి గ్రహము మేషాదిగ నొక్కొక్క రాశియందు ప్రవేశించు నపుడు ఒక్కొక నదీపుష్కరమగును. బృహస్పతి వదలిన రాశికి మఱల వచ్చుటకు పండ్రెండేళ్లగును. కావునఁ బుష్కరమనినఁ బండ్రెండేళ్ళని ప్రజలు వాడుకొనుట ప్రసిద్ధము. బృహస్పతి మేషరాశినిఁ బ్రవేశించు సమయమే గంగాపుష్కరము. ఇట్లు బృహస్పతి వృషభ ప్రవేశమున నర్మదానదమునకును, మిథున ప్రవేశము సరస్వతికిని, కర్కట ప్రవేశము యమునకును, సింహప్రవేశము గోదావరికి, కన్యా ప్రవేశము కృష్ణవేణికి, తులా సంక్రమణమున కావేరికి, వృశ్చికమునఁ దామ్రపర్ణికి, ధనుః ప్రవేశమున సింధుకు, మకరమున తుంగభద్రకు, కుంభ ప్రవేశమున భీమరథికి, మీన సంక్రమణమున తపతీ నదమునకు పుష్కరములగు. తపతికి ప్రాణహితా యను నామాంతరము గలదు.

**ద్వాదశసూర్యకళలు—** తపినీ, తాపినీ, ధూమ్రా, మరీచి, జ్వాలినీ, రుచి, సుషుమ్నా, భోగదా, విశ్వా, బోధినీ ధారుణీ, క్షమా.

**ద్వాదశాదిత్యులు—** అర్యముఁడు మిత్రుఁడు, అరుణుఁడు, అర్కుఁడు. భగుఁడు, ఇంద్రుఁడు, వివస్వంతుఁడు, పూషుఁడు, పర్జన్యుఁడు, త్వష్ట, విష్ణువు, అజఘన్యుఁడు.

**ద్వాదశాక్షరీమహామంత్రము—** ఏతన్మిద్వా శుద్ధ వియత్కించిన్నాస్తి. (అంతా బట్టబయలు ఏమియు లేదు) అనంతోపనిషత్తులోనిది. షోడశాక్షరి మంత్రమును జూడుడు.

**ద్వాదశాంతము—** బ్రహ్మ రంధ్రము, సహస్రారకమలము. వివరణ:- ఆజ్ఞా చక్రమునకు మీదనుండి చిచ్ఛక్తికి యొక యంగుళమువరకు శక్తి యనియు, అందు పై మూడంగుళముల వరకు వ్యాపినియనియు, దానికిపై నాలుగంగుళములవరకు సమనయనియనియు, ఆమీద నాలుగంగుళముల వరకు ఉన్మనియనియు పేర్లు. ఈ పండ్రెండంగుళములకు పైనుండు

నని బ్రహ్మరంధ్రము, దీనినే ద్వాద శాంతమందురు. అనాహతమునకు గూడ ద్వాదశాంతమని కొందఱను చున్నారు.

**ద్వాదశేంద్రియములు**— జ్ఞానేంద్రియ కర్మేంద్రియములుపది. మనోబుద్ధులు రెండు చేరి పండ్రెండు ఇంద్రియ ములు.

**ద్వామిష్యాయణుఁడు**— కొడుకులు లేని తండ్రి తన కూతురిని కన్యా దానము చేయునపుడు నీ కన్యాగర్భ సంజాతుఁడగు పుత్రుఁడు తనకున్న పారలౌకిక క్రియల నాచరింపవలయు నని అల్లునితో నొడంబడికఁగావించు కొనిన యెడల నా కన్యకు పుట్టిన పుత్రుఁడు.

**ద్విమాత్రికాలము**— దీర్ఘాక్షరోచ్చారణ కాలము.

**ద్వివిధసుఖములు**— ఇహ పర సుఖ ములు.

**ద్వివిధధ్యానములు**—సగుణ ధ్యానము నిర్గుణ ధ్యానములు.

**ద్వివిధప్రారబ్ధములు**— అభ్యుపగత ప్రారబ్ధము, అభ్యుపగత ప్రారబ్ధము

**ద్వివిధమార్గములు**— ఇష్టా పూర్తము లొనర్చినవారు చంద్రలోకమున కరి గెడి ధూమాది మార్గము. వైరాగ్యోపశాంతి గలవారు సూర్యలోక మున కరిగెడి అర్చిరాది మార్గము.

**ద్వివిధవాక్యములు**— జీవేశ్వర భేద నిరూపణ యుక్తములగు అవాంతర వాక్యములు జీవేశ్వరులకైక్య నిరూ పణ యుక్తములగు మహావాక్య ములు.

**ద్వేషము**— దుఃఖానుభవానంతరము అంతఃకరణమున నా దుఃఖ కారణ విషయములందు గలుగు క్రోధము. దీనికి పర్యాయనామములు. దుఃఖ ప్రతిఘాతము, మన్యువు, జిఘాంస, క్రోధము ఇత్యాదులు.

**ద్వేషక్లేశము**— పంచక్లేశములలో నొకటి. అనగా నుదర పోషణార్థము. పరుల నాశ్రయించి వారి వలనఁ దన యభిమతము కొనసాగనందున వారల ద్వేషించుట.

**ద్వైతజ్ఞానము**— భేదజ్ఞానము. చిత్తు, జడము, ఈశ్వరులను త్రివిధభేద ములు కలదు,

**ధనగతిత్రయము**— దానము, భోగము, నాశము.

**ధనురాసనము**— పాదాంగుష్ఠముల రెంటిని రెండుచేతులతో ధనురాకృతిగ వీపువైపునఁ జెవుల వరకు సరిగ బట్టి యుండుట.

**ధర్మసమ్మూఢులు**— ధర్మమును నిర్ధా రణఁ జేయఁజాలని మూఢులు.

**ధాతుసప్తకము**— త్వఙ్మాంస రుధిర మేధోఽస్థి మజ్జా శుక్రములు.

**ధారణ**— నాభి మున్నగు చక్రాదులందు చిత్తమును చలింపక నిలుపుట. ప్రణవ నాదముల వినుటయందు చొక్కిన మనస్సు. చపల చిత్తమును పూర్తిగవిడచి రెక్కలు విరిగిన పక్షి యెగురఁజాలనియట్లు చలింపశక్తిలేక స్థిరత్వమునుఁ బొందిన యవస్థ.

"దేశబంధచిత్తస్యధారణా" వలనిన తావున రెండుగంటల ముప్పదిమూడు మినిట్ల ముప్పదియారు సెకండ్ల కాలము కుంభకముననుండి మనసు నిలుపుట.

**ధ్రువతారకము**-అనుజ్ఞాతృ చైతన్య స్వరూపము.

**ధూమాదిమార్గము**- పితృయానము, కృష్ణగతి, దక్షిణాయనము, పితృయానము, ధూమాదిమార్గము ఇవి సమానార్థకములు.

**ధృతి**- ధారణము. ధైర్యవృత్తి, మోక్ష విషయిక జ్ఞానము. శాస్త్రజ్ఞానము, గురుభక్తి, నానావిషయముల సిద్ధి, సిగ్గు మున్నగువానిచేత మనస్సునకు ఇచ్ఛ లేక యుండుట ధృతి యనంబడును.

**ధృతిత్రయము**- సత్వ రజస్త మో ధృతులు.

**ధైర్యరేతస్కుఁడు**-గతకాలమున వీర్యము స్ఖలనమైపోయి యుండినను, పట్టుదలవహించిపంద్రెండేండ్లు బ్రహ్మచర్య మనుష్ఠించినవాఁడు.

**ధ్యానము**- ధారణఁజేయఁబడిన విషయమందేకాగ్రతఁగలిగి, ధ్యానేతర వస్తువులను చిత్తమునకు రానీయమి.

**ధౌతికర్మలు**-హఠయోగులు తమకు కాసము, ప్లీహము, కుష్ఠువు, కఫ రోగములు మున్నగు వ్యాధులు రాకుండుటకైచేయునట్టి జలధౌతి, సూత్రధౌతి, వస్త్రధౌతి, పవనధౌతులు అను క్రియలు.

**నకులీశశైవము**- గోదావరీనదీతీరస్థమగు, అమర్దక మఠాధిపతిగనుండిన దూర్వాసగురుఁడు రచించిన పాశుపత మత సాంప్రదాయ యోగాచార్యులలోఁ గడపటివాఁడగు నకులీశునిచేఁ ప్రచారమొనర్పఁబడిన కాలాముఖశైవమని మారుపేరుగల పాశుపత మతము.

**నభోముద్ర**-యోగాభ్యాస విధానమునఁ జెప్పఁబడిన నిరువది ముద్రలలో నొకటియగు నాలుకను నోటియందే పైకెత్తి కొండనాలుకవరకుఁజాచి చిఱునాలుకను అదిమిపట్టి శ్వాసమును నిరోధించు ముద్ర.

**నమస్కారంపఁగూడనిసమయములు**- దేవాలయే, సభామధ్యే, తీర్థే, రాజగృహేపుచ, సూతకే, మృతకేచైవ, నమస్కారంతువర్జయేత్॥ మఱియు, దూరస్థం, జలమధ్యస్థం, ధావంతం. ధనగర్వితం, అభ్యంగనాదివేళాయాం, నమస్కారంతు వర్జయేత్॥

**నరాధములు**-ప్రజ్ఞావంతుఁడగు మహనీయుని సామీప్యమొనగూడియు సతని వలన తన సందియములనడిగితెలిసికొననివారు. (ప్రాజ్ఞంప్రాప్యనపృచ్ఛంతి యేనకేన నరాధమాః)

**నవచక్రములు**- (1)మూలాధారమందు ముక్కోణవృత్తమగు బ్రహ్మచక్రము. (మూలాధారే త్రిధావృత్తం బ్రహ్మచక్రం భగోపమం)

(2) స్వాధిష్ఠానమను చక్రము దీని యందు నాలుగు దళములు గలదు అదియే ఉడ్యాణమగును. (స్వాధిష్ఠా

నంతతశ్చ చక్రం తత్రచాతుర్దళాం బుజం)

(3) మణిపూరకము చక్రము లేక ఐదు చుట్లు గలిగి సర్పాకారముగ మెరయుచుండు నాభి చక్రము. (పంచావర్తం నాభిచక్రం సర్పాకారం తటిన్నిభం)

(4) అనాహతము:ఎనిమిది దళములు గలిగి అధోముఖముగా వ్రేలాడు చుండు హృదయ కమలము (అధో ముఖాష్ట పత్రాయుతం హృచ్చక్రమి ష్టదం)

(5)విశుద్ధి: నాలుగువ్రేళ్ళకొలతంగలిగి యైదవదియగు కంఠ చక్రము. (పంచమం కంఠచక్రంచ తద్రాంగులి చతుష్టయే)

6. అజ్ఞాచక్రము: లోపలి నాలుక యడుగు భాగమునంగల ద్వారమగు శూన్యస్థలము. ఘంటికాలింగమూల మనియును చెప్పుదురు. (షష్ఠంచ ఘంటికాలింగమూల తద్రాజదంతకం)

(7) భూచక్రం- ఒక నాళము కలిగి మంచి వాక్కునిచ్చు కందము. (భూచక్రం సప్తమంత్వేకం నాళం కందం సువాక్ప్రదం)

(8) నిర్వాణచక్రము- బ్రహ్మరంధ్ర మందు సూక్ష్మమైననిర్వాణమను నెనిమిదవ చక్రము (బ్రహ్మరంధ్రేఽష్టమంచక్రం నిర్వాణాఖ్యం సుసూక్ష్మకం)

(9) ఆకాశచక్రము- త్రికూటము లేక పూర్ణగిరీశపీఠమనంబడు పదునారు రేకుల చక్కని శూన్యముగల కమలము. (ఆకాశ చక్రం నవమం ప్రశస్తం హేమాటకం పూర్ణగిరీశపీఠం)

**నవద్వారపురము—** దేహము.

**నవమేఘములు—** ఆవర్త, సంవర్త, పుష్కర, ద్రోణ, కాల, నీల, అరుణ, తమ, వారుణంబులు.

**నవరంధ్రములు—** శీర్షణ్యము లగు కనులు, ముక్కులు, చెవులు, నోరు వీని ద్వారములు ఏడున్ను గుదగుహ్య ద్వారములు రెండున్ను చేరి నవరంధ్రములగును.

**నవవ్యాకరణములు—** (1) పాణినీయము, (2) కలాపము, (3 సుపద్మము, (4) సారస్వతము, (5) ప్రాతిశాఖ్యము, (6) ఐంద్రము, (7)వ్యాఘ్రభౌతికము, (8) శాకటాటాయనము, (9) శాకల్యము. (ప్రాతిశాఖ్యమునకు కుమార వ్యాకరణమని మారుపేరు గలదు)

**నవవిధప్రపంచములు—** (1) కర్త, హేతు, క్రియ, జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయ, ద్రష్ట, దర్శన, దృశ్యములు.

**నవవిధభక్తులు—** భగవత్సంబంధము లగు శ్రవణ, కీర్తన, నామస్మరణ, పాదసేవన, అర్చన, వందన, దాస్య, సఖ్య, ఆత్మనివేదనములు.

**నవేంద్రియములు—** దేహమందలి నవ రంధ్రములు.

**నాగము—** వాక్కు స్థానమందుండెడు వాయు విశేషము. సర్పము, లోహ విశేషము. ఏనుంగ, రాణివాసము,

గంటలోని నాలుక, నగ సంబంధమైనది.

**నాడులు**— నాడి యనఁగ నరము. ఈ నరములు ముప్పదికోట్ల ఏబది లక్షలు మన శరీరమునఁ గలవని వైద్య శాస్త్రములు తెలుపుచున్నవి. అందు వేదాంత శాస్త్రములు 72,000 వేల నాడులనే పేర్కొనినవి. ఇవి వాయు సంచార యోగ్యములు. ఇందు నూటయొక నాడులు ప్రధానములు. అందును శ్రేష్ఠములు పదునాలుగు. ఈ పదునాలుగు నరములలోను నతి ముఖ్యములైనవి ఇడా, పింగళా, సుషుమ్న లను మూఁడు నాడులు. ఈ మూఁడింటిలోను ప్రధానమగునది తామర తూడులోని మిక్కిలి సూక్ష్మమగు దారమువలెనుండు సుషుమ్నానాడియే నాడుల చక్రవర్తి. సుషుమ్నాంతర్గతమైన నాడి కైవల్య నామముతో నొప్పును. ఈ నాడీసమూహమును అనుభవజ్ఞులగు పూర్వపు మహర్షులు మూఁడు వర్గములుగ విభజించిరి. ప్రథమ వర్గము మోక్షదములగు సుషుమ్న, కైవల్యనాడులు. ద్వితీయ వర్గము స్వర్గ దాయినులగు "రమా నాడులు" తృతీయవర్గము నరకదాయినులగు "అరమానాడులు" ప్రాణోత్క్రమణ సమయముననే వర్గపునాడి గుండా యూపిరిపోవునో, యా ఫలము జీవున కబ్బును. నాడులకు పర్యాయ నామములుగ వైద్య, వేదాంత శాస్త్ర కర్తలీక్రింది నామములు వాడుదురు. నాడీ, నరము, స్నాయువు, హింస్ర దమని, దామని, ధర, తంతుకి, జీవితజ్ఞ, సిర ఇత్యాదులు.

**నాదపరిచయావస్థ**— నాదావస్థల భేదములఁ జూడుడు.

**నాదబిందుకళలు**— మనోఽగ్రేవసతే బిందు, ప్రాణాగ్రేవ సతేకళా। ఉభయోర్లీయతే నాదం। లయ యిత్యుచ్యతే బుధైః.

**నాదము**— స్వాధిష్ఠాన చక్రమునుండి హృదయమునఁబుట్టిన పంచభూత జనితమగు ప్రణవనాదము. స్త్రీయొక్క శోణితము.

**నాదావస్థభేదములు**— ఆరంభావస్థ, ఘటావస్థ, పరిచయావస్థ, నిష్పత్త్యవస్థ.

(1) ఆరంభావస్థ యనునది అనాహతాచక్రమునందుండు బ్రహ్మగ్రంథిని ప్రాణాయామాభ్యాసముచేత నెప్పుడు భేదింపఁగల్గునో అపుడు హృదయమునందు నానందమును గలుగఁజేయునానావిధధ్వనులు వినుటకు ప్రారంభించుట.

(2) ఘటావస్థయనునది ప్రాణాపానములను, నాదబిందువులను, జీవాత్మ పరమాత్మలను నేకముగఁ జేయుటం బట్టి ఘటమనంబడెను. బ్రహ్మగ్రంథిని భేదించిన తర్వాత కంఠమందుండు విష్ణుగ్రంథిని కుంభకముచే భేదించుటవలన నిఁకముందు కలుగబోవునట్టి యానందమును సూచించునదియైన విశుద్ధాకాశమునందు (కంఠమునందు) అనేక నాదములనున్న

భేరీ శబ్దములను గలిగియుండుట ఘటావస్థ యనంబడును.

(3) పరిచయావస్థయనునది- ఆజ్ఞా చక్రమందుఁగల రుద్రగ్రంథిని భేదించి ప్రాణమైనది యీశ్వర పీఠమైన భ్రూమధ్యమును బొందునపుడు సచట గలుగు మృదంగ ధ్వనివంటి నాదము.

(4) నిష్పత్త్యవస్థయనునది- ప్రాణము బ్రహ్మరంధ్రమందుఁ బ్రవేశించినపుడు వేణునాదమును, క్వణయను వీణానాదమును కలుగఁగా విని పరమానందమును జెంది సృష్టిస్థితి సంహార కర్తయగు నీశ్వరునితో సముఁడగుట. చిత్తవృత్తి నిరోధోపాయములైన శాంబవి మొదలుగాఁగల సకల యోగములకున్ను నీ నాలుగుఅవస్థలు కలిగియుండును.

**నామయజ్ఞము**— పేరు ప్రతిష్ఠల కొరకు ధనము, ఔన్నత్యము, మదగర్వములు గలిగి, అశాస్త్రీయముగ దంబముతో నొనర్చు యజ్ఞవాన ఉత్సవాదులు.

**నారాయణుఁడు**— విజ్ఞానమున కాశ్రయమైన సర్వ భూతాంతర్యామియగు పరంజ్యోతి. (నార+అయన) ఉదకములయందు లేక సర్వ భూతములయందు ఆయన భూతముగనుండువాడు.

**నిగమము**— వేదము. నియమితముగఁ బొందఁబడునది.

**నిజానందము**— యోగాభ్యాసముచే మనోలయమైనందున కలుగుసుఖము.

**నిత్యకర్మలు**— స్నానము, సంధ్యావందనము, ఔపాసనము, బ్రహ్మయజ్ఞము, వైశ్వదేవము, దేవతార్చనము, అతిథి పూజ మున్నగు ప్రతిదినము నాచరింపవలసిన సత్కర్మలు.

**నిత్యప్రళయము**— సుషుప్త్యవస్థ యందుఁ గలుగు నింద్రియాదుల విలయము.

**నిత్యపూతస్థుఁడు**— సత్యజ్ఞానానంతానందాత్మ స్వరూపమగు పరబ్రహ్మమే తానని భావించి యందైక్యమగు వాడు.

**నిత్యబ్రహ్మచారి**— (1) ఇంద్రియ పటుత్వముఁగలిగియు జన్మదారభ్య జీవితాంతము వరకు స్త్రీ వాంఛయు వివాహమునులేక యుండువాడు.

(2) శాస్త్రములచే నిషేధింపఁబడిన కాలముల విడచి, ఋతుకాలముల నాత్మ సతియందు రతినల్పు భవ్య శీలుఁడు.

**నిత్యసన్యాసి**— కోరికెలు. రాగద్వేషములు లేనివాఁడు.

**నిత్యసిద్ధులు**— సొర, గుమ్మడి, బీర మున్నగు తీగలయందు మొగ్గలు విచ్చుటకు పూర్వమే పిందెలు కానవచ్చునటుల, జన్మతోడనే సిద్ధులై యుండువారు.

**నిత్యానిత్యవస్తువివేకము**— సాధన చతుష్టయములలో నొకటి. బ్రహ్మమే సత్యము. జగన్మిథ్యయను జ్ఞానము కలుగుట. దేహేంద్రియ మనః ప్రాణాదులన్నియు జడదృశ్య మాయాకార్యములై యుండుటవలన ననిత్యములై యుండుకతన వీనికి

విలక్షణమైన ప్రత్యగాత్మయే నిత్యమని శ్రుతి, గురు, స్వానుభవముల వలనఁ దెలిసి నిశ్చయించుట.

**నిత్యోదితాచిచ్ఛక్తి—** చిత్స్వరూపుఁడగు పురుషునియందుండు శక్తి.

**నిద్రావృత్తి—** జాగత్స్వప్నావస్థలు లేని జ్ఞానము నాశ్రయించియుండు వృత్తి. అనగా నజ్ఞానమును నవలంబింపని వృత్తి.

**నియమము—** అష్టాంగ యోగములలో రెండవ మెట్టు. శుచిత్వము, సంతోషము, తపము, ఆస్తిక్యము, స్వాధ్యాయము, ఈశ్వరభక్తి, దానము, వేదాంత శ్రవణము, లజ్జ, మతి, జపము, వ్రతము, మున్నగు నవి కలిగియుండుట.

**నిరంజనము—** దోషము లేనిది. కాటుక లేనిది.

**నిరామయము—** వ్యాధులు లేమి.

**నిరాలంబము—** ఆధారము లేనిది, ఆకాశము, స్వతంత్రము.

**నిరుక్తము—** వేద మంత్రమందలి కఠిన పదముల యొక్కయు, భావముల యొక్కయు నిజార్థమును విపులీకరించి బోధించునట్టి వేద షడంగములలో నొకటి.

**నిరుద్ధము—** వృత్తులు, సంస్కారములు లేక సమాధినిఁ జేకూర్చఁగల చిత్త పరిణామ భేదములలో నొకటి. మనఃస్థితి భేదములఁ జూడుడు.

**నిరుపక్రమకర్మ—** ఇఁకముందు ఫలము నిచ్చుటకు మిగిలి యుండు కర్మ.

**నిరుపాధికుఁడు—** షడ్వికారములు, షడూర్ములు, షడ్వైరులు వీనిని యుపాధులందురు. ఇవి లేనివాఁడు నిరుపాధికుఁడు. పరబ్రహ్మము.

**నిరోధపరిణామము—** నిరోధ సంస్కారములయొక్క ప్రారంభమునందుండు చిత్తము. సంప్రజ్ఞాత సమాధి యొక్క కడపటి భాగము.

**నిరోధము—** ఏకాగ్రనిరుద్ధములను మనఃపరిణామము.

**నిర్వయనీ—** పాము కుబుసము.

**నిర్వాణము—** మోక్షము యొక్క సంపూర్ణత్వము (నిరతం అపగతిం వాణం వాతిగచ్ఛంతి దుర్గంధంవాధారయతీతి వాణం. శరీరం యస్మిన్ మోక్షే నిర్వాణః వాణం) దుర్గంధమును ధరించునట్టి శరీరమును వాణమందురు. అట్టి దుర్గంధ భూయిష్టమైన శరీరము మోక్షమునందు తొలఁగిపోవును గాన మోక్షమునకు నిర్వాణమని పేరు.

**నిర్వికల్పసమాధి—** అసంప్రజ్ఞాత సమాధి. నిర్బీజసమాధి, అపరోక్షజ్ఞానము, జ్ఞానసాధ్య రాజయోగము.

**నిర్వికల్పుఁడు—** మనఃకార్యములైన ప్రపంచ కల్పనలు లేనివాఁడు.

**నిర్వికారుఁడు—** షడ్భావవికారములులేనివాఁడు.

**నిర్విచారసమాధి—** సవిచార సమాధి

యొక్క లక్షణమునకు వ్యతిరేకము.

**నిర్వితర్క-సమాధి–** సవితర్క సమాధి లక్షణమునకు ప్రత్యర్థియగు నది.

**నిర్విశేషుఁడు–** క్షరాక్షరాతీతుఁడు. శేషమనఁగ నేతి (న+ఇతి) యను వాక్యముచే ద్రోయగా మిగిలినది.

**నిర్వేదము–** తత్త్వజ్ఞానము, పేదరికము, సంకటము, వియోగము, దుఃఖము మున్నగువానిచేఁ గలుగు విసుగు, వైరాగ్యము.

**నిష్పత్తి–** సిద్ధి.

**నిష్పత్త్యవస్థ–** నాదావస్థ భేదములు జూడుము.

**నిష్ప్రతియోగికము–** దేనికిని విరోధముకాని శబ్దార్థముఁ గలిగి, తనకు భిన్నమై వేరొకటి లేనిది.

**నిషిద్ధగురువు–** వశ్యాకర్షణాద్యష్టకర్మలచే నిహపరలోకములందు మోహభేదములఁ గలుగఁ జేయువాఁడు.

**నృసింహావతారస్థలము–** ప్రహ్లాదుని రక్షింప నృసింహరూపము దాల్చిన పంజాబులోని విష్ణువు, మూలస్థానపురము, జననము వైశాఖ శుద్ధ చతుర్దశి.

**నేత్రత్రియము–** వామ, దక్షిణ, భ్రూమధ్య (అగ్ని) నేత్రములు.

**నేతికర్మ–** నాశికాద్వారముల శుద్ధిఁ జేయుటకును, కపాలశుద్ధి కొరకును, దివ్యదృష్టిని బొందుటకొరకును, అరు జేనల నిడివియు పది మొదలు పదునైదు పురులుగల్గి ఎలుక తోకంత లావుగ గట్టిగా బేనఁబడి ముడులు లేనిదిగనుండు దారమును నాశికాద్వారమునందుఁ బ్రవేశింపఁజేసి నోటి గుండా బయటికి తీయు కర్మము.

**నైమిత్తికకర్మలు–** పంచ పర్వములు, ప్రతిపత్తు, ఏకాదశి, విషువత్పుణ్య కాలము, సూర్యచంద్రగ్రహణములు, మహాశివరాత్రి, మున్నగు సమయములందు నాచరించు కర్మలు.

**నైమిత్తికప్రళయము–** యుగాంతములందును, మహా యుగాంతములయందును, లెక్కకు మిక్కిలియగు భూతములు నశించిపోవుట.

**నైష్ఠికబ్రహ్మచారి–** వేదాధ్యయనము సమగ్రముగఁజేసి తాను జీవించియున్నంతకాలము గురునకును, అతఁడు లేనపుడు గురుని పుత్రునికిని పరిచర్యలు సలుపుచుండు నట్టి బ్రహ్మచారి.

**నౌలికర్మము–** అగ్నిమందము. మలబద్ధములను పోఁగొట్టి జఠరాగ్నిని వృద్ధిపరచి సదా యానందమును నొసంగఁ గలందులకై హఠయోగులు భుజములను వంచుకొని మొదట ఉడ్యాణబంధ మాచరించి అట్లే కడుపులోని ప్రేవులు జీర్ణకోశము మున్నగువానిని కుడి ప్రక్కగాను ఎడమ ప్రక్కగాను సుడివలె నతివేగముగఁ ద్రిప్పు పద్ధతి. నౌలిచేయుటకుముందు నాశికముద్వారా లోని గాలిని పూర్తిగ వెలికి వదలివేయవలయును.

**నంజియ్యరులు**— వైష్ణవ మతమును స్వీకరించిన సాలెవారు.

**నంబిళ్ళలు**— వైష్ణవ మతమును స్వీకరించిన కాపు కులస్థులు.

**పగలు**— కుడిముక్కునందు శ్వాసమాడు చుండు కాలము. సూర్యుడు కనబడు కాలము.

**పట్టాభిషేకదీక్ష**— ఆచార్య పురుషులు శిష్యులకు నొసంగెడు త్రివిధ దీక్షలలో నొకటియగు బిరుదములం బొందెడు దీక్ష అనగ నామములకు చివర ఆనందనాథ, స్వామి, యోగియను బిరుదములం గూర్చుట.

**పతిపశుపాశములు**—నాదబిందు కళలు, హ్యం,స, అను నక్షరములు, శివకళ శక్తులు.

**పద్మకల్పము**—బ్రహ్మయొక్క ఆయువు నందలి పూర్వార్థము.

**పద్మనాగము**— సర్పవిశేషము. దీనికి పృష్టభాగమున ఐదు చుక్కలుండును.

**పదాధ్వము**—పదాధ్వమండలి పదములు భూర్భువస్సువరాది యెనుబదియొకటి యగును. వర్ణసముదాయము పదమనంబడును. అందు కొన్ని పవిత్రములును, మంత్రముల కాధారభూతములగునవి పదాధ్వ మనంబడును. (ఏకాశీతిపదైర్యుక్తః పదాధ్వా పరికీర్తితః) ఈ పదములు ఒకటి మొదలు ఎనిమిది యక్షరములవరకు సమర్చి, పదమునకు యొదటను చివరను ప్రణవమును జేర్చి, యుచ్చరింపఁబడెడు మంత్రములు. (ఆద్యంత ప్రణవోపేత సృష్టిమార్గేణ శబ్దథా ఓమిత్యేకాక్షరం తత్రపదం తస్య శివాత్మకం)

ఉదాహరణము :- 1 అక్షరము: ఓం భూః ఓం, 2 అక్షరముల మంత్రము: ఓం. శర్వః ఓం. 3 అక్షరముల మంత్రము: ఓం శివాయ ఓం 4 అక్షరముల మంత్రము: ఓం అనంతాయ ఓం. 5 అక్షరముల మంత్రము: ఓం జ్యోతిరూపాయ ఓం. 6 అక్షరముల మంత్రము: ఓం సమస్వాయ ఓం. 7 అ.ము: ఓం అఘోర హృదయాయ ఓం. 8 అక్షరముల మంత్రము. ఓం పరమేశ్వర పదాయ ఓం. ఇట్లు 81 పదములకు కూర్చవలెను.

**పదార్థభావన**— సప్తజ్ఞాన భూమికలలో నొకటి. ఒకటి మొదలు ఐదు భూమికల నభ్యసించిన మీదట, నా యభ్యాసబలముచేత, అంతర్బహిర్మధ్యదృశ్యములు లేక బ్రహ్మమే తాననియుండు స్థితి. ఈ యారవ భూమికం బొందినవాఁడు వేరొకరు లెపకకాని మేలుకొనఁడు. ఇతఁడె బ్రహ్మవిద్వరీయుఁడు.

**పదార్థశోధన**—వ్యష్టిసమిష్టి ప్రపంచము నుండి బ్రహ్మమును, ఆత్మను వివేకించుట.

**పద్మాసనము**— ఎడమ తొడపై కుడిపాదమును, కుడి తొడపై ఎడమ పాదమును నుంచి కుడికాలి బటనవ్రేలిని కుడిచేతి తోడను, ఎడమకాలి బటనవ్రేలిని ఎడమచేతితోడను వీపువైపున చేతులు బోనిచ్చి పట్టుకొని భ్రూమధ్యమున దృష్టిని ఔమ్మున గడ్డము నుంచి యుండుట.

**పరనాదకల—** తురీయములో తురీ[illegible]. సదా శివస్థానము.

**[illegible]—** [illegible]సంహితభాగమునందలి [illegible] ప్రతిపనస యందును ఏబది [illegible]. అనువాకాంతము [illegible] పనసలకును చిన్నయను [illegible] పనసలకును పద[illegible] హెచ్చుతగ్గు లుండు [illegible] విశేషము.

**పరమగురువు—** సర్వ సందేహములను [illegible]ంచువాడు.

**పరమపదము—** మనస్సు లయించిన [illegible].

**పరమభక్తి—** (పునర్విశ్లేష భయత్వం పరమాశక్తి రుచ్యతే) భగవంతుని [illegible] కలిగినపుడు భయం [illegible].

**పరమహంస—** పరం అనగా నానం [illegible]. అట్టి యాత్మస్వరూపమను [illegible] అను విషయమెఱింగినవాడగు [illegible] సన్యాసి.

**పరమాణువు—** [illegible] యాపద [illegible] భాగము.

**పరమాత్మ—** సమస్తవస్తువులకు సాక్షిగ [illegible] చైతన్యము.

**పరమాత్మయందలిచతురవస్థలు—** [illegible], అంతర్యామి, సూత్రాత్మ, [illegible].

**పరవిద్య—** పరమాత్మను గురించి [illegible] విద్య.

**[illegible]—** విశిష్టాద్వైతీయు, పరత్వము, వ్యూహము, విభవము, అంతర్యామిత్వము, అర్చావతారము.

**పరాకాశము—** దట్టమును, కఠినమును విడములేనిదియునైన కటిక చీకటియే యాకారముగ గల్గియుండునది. పంచాకాశములలో నొకటి.

**పరాకాష్ఠ—** శ్రేష్ఠస్థితి లేక ఉచ్ఛస్థితి.

**పరాప్రకృతి—** భూమ్యాద్యష్ట ప్రకృతుల కంటెను, లేక వీని గుణములగు శబ్ద స్పర్శ రూప రస గంధ మనో బుద్ధ్యహంకారముల కంటెను, వేరై, సర్వ ప్రాణధారణ నిమిత్తభూతమై, జగత్తును ధరించుశక్తి. బ్రహ్మము సు జూపించి బ్రహ్మమునందుండునది.

**పరాపరప్రకృతి—** బ్రహ్మవేత్తకు బ్రహ్మజ్ఞానమును గలుగజేసి, లోక వ్యవహారమును ఇచ్చుచుండునది.

**పరాపరవిద్య—** గురుశిష్య పరంపరా ప్రాప్తమైన విద్య, బ్రహ్మవిద్య.

**పరావస్థ—** కుండలినీశక్తి యూర్ధ్వగామియై, షట్చక్రములదాటి, సహస్రార పద్మమునం బరమ శివునితోం గలసి యుండుస్థితి.

**పరావాక్కు—** బ్రహ్మ ప్రణవమందలి అర్ధమాత్ర తురీయ ప్రాదాత్మక ప్రకృతి. ఉదా॥ తనశక్తి తానెఱుంగమి. అనంగం బ్రకృతి బ్రహ్మాకారితవృత్తిరూపిణియై సర్వ జగత్కారణమై యుండియు, ఒక కార్యమును చేయుటకు సంకల్పించుటకు పూర్వమందు గల వాక్కు.

**పర్యాప్తము—** మితము, తృప్తి.

**పరిచయావస్థ**— హఠయోగసిద్ధి.

**పరిచ్ఛిన్నము**— పూర్ణముకానిది.

**పరిచ్ఛేదము**— విభాగము. ఇది దేశకృత, కాలకృత, వస్తుకృతములని మూఁడు విధములు,

**పరిభాష**— సంకేతార్థముగల భాష.

**పరివ్రాజకులు**— కుటీచక, బహూదక, హంస, పరమహంసలను సన్న్యాసులు.

(1) కుటీచకసన్న్యాసి – స్వపుత్రుని గృహమున భిక్షఁజేయుచు, త్రిదండి యైయుండువాఁడు.

(2) బహూదకసన్న్యాసి– త్రిదండియై శిక్య, జల, పవిత్ర, పాదుకా, ఆసన, శిఖా, యజ్ఞోపవీత, కౌపీన, కాషాయ, వేషధరుడై,తీర్థయాత్రాపరుఁడై,భిక్షను చేకొనుచు, నాత్మధ్యానము సలుపు చుండువాఁడు.

(3) హంససన్న్యాసి—ఏకదండుఁడును, శిఖావర్జముగ యజ్ఞోపవీతధారుఁడును, శిక్య కమండలపాణియు, గ్రామైకరాత్ర వాసుఁడును, కృచ్ఛ్రచాంద్రాయణ వ్రతపరుఁడును అగువాఁడు.

(4) పరమహంస సన్న్యాసి—ఏకదండ ధరుఁడును, శిఖా యజ్ఞోపవీత రహితుడును, సర్వకర్మ వర్జితుఁడునునగు నాత్మనిష్ఠఁగలవాఁడు.

**పరివ్రాట్**—సన్న్యాసి. అన్నిటిని పరిత్యజించిపోవువాఁడు. (పరిత్యజ్యసర్వం వ్రజతీతిపరివ్రాట్)

**పరుఁడు**— సర్వాధిష్ఠానరూపమున పరోక్షముగనుండువాఁడు.

**పరోక్షజ్ఞానము**— బ్రహ్మమొకటికలదని మాత్రము తెలిసికొనుట. ఏదేశాంతర మునవో పరమాత్మయున్నదనుకొనుట

**పరంధాముఁడు**— సూర్య చంద్రాది కాంతులకంటె పరమైనకాంతిఁగల వాఁడు. ధామ మనఁగ తేజస్సు యిల్లు.

**పరంబ్రహ్మము**— ఓంకారము.

**పర్యంకాసనము**— వీరాసనము, పశ్చిమతానాసనము.

**పర్వతాసనము**— స్వస్తికాసనస్థుఁడై కూర్చుండి, చేతుల నూర్ధ్వభాగముగఁ జాచి, జోడించి కదలక మెదలక పర్వతమువలె నుండుట.

**పలము**— అరుశ్వాసలకాలము. మూఁడు తులముల తూనికగలది.

**పవనధౌతి**— రెండు కాళ్ళతోఁగూర్చుండి గొంతునుచాచి,కొంచెముగ నోరుదెరచుకొని, బయటిగాలిని లోపలకినింపి, మరలధైర్యముగ వెలిబుచ్చుట. దీనిని గోముఖాసనమునుంచి చేయవలెను. ధౌతికర్మలఁ జూడుము.

**పవిత్రము**— నీటిని వడియఁబోసికొనుటకుగాను నేర్పరచికొన్న పండ్రెండంగులముల చదురముఁగల తెల్లని వస్త్రము.

**పశ్చిమతాణము**— కడుపును లోనికి లాగుట.

**పశ్చిమతానాసనము**— భూమియందు దండాకారముగ రెండు గుదికాళ్లను చేర్చి చాచి రెండకాళ్ళబొటనవ్రేళ్ళను రెండుచేతుల బొటనవ్రేళ్ళతో మోకాళ్ల క్రింది భాగమును నేలమీఁద నానునట్లు దృఢముగఁ బట్టుకొని మోకాళ్ళ మీఁద లలాటమునుంచి యుండుట.

**పితృయానము—** ధూమాది మార్గము. పితృలోకమునుదాటి చంద్రలోకమునఁజేరుట, ప్రాణావసానకాలమున ఇడానాడీద్వారా అనఁగ ఎడమముక్కు నుండి ప్రాణమును వదలుట. ఇది పునర్జన్మ కలిగించునది.

**పిప్పలము—** సంసారమునందలి సుఖదుఃఖములు. రాగిమ్రాను.

**పిశాచము—** మాంసమును భుజించునది. (పిశితమశ్నంతీతి పిశాచాః)

**పీయూషము—** అపుడు ఈనినయావు మున్నగు జంతువులపాలు. (జున్ను) అమృతము. (క్షీరంనద్యః ప్రసూతాయాః, పీయూషమితి సంజ్ఞికం)

**ప్లీహము—** పక్కెరగుండె కాయ యుబ్బుటవలనఁగలిగెడురోగము.

**పుచ్ఛము—** ఆధారము. కడపటి భాగము. తోక.

**పునశ్చరణ—** ఒక్కటేమంత్రమును లేక విషయమును మరలమరల ఉచ్చరించుట. జపించుట.

**పురాణము—** సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితములను ఐదులక్షణములుగల పురాణము. అష్టాదశ పురాణములఁ జూడుడు.

**పురీతత్తు—** హృదయుగోళమును పరివేష్టించియున్న నాడీకూటము.

**పురుషాయణము—** ప్రాణాది షోడశకళలు.

**పురుషార్థచతుష్టయము—** ధర్మార్థకామ్య మోక్షములు.

**పురుషుఁడు—** అధిష్ఠాన చైతన్యయుతుఁడగు జీవుఁడు. మగవాఁడు.

**పురోడాశము—** ఆజ్యముతోఁబాటు దేవతలకు ప్రత్యేకముగ నొసఁగునట్టి హోమద్రవ్యము. అనఁగ బియ్యపు పిండితోఁగపాలమనఁబడు మంగలమందు పక్వముఁజేయఁబడిన పిండి ముద్దను పురోడాశమందురు.

**పుర్యష్టకము—** (1) జ్ఞానేంద్రియములు (2) కర్మేంద్రియములు (3) అంతఃకరణములు (4) ప్రాణాదివాయువులు (5) పంచభూతములు (6) కామము (7) కర్మము, (8) అవిద్య. వీనిని పుర్యష్టకమందురు.

**ప్లుషి—** దోమకంటెను సన్నని జంతువు.

**పూజ—** వాక్కు మనస్సు కాయములను వానికర్మలగు స్తుతి, స్మరణ, అర్చనములు. పూవులతోఁజెయుకార్యము.

**పూరకము—** ఉచ్ఛ్వాసము. ముక్కు రంధ్రములద్వారా గాలిని లోనికిం బీల్చుట.

**పూర్ణగిరిపీఠము—** అనాహత చక్రము.

**పూర్ణము—** దేశ, కాల, వస్తు, పరిచ్ఛేద శూన్యము.

**పూర్ణాయువు—** నూటపదియారు లేక నూట ఇరువదియేండ్ల పరిమితిఁగల వయస్సు.

**పూర్ణిమాదృష్టి—** సర్వోన్మీలిత దృష్టి. (కన్నులు బాగుగఁ దెరచి చూచుట)

**పూర్వపక్షము—** విషయ నిర్ణయముపై నాక్షేపము. చాంద్రమాన మాస పూర్వార్ధము.

**పూర్వతానాసనము**— కాలివ్రేళ్ళను మడిచి భూమిపైనుంచి మడిమెలను పిరుందులయందుఁజేర్చి శిరస్సును చేతులతోడను, నడుమును మోచేతుల తోడను. అదిమి పట్టుకొని నడుమును నిక్కియుంచుట.

**పూర్వమీమాంస**— మీమాంసయనఁగా విచారము లేక విమర్శనమనియర్థము. ఇదిషడ్దర్శనములలో నొకటి. దీనికి కర్మమీమాంసయని పేరుగలదు. దీనిలో వైదికకర్మలయొక్క స్వభావమును, వేదవాక్యములకు అర్థము చేయవలసిన విధమును, విచారింపఁబడినది. జైమిని విరచితసూత్రములు ప్రమాణములు. ఈ పూర్వమీమాంస యొక్క రెండవభాగమునకు ఉత్తర మీమాంసయని లేక బ్రహ్మసూత్రము లనిపేరు. మొదటిభాగమున కర్మ మీమాంసఁజేయఁబడినట్లే అందు బ్రహ్మవిచారముఁజేయఁబడినది. దీనిని వేదాంతమని పలుకుదురు. వ్యాసమహర్షి బ్రహ్మసూత్రములు ప్రమాణములు. కర్మ మీమాంసకులు విహితమైన కర్మలవలననే స్వర్గాదిఫలములు కలుగుననియందురు. వేరుగా నీశ్వరునంగీకరింపరు.

**పూర్వాఘము**— భగవత్సమాశ్రయణాత్పూర్వము అనాదికాలార్జితమగు చేతనకృతకర్మము.

**పృథ్వి**— శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది పంచగుణ సమన్వితమగు భూమి. మహత్పంచ భూతములలో నొకటి. లక్షణముగంధము. సంబంధాక్షరములు ఊ,ఊ,పి,గ,ని,థ,ద,బ,ల హ,లు. జ్ఞానేంద్రియము ఘ్రాణము. కర్మేంద్రియము పాయువు. గుణము విసర్గము. వాయువు అపానము. ఉపవాయువు కూర్మము.

**పృథ్వీబీజము**— లం అనునక్షరము.

**పృషదాజ్యము**— పెరుగు తోఁగలపఁబడిన నేయి.

**పెరియసంబంధులు**— వైష్ణవ మతమును స్వీకరించిన షష్టములు అనగా మాదిగలు.

**పైత్రము లేక పితృతీర్థము**— పెను వ్రేలు జుట్టిన వ్రేళ్ళయొక్క మధ్యనుండి విడచెడు పితృసంబంధ మగు తీర్థము.

**పోత** - యజ్ఞములందు బ్రహ్మకు సహాయముఁజేయు ఋత్విక్కు.

**పౌరుషేయము** - మొట్టమొదట తాఁ జెప్పవలసిన యర్థమునొకదానిని సేకరించి తదనుసారముగ పదములను గూర్చి గ్రంథమును రచియించెనేని దానిని పౌరుషేయమందురు.

**పంచకృత్యములు** - సృష్టి, స్థితి, సంహార, తిరోధాన, అనుగ్రహములు. వీనికి కర్త పరమేశ్వరుఁడు.

**పంచకేదారక్షేత్రములు** - (1) బదరీకేదారము లేక కేదారనాథము. (2) మధ్యమేశ్వరము. (3) తుంగనాథము (4) రుద్రనాథము (5) కల్పేశ్వరము.

**పంచక్లేశములు** - (1) అవిద్యాక్లేశము. నేను జీవుఁడనని నిర్ణయించుకొనుట.

(2) అభినవక్లేశము, సంసారమును దానికి కారణమైనమనస్సును పరిత్యజించకుండుట.

(3) ఆస్థిగతక్లేశము, విషయాభిలాషఁ గలిగి పిత్తువీగుచుండుట.

(4) రాగక్లేశము. అర్థములయందధికానురక్తిఁ గలిగియుండుట.

(5) ద్వేషక్లేశము. ఉదరపోషణార్థము పరులనాశ్రయించి వారివలన తన యభిమతము కొనసాగనందున వారల దూషించుట.

**పంచకోశములు** - అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు.

**పంచగవ్యములు** - గోమూత్రము, గోమయము, గోక్షీరము, గోదధి, గోఘృతము.

**పంచగంగలు** - భాగీరథి, యమున, కృష్ణ, గోదావరి, కావేరి.

**పంచజనులు** - ఐదుతెగలుగా నుండు మానవులు. భారతీయులలోఁ బ్రధానులగు నధిక సంఖ్యాకులు ఋగ్వేదము సందర్భికముగ నుచ్ఛరింపఁబడిన "పంచజనాః" అనుశబ్దముచే నైదు వర్గములం జెప్పబడియుండును. మంత్రద్వయమున పారవులు, తుర్వసులు, యాదవులు, అనువులు, ద్రుహ్యులు అనునైదు వర్గములఁ బెర్కొనియున్నారు. పంచభూతములచే సృష్టియైనవారు.

**పంచతన్మాత్రలు** - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు.

**పంచదశ యోగాంగములు** -
యోగాంగములు 8 త్యాగము 1
మౌనము 1 దేశాచారవర్తనము 1
కాలానుగుణ్యావర్తనము 1 మూల బంధము 1 దేహసామ్యము 1 దుఃఖ రహితము 1 అంతుపదునైదంగములు.

**పంచదేవతలు** - పంచేంద్రియాభిమానులగు దిక్పాలురు: వాయువు, సూర్యుఁడు, వరుణుఁడు, అశ్వనీదేవతలు.

**పంచదైవతములు** - బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు.

**పంచద్వారకలు** - గోమతీద్వారక, ఖేటీద్వారక, కాకటీద్వారక, శ్రీనాథద్వారక, మోక్షద్వారక.

**పంచధర్మములు** - జాతిధర్మము, ఆశ్రమధర్మము, మతధర్మము, దేశధర్మము, గుణధర్మము.

**పంచనారాయణోపనిషత్తులు** -
నారాయణోపనిషత్తు, బ్రహ్మోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తు, గార్గోపనిషత్తు, వారాహోపనిషత్తు, వీనియందు నారాయణ రూపము వివరింపఁబడియున్నది.

**పంచపర్వములు** - కృష్ణపక్షాష్టమి, కృష్ణపక్షచతుర్దశి, అమావాస్య, పూర్ణిమ, మాససంక్రాంతి.

**పంచప్రయాగలు** - ప్రయాగయనినంతనే అల్లాహాబాదువద్ద గంగా, యమున, సరస్వతీనదుల కలయిక యగు త్రివేణీసంగమమే తలంపునకు వచ్చును. ఇవిగాక హిమాద్రియందుఁ బాఱుచుండు నదు లొండొంటితోఁ గలియుచోట్లకును ప్రయాగయని

వాడుకొనుచున్నారు (1) భాగీరథీ,అలకానంద నదులు కలియుచోటికి దేవప్రయాగయనియు, (2) అలకానంద, పిండారి నదులు కలియుచోటికి కర్ణప్రయాగయనియు, (3) అలకానంద, మందాకినీ నదులు కలియుచోటికి రుద్రప్రయాగయనియు, (4) అలకానంద నందాకినీ నదులుకలియుచోటికి నంద ప్రయాగయనియు, (5) జ్యోతిమఠమువద్దఁ బాఱుచుండు అలకానంద, విష్ణుగంగలు కలియుచోటికి విష్ణు ప్రయాగయునియు చెప్పుదురు.

**పంచప్రళయములు** – నిత్య ప్రళయము, నైమిత్తిక ప్రళయము, దైనందిన ప్రళయము, కల్పాంత ప్రళయము, మహా ప్రళయము.

**పంచప్రాణములు** – ప్రాణ, అపాన, సమాన, వ్యాన, ఉదాన. వాయువులు.

**పంచబ్రహ్మమంత్రములు** – పరమేశ్వరుఁడు తనకుఁగల సద్యోజాతాది పంచముఖముల నుండి కౌశిక, కాశ్యప, భరద్వాజ, అత్రి, గౌతములను ఐదుగురు ఋషులకుఁపదేశించిన పంచాక్షర స్వరూపములగు మంత్రములు. ఇవి :-

(1) సద్యోజాతముఖమునుండి. సిద్ధి, బుద్ధి, ద్యుతి, లక్ష్మి, మేధా, కాంతి, స్వధా, ధృతియనంబడు కళలకాశ్రయమైన నకారరూప మంత్రము.

(2) వామదేవముఖమునుండి: రజా, రక్షా, రతి, పాలి, కామా, సంయమా, క్రియా, బుద్ధి, కార్యా, ధాత్రి, భ్రామిని, మోహిని, మనోన్మని యనంబడు పదుమూఁడు కళలకాశ్రయమైనట్టి మకారరూపమంత్రము.

(3) అఘోరముఖమునుండి. తమ, మోహ, క్షమ, నిష్ఠ, మృత్యు, మాయ, భయ, జరయను నెనిమిది కళలకాశ్రయమైన శికారరూపమగు మంత్రము.

(4) తత్పురుషముఖమునుండి శాంతి, విద్య, ప్రతిష్ఠ, నివృత్తి, యను నాలుగు కళలకాశ్రయమైన వాకారరూపమగు మంత్రము.

(5) ఈశానముఖమునుండి శశిని, అంగద, ఇష్ట, మరీచి, జ్వాలిని యను నైదుకళలకాశ్రయమైనట్టి యకారరూపమంత్రము. ఇట్లుపదేశింపఁబడిన పంచ బ్రహ్మమంత్రములు, శైవపంచాక్షరీమంత్ర రూపములై ముప్పదియెనిమిది కళలకాశ్రయములై వేదమూలముగ నున్నదియే "నమశ్శివాయ" యను మంత్రమని చెప్పఁబడినది.

**పంచబిల్వములు** – బిల్వము, తులసి, నిర్గుండి, అపామార్గ, కపిత్థములు. (నిర్గుండి–వావిలి. అపామార్గ–ఉత్తరేణు)

**పంచభూతములు** – పృథ్వీ, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము.

**పంచబేరములు** – గుడిలోని యైదు విధములగు విగ్రహములు.

(1) మూలస్థానముననుండు మూల బేరము.

(2) తేరుపైకి తీసికొనిపోవు రథబేరము.

(3) ఊరేగింపులకైన ఉత్సవబేరము.

(4) బలిహరణమునకై వచ్చెడి బలి బేరము.

(5) అభిషేకమునుగొను విగ్రహము అభిషేకబేరము. (సాలగ్రామాదులు)

**పంచభేదసిద్ధాంతములు** - (1) జీవేశ్వర భేదము, (2) జీవజీవభేదము, (3) జీవజడభేదము, (4) జడ ఈశ్వర భేదము, (5) జడజడ భేదములగు ఇత్యాది సిద్ధాంతములు.

**పంచమలములు** - అణవ, కార్మిక, మాయిక, మాయేయ,తిరోధానములు.

**పంచమహాపాతకములు** - దొంగలించుట, మత్తు పదార్థములుపయోగించుట, పెద్దల వాంసించుట, పూజ్యులగు పరదారగమనము, మహాపాతకులతో స్నేహముచేయుట.

**పంచమహాయజ్ఞములు** - (1) వేద పాఠము దీనిని బ్రహ్మయజ్ఞమందురు.

(2) వైశ్వదేవము దీనిని దేవయజ్ఞమందురు.

(3) అతిథిపూజ దీనిని మనుష్య యజ్ఞమందురు.

(4) పితృతర్పణము దీనిని పితృయజ్ఞమందురు.

(5) భూతబలి దీనిని భూత యజ్ఞమందురు.

**పంచముఖములు** - ఈశ్వరుని యొక్క ముఖములగు సద్యోజాత, వామదేవ, అఘోర,తత్పురుష,ఈశానముఖములు

**పంచముద్రలు** - తారక యోగుల కవశ్యాచరణీయములైన ఖేచరీ, భూచరీ, మధ్యచరీ, షణ్ముఖీ, సాంభవీ ముద్రలు.

**పంచవర్గధర్మి** - (1) అంతః కరణ చతుష్టయము. (2) పంచప్రాణములు. (3) త్రిగుణములు, (4) పంచభూతములు, (5) పుణ్య పాపములు. ఇవియే పంచవర్గములు. ఈ పంచవర్గములనాధారముగఁజేసుకొనియుండుటచేత ఆత్మజ్ఞానము లేక నశింపనిదైన హృదయగ్రంథి యగు మూలావిద్యను, పంచవర్గధర్మి యనియు, లింగశరీరమనియు చెప్పుదురు.

**పంచపంశతితత్త్వములు** - జ్ఞానేంద్రియములు 5 కర్మేంద్రియములు 5 ప్రాణాదులు 5 జ్ఞానతన్మాత్రలు 5 అంతరింద్రియములు 4 పురుషుఁడు 1 చేరిన సముదాయము.

**పంచశక్తులు** - ఉమ, అంబిక, గణేశ్వరి, ఈశ్వరి. మనోన్మనీలు.

**పంచశాకములు** - యోగులకు పథ్యాహారములగు చక్రవర్తి కూర, పొన్నగంటియాకు, చిఱుకూరాకు, తెల్లకలఁగరాకు, జీవంతి యనఁబడు తిప్ప తీగెయాకు.

**పంచసరోవరములు** - (1) ఉత్తరమున మానసరోవరము (2) తూర్పున భువనేశ్వరమున నున్న బిందుసరోవరము (3) దక్షిణమున అనగొంది కడనున్న పంపాసరోవరము (4) పశ్చిమమున సింధూనదీ ముఖద్వార సమీపమున కచ్ఛియిరాన్ వద్దనుండు నారాయణ సరోవరము (5) మధ్యమమున అజ్మీరునుండి పదునైదు మైళ్ళ

దూరముననున్న పుష్కార్వద్ధ నుండు పుష్కర సరోవరము.

**పంచసంస్కారములు** – విశిష్టాద్వైత వైష్ణవమతస్థులకు ముఖ్యములగు నైదు దీక్షలు. (1) తాపము అనఁగ చక్రాంకితముద్ర. (2) పుండ్రము అనఁగ శ్వేతమృత్తికతో లలాటాది ప్రదేశములలో ధరించెడు తిలకములు (3) నామము అనఁగ పేరు మార్చి సాంప్రదాయపు పేరుంచుట (4)మంత్రము అనఁగ,తిరుమంత్రము (5) యాగము అనఁగ యజ్ఞము ఐదున్నగునవి ఆచార్యులచే బొందుట. (తాపః పుండ్రస్తథానామ మంత్రో యాగాశ్చపంచమః అమీ పరమ-సంస్కారాః పరమైకాంత హేతవః)

**పంచరుద్రోపనిషత్తులు** – అథర్వశిఖ, కైవల్య, కాలాగ్ని, శ్వేతాశ్వర, చమక నమకములు-(రుద్రము)

**పంచసూక్తములు**— శ్రీ సూక్తము, పురుషసూక్తము, భూసూక్తము, నీళా సూక్తము, మన్యుసూక్తములు.

**పంచసూత్రములు**— సంకల్పము, మార్జనము, వరుణసూక్తము, అఘ మర్షణస్నానము, స్నానాంగ తర్ప ణములు.

**పంచసూన దుష్కృతములు**— తఱుగుట, నూఱుట, విఱుచుట, కాల్చుట, ఊడ్చుట, వీనివలనఁగలుగు దోషములు. (కుట్టినీ, పేషణీ, చుల్లీ, ఉదకుంభీచ, మార్జనీ, పంచసూనా గృహస్థస్య, తాభిః స్వర్గంనవిందతి)

**పంచాకాశములు**— యోగులు పంచ ముద్రలను, ప్రాణాయామాదులను నభ్యసించునపుడు తన నేత్రముల తేజస్సునుండి వెలువడుచు కనుబడు దృశ్యములు. (1) గుణరహితాకాశము, (2) పరాకాశము, (3) మహాకాశము, (4) తత్త్వాకాశము,(5) సూర్యాకాశము. ఇవియన్నియు చిత్తాకాశజన్యములు. చిత్తము మనోజన్యము.

**పంచాగ్నివిద్య** — స్వర్గము, మేఘము, భూమి, పురుషుఁడు, స్త్రీ. ఈ యైదింటిని యగ్నిరూపమున నుపాసించుచు వీనికి నాహుతులుగ స్వర్గమునకు శ్రద్ధను, మేఘమునకు సోముని, భూమికి వృష్టిని, పురుషునకు అన్నమును, స్త్రీకి రేతస్సును, అర్పించుచు నుపాసించు పద్ధతి. దీని వివరములు చాందోగ్య బృహదారణ్యోపనిషత్తులలోఁ గాననగును. పూర్వమీమాంసలో అగ్నిహోత్రమునందు-హోమముఁ జేయుటవలన నా హోమ ద్రవ్యములు సూక్ష్మరూపములై ''అపూర్వము'' అనుపేర పురుషుని నాశ్రయించి వాని నిర్గమన కాలమున వాని నాశ్రయించియే చనుచుఁ బరలోక భోగములను, ఉత్తరజన్మలను, కలిగించుచుండునని సిద్ధాంతముఁజేయఁబడియున్నది. ఈ యపూర్వ నిర్గమనలే యైదు విధములుగ విభాగింపఁబడినవై ఐదు ఆహుతులుగనీ పంచాగ్ని విద్యయందు వర్ణింపఁబడియున్నది.

**పంచాగ్నులు**— (1) గార్హపత్య, ఆహవనీయ, దక్షిణ, సభ్య, అవసథ్యములను నగ్నులు.

మిది వివిధములగు పేర్లతో జపించు చున్నారు.

(1) మూలపంచాక్షరి. (2) స్థూల పంచాక్షరి. (3) సూక్ష్మపంచాక్షరి. (4) శక్తిపంచాక్షరి. (5) అఘోరపంచాక్షరి. (6) ప్రణవపంచాక్షరి. (7) నియత పంచాక్షరి. (8) ప్రసాద పంచాక్షరి.

**పంచీకరణము—** పృథివ్యాది పంచ భూతములను రెండేసి భాగములుచేసి, మొదటియర్ధభాగములను ఒండొంటిని నాలుగేసి భాగములుగఁజేసి, ప్రత్యేకింపఁబడిన నాలుగు భాగములతో నొక్కొక్క భాగమును కలుపఁగా నేర్పడిన భూతసమ్మేళనము.

**పంచేంద్రియములు—** కన్ను, చెవి, నాలుక, ముక్కు, చర్మములను శరీరావయవములగు జ్ఞానేంద్రియములు.

**పంచోపవాయువులు—** (1) నాగము వాక్కునకుండునది (2) కూర్మ వాయువు. (3) కృకరవాయువు కనుల నుండునది. (4) దేవదత్తవాయువు ఆవులింతలఁ జేయునది. (5) ధనంజయవాయువు శరీరమాద్యంతము వ్యాపించి యుండునది.

**పండబుద్ధి—** సప్తవిధ బుద్ధులలో నొకటి యగు తత్త్వమును దెలిసికొనఁదగిన బుద్ధి.

**పండితుఁడు—** పండాయనఁగ, జ్ఞానమునకుపేరు. ఎవనిపేరుతోనది పుట్టినదో యాతఁడు పండితుఁడు. ఆతడి జ్ఞానకర్మ పాండిత్యము. కామసంకల్ప రహితుఁడై కర్మలొనర్చి, కర్మఫలముల జ్ఞానాగ్నిచేఁగాల్చి వేయువాఁడు.

**ప్రణయము—** గార్హపత్యాగ్ని.

**ప్రచ్ఛర్ధనము—** రేచకము. లోనియూపిరిని ప్రమాణము చొప్పున బయటికి విడుచుట.

**ప్రజాపతి—** బ్రహ్మ. రేతస్సు.

**ప్రజ్ఞానము—** తెలివి. ప్రజ్ఞప్తి.

**ప్రజ్ఞానమునకుపర్యాయనామములు—** సంజ్ఞానము, అజ్ఞానము, విజ్ఞానము, మేధ, దృష్టి, ధృతి, మనీష, జూతి, స్మృతి, సంకల్పము, క్రతువు, అసువు, కామము, వశము, ఇత్యాదులు.

**ప్రణవపంచాకృతులు—** తారకాకృతి, దండాకృతి, కుండలాకృతి, అర్ధచంద్రాకృతి, బింద్వాకృతి. వీనిని యోగులు పంచకృత్యములనియు, పంచశక్తులనియు, పంచకర్తలనియు, పంచకళలనియు, పంచాక్షరములనియు, నందురు. (ప్రథమంతారకంచైవ, ద్వితీయం దండముచ్యతే, తృతీయం కుండలాకారం, చతుర్థం చార్ధచంద్రికం, పంచమం బిందుసంయుక్తం, ఓమితి జ్యోతిరూపకం)

**ప్రణవమాత్రలకు పర్యాయనామములు—** అకారమునకు ఆగ్నేయియనియు, ఉకారమునకు వాయువ్యయనియు, మకారమునకు సూర్యమండల సంకాశయనియు, అర్ధమాత్రకు వారుణి యనియు, మారుపేరులు.

ప్రిణవము— ఓంకారము. అంచతి చేతను మ్రొక్కులు కొనునది.

ప్రణవముయొక్క ద్వాదశమాత్రలు— (1) ఘోషిణి (2) విద్యున్మాత్ర (3) పతంగిని (4) వాయువేగిని (5) నామధేయి (6) చైంద్రి (7) వైష్ణవి, (8) శాంకరి (9) మహతి (10) ధృతి, (11) నారి (12) బ్రాహ్మి. అనునవి.

ప్రిణవోచ్చారణసమయలు— వైదిక విషయములఁ జదువఁ బ్రారంభించుటకు ముందును, ముగింపునందును, ఓంకార ముచ్చరించ వలయును, మొదట నుచ్చరించుటవలన చదివిన విషయములు మఱచిపోవు. ముగింపున నుచ్చరించుటచేఁ జదివిన విషయములు మనస్సున నిలచియుండును.

ప్రతిపత్తు—పాడ్యమి మున్నగు శుక్లపక్ష తిథులు.

ప్రతిపద్దృష్టి—అర్ధోన్మీలిత దృష్టి (సగము కనులు మూసికొని చూచు దృష్టి.)

ప్రతిప్రస్తోత—యజ్ఞమునందు అధ్వర్యునకు సహాయముఁజేయు ఋత్విక్కు.

ప్రతిబింబవాదము— అద్దమునందు ముఖమువలెఁబ్రపంచసూక్ష్మావస్థారూపిణియగు నవిద్యయందు పరమేశ్వరుఁడు ప్రతిబింబించి జీవుఁడయ్యెనను వాదము.

ప్రితిభ— ఏదేని నొకవిషయమునుగూర్చి పలుకఁదలచినపుడు, వాగ్ధోరణిఁ గలిగి, సమయోచితముగ శ్రుతిస్మృతీతి హాసములను పెక్కులుచూపి వినువారు ప్రశ్నఁజేయుటకు తోచకుండ విషయములఁదెలుపుటయందు సమర్థతఁగలబుద్ధి, సప్తవిధబుద్ధులలో నొకటి.

ప్రితిష్ఠ— సేత్రము.

ప్రితిసంఖ్యానాశము— ఒకపదార్థమును నాశమొనర్చు సంకల్పముతోఁ జేయునాశము.

ప్రతీకము— అల్పవస్తువునందు గొప్పపదార్థదృష్టి. ఉ-దా॥ విగ్రహము లేక ప్రతి మాదులందు విష్ణ్వాది దేవతాబుద్ధి. (ప్రదేశము, ప్రతిమ, ప్రతికృతి, సమానార్థకములు.)

ప్రత్యంగములు— లలాటము, నాసిక. కర్ణములు, అధరము మున్నగునవి.

ప్రత్యక్షప్రమాణము— ఇంద్రియముల ద్వారా వెలుపటి వస్తువుతో సంబంధముఁగలుగుట చేత విశేషములను నిశ్చయించు ప్రధానమగు వృత్తి.

ప్రత్యాహారము— వాయువును, మనస్సును, బుద్ధిని, వలసిన చోట నిలుపఁగలుగుట. (చరతాం చక్షురాదీనాం విషయేషు యథాక్రమం, యత్ప్రత్యా హరణం తేషాం ప్రత్యాహారః ప్రకీర్తితః)

(1) ఇంద్రియములను వానివిషయములయందుఁజారనీయమి.

(2) పాదము, అంగుష్ఠము, మడమ, చీలమండ, మోకాలు, తొడ, పాయువు, లింగము, నాభి, హృదయము, కంఠము, మెడ, అంగిలి, నాసిక, కన్ను, భ్రూమధ్యము, నెత్తి, శిరస్సు, ఈ పదునెనిమిది మర్మస్థానములందు క్రమముగ మనోవాయుబుద్ధులను

వీనిని విశిష్టాద్వైతులు రహస్యత్రయములనియు, అద్వైతులు శాంతిత్రయములనియు, పేర్కొందురు.

**ప్రస్తోత**— యజ్ఞములందు ఉద్గాతకు సహాయముచేయు ఋత్విక్కు.

**ప్రాకృతము**— ప్రకృతి సంబంధమైనది.

**ప్రాకామ్యము**— ఆకాశగమనాది సిద్ధి. భూమినుండియే ఆకాశమందలి నక్షత్రములఁ దాకునట్లుగఁ గోరిన దంతయుఁజేయఁగల తపస్సిద్ధి.

**ప్రాగభావము**— ఘటోత్పత్తికి మున్ను గల అభావము.

**ప్రాఙ్ముఖీముద్ర**— షణ్ముఖీముద్ర.

**ప్రాజాపత్యకృచ్ఛ్రము**— ఈ వ్రతమును పండ్రెండుదినములాచరింపవలెను. మొదటి మూఁడుదినములు ప్రాతః కాలమునందు మాత్రమే భుజింపవలెను. తర్వాత మూఁడు దినములు సాయంకాలమందు మాత్రమే భుజింపవలెను. ఆవెనుక మూఁడు దినములు స్వయముగ యాచింపకఁ బరులచేఁబెట్టబడునపుడు మాత్రమే భుజింపవలెను. చిక్కుసచో రెండు పూటలు తినవచ్చును. కడపటి మూఁడుదినములును ఉపవాసము చేయవలెను. శాస్త్రములందు కృచ్ఛ్రమనిచెప్పినచో సామాన్యముగ ప్రాజాపత్యమునే యాచరింపవలెను.

**ప్రాజ్ఞుఁడు**— అజ్ఞానావస్థయందుండువాఁడు. (ప్ర + అజ్ఞః = ప్రాజ్ఞః) సుషుప్త్యవస్థయందు ఘనప్రజ్ఞఁగలిగి హృదయాకాశమునందుండి యానందమునను భవించు జీవుఁడు. మిక్కిలి నేర్పరి.

**ప్రాణకల**— హఠయోగము. బలాత్కరించి యింద్రియముల నిగ్రహించుట. రాజయోగభేదము. మందాధికారి యగు వాఁడు, చిత్తచాంచల్యము, విషయవాసన, ఉద్విఘ్నము, సాధనసంపత్తిలేమింజేసి, యిట్టిలక్షణములఁ గలవాఁడు అనుష్ఠించవలసిన పద్ధతి. ఈ హఠయోగమువలన సమాధిసిద్ధియు, తద్ద్వారా యాత్మసాక్షాత్కారము కలుగును.

**ప్రాణమయకోశము**— ప్రాణాది దశవాయువులు అన్నమయకోశమునందెప్పుడు సంచరించునో, అపుడు ప్రాణమయకోశమనంబడును. (ప్రాణాది దశవాయవోఽన్నమయకోశే యదావర్తంతే, తదా ప్రాణమయకోశః)

**ప్రాణము**— అగ్ని. ఊపిరి. సూక్ష్మశరీరముయొక్క క్రియాశక్తిని ప్రాణమనియు, జ్ఞానశక్తిని ప్రజ్ఞయనియు, చెప్పుదురు. ఇది వైదిక పరిభాష. కొన్నిచోట్ల ప్రాణమనుమాట చిత్తమునకు వ్యవహరింతురు. పరబ్రహ్మము.

**ప్రాణవస్త్రము**— జలము. ఆచమనము ప్రాణమునకు జలము వస్త్రమువంటిదని యర్థము.

**ప్రాణవాయువు**— హృదయస్థానమున సంచరించెడు వాయు విశేషము.

**ప్రాణవిద్య**— హంసమంత్రము. అః పాగాయత్రి.

**ప్రాణాగ్నులు**— ప్రాణాది పంచ వాయువులు.

**ప్రాణాది పంచదశ కళలు** — 1 ప్రాణము 2 శ్రద్ధ 3 ఆకాశము 4 వాయువు 5 తేజస్సు 6 జలము 7 భూమి 8 ఇంద్రియము 9 మనస్సు 10 అన్నము 11 వీర్యము 12 తపస్సు 13 కర్మము 14 మంత్రము 15 లోకములు ఇవి పదునైదుకళలు. నామమునుఁ జేర్చి పదునారుకళలగును.

**ప్రాణాసనము**— ఒకపాదమును తొడయందును, మరియొక పాదమును భుజముమీఁదను నుంచుటయే ప్రాణాసన మందురు.

**ప్రాణోపాసనము**— బ్రహ్మోపాసనము.

**ప్రాతస్సంధ్యాకాలము**— నక్షత్రములు తేజోవిహీనమైనది మొదలు, సూర్యమండలము యొక్క అర్ధోదయము వరకుఁగలరెండు ఘడియల కాలము. (ఉదయా త్ప్రాక్తనీ సంధ్యా, ఘటీకాద్వయ ముచ్యతే)

**ప్రాతిశ్రుత్కము** - వినునపుడు మిక్కిలి జాగ్రతతో వినుట.

**ప్రాప్యము** - ఒక స్థలమునుండి మఱియొక స్థలమునకుఁబోయి యాశ్రయింప వలసినదే ప్రాప్యము.

**ప్రాప్తి** - ఇష్టపదార్థముల లభింపఁజేసికొనంగలతపః శక్తి. సిద్ధి.

**ప్రారబ్ధకర్మము** - ప్రకృత జన్మాంతమువరకు ననుభవింపఁబడుటకు విధి నియమితమగు కర్మ.

**ప్రైయస్సు** కర్మసంబంధమగు మార్గము.

**ప్రైషణమంత్రము** - సన్న్యాసాశ్రమ స్వీకరణ సమయమున యజ్ఞోపవీత మునుత్యజించునపుడు, మంద్ర, మధ్య, ఉచ్చైస్స్వరములతోఁ ద్రిలోకములవారి నుద్దేశించి శపథముఁజేయు మంత్రము.

**ప్లావిని** - అష్ట విధ కుంభకములలో నొకటి. వాయువును గర్భకోశము నిండుగ పూరించి లోతైననీళ్ళపై పరుండి చేయుప్రాణాయామ పద్ధతి.

**ఫణీంద్రాసనము** - రెండుకాళ్లను పైన వేసికొని రెండు చేతులతో నిలచియుండుట.

**ఫలచైతన్యము** - ఎఱుఁగఁబడిన చైతన్యము.

**ఫలభావము** - నిజమైన వస్తువును మఱియొక విధముగఁదలఁచుట.

**ఫలము** - షడ్విధలింగములలో నొకటి. ప్రకరణమందు ప్రతిపాదింపఁబడిన విషయమును దెలిసికొనుటవలనఁ గలుగు ప్రయోజనము.

**ఫేనపుడు** - స్వచ్ఛందముగ రాలిన యాకులను దినుచు, నెచ్చట నుండియైనను కర్మల నాచరించువాఁడు.

**బడబాగ్ని** - శరీరమందలి యెముకల మధ్యమందుండు అగ్ని, ఏ యగ్నియైనది కొయ్యలయందును జాతియందును కలదో యా యగ్ని యే ఎముకలయందును నున్నది. (బడబాగ్ని శ్శరీరస్థోహ్యస్థిమధ్యే ప్రవర్తతే.)

కాష్ఠపాషాణయోర్వహ్నిః హ్యస్థిమధ్యే ప్రవర్తతే॥)

**బద్ధపద్మాసనము** - పద్మాసనము.

**బద్ధము** - ధారణా విశేషముచేత భ్రూమధ్యమందు ధరింపఁబడిన చిత్తము. ఓషధీ క్రియచే గుళికగా నొనర్పఁబడిన పాదరసము.

**బద్ధయోన్యాసనము** -గుహ్యము మొదలగువానిని బంధించుటయనెడి యోన్యాసనముఁజేసి, పెదవులను చిటికెన వ్రేలు, ధర్భవ్రేళ్ళ చేతను, నాసికా ద్వారములను నడిమి వ్రేళ్ళచేతను, నేత్రములఁజూపుడు వ్రేళ్ళ చేతను, చెవులను పెద్ద వ్రేళ్ళ చేతను, మూయుట. షణ్ముఖీ ముద్ర.

**బద్ధాసనము** - పృష్ఠమునందు రెండు పాదములనుంచి, మెడయందు రెండు చేతులనుంచి,కాయమును అణఁకువఁ జేసి పట్టియుండుట.

**బస్తి** - మూత్రస్థానము.

**బహూదకసన్న్యాసి**- విధిహితముగ సన్న్యసించి పుణ్యతీర్థములందు గ్రుంకుచు, పుణ్యక్షేత్రముల దర్శించుచు, దేశసంచారమునచ్చుచు, బ్రహ్మనిష్ఠ సలుపుచు, కామాదులధరించి, భుజించినచోట నిద్రించక, నిదురించినచోట భుజింపక, గ్రామమైన నొక రాత్రమును, పట్టణమైన మూఁడు రాత్రములును, పుణ్యనది క్షేత్రాదులందు ఐదు లేక ఆఱుదినములును, వసించుచు, గృహస్థుల యిండ్లయందు భుజించువాఁడు.

**బాలరండ** - కుండలినీశక్తి. సుషుమ్నానాడి.

**బాలుఁడు** - ఐదు సంవత్సరములకు లోఁబడిన వయస్సుఁ గలవాఁడు. అజ్ఞాని. (అజ్ఞో భవతివైబాలః, పితా భవతి మంత్రదః) పంచసంవత్సరో బాలః కుమారోప్యాదశాబ్దయః యువాబ్దా పంచవింశత్యాః వృద్ధస్సప్తతి వార్షికః)

**బాహ్యకుంభకము** - అష్టవిధ ప్రాణాయామములఁజూడుము.

**బాహ్యదృశ్యానువిద్ధ సవికల్ప సమాధి** - తనకంటె అన్యముగాఁ దోచు బ్రహ్మాది పిపీలికా పర్యంతముఁగల సకలచేతనములును, తన తెలివియందే పుట్టిగిట్టినవికావున, నవి తన ప్రజ్ఞాకల్పితము లనియును, ఆ ప్రజ్ఞానమె తాననియును, చూచుట. షడ్విధ సమాధులలో నొకటి.

**బాహ్య నిర్వికల్పసమాధి** - మొదట నాల్గువిధములగు సమాధులలో నున్న పతగల్గ బాహ్యాంతరంబులందు తన కన్యమేదియుఁదోచకున్నను, తెచ్చి నను, నిటియందు ముంచిన ఘటమునకు బాహ్యాంతరంబుల నీరునిండియుండునట్లు నిండియుండుట. షడ్విధ సమాధులలో నొకటి.

**బాహ్యపూరకము** - అష్టవిధప్రాణాయామములఁజూడుము.

**బాహ్యప్రణవము** - యజ్ఞయాగాదులందు కల్పింపఁబడిన ప్రణవము.

**బాహ్యరేచకము** - అష్టవిధ ప్రాణాయామములఁజూడుము.

**బాహ్యశబ్దానువిద్ధ సవికల్పసమాధి**- శివ, రామ, గోవిందాది నామములలో అనఁగ వినఁబడిన ప్రతిశబ్దమునుతన చెవికి వినఁబడినవియెల్లను తాను కానని విడిచి, సర్వనామవిలక్షణమైన పరబ్రహ్మ వస్తువు తానని యోచించుట. షడ్విధ సమాధులలో నొకటి.

**బీజ జాగ్రము** - పరబ్రహ్మమునందు సృష్టికి కారణముగఁగలిగిన తెలివి. అజ్ఞాన భూమికా సప్తకమున నొకటి. బహిర్గతమగు వృత్తి.

**బీజనిద్ర** - స్వప్నములేని నిద్ర.

**బీజాభావము** - నిజ జ్ఞానశూన్యము.

**బీజము**- కారణము. విత్తు. అనఁగాగింజ.

**బంధమోక్షములు** - ఆత్మయైనవాఁడు ఆత్మకానట్టిదైన దేహాదులను తానని భావించుకొని, దానినాత్మయని అభిమానించుటచేత నా యభిమానము ఆత్మకు బంధమాయెను. అట్టి యభిమానమును వదలుటయే మోక్షము.

**బిందువు** - చిద్బిందువు. మనస్సు. ఈశ్వరుఁడు. హృచ్చిత్తబుద్ధి సంయోగ జనితమైనదే బిందువు. (పంచభూతాది సంయోగాత్ । జ్ఞాయతే నాదసంజ్ఞకం। హృచ్చిత్తబుద్ధి సంయోగ జ్ఞాయతే బిందు సంజ్ఞకం । క్షేత్రజ్ఞ జీవచైతన్య కళానామేతి విశ్రుతం.)

**బుద్ధి** - అంతఃకరణముయొక్క సాత్త్విక భాగము.

**బుద్ధిగుహా** - సహస్రార కర్ణిక- అనఁగా మెదడుయొక్క మధ్యస్థానము. పంచకోశములు.

**బృసీ** - వ్రతమాచరించువారుపయోగించు దర్భాదుల చేఁజేయఁబడిన యాసనములు.

**భైరవాసనము** - కాలిమడమల రెంటిని నొకటితో నొకటి హత్తించి. నిక్కి కూర్చుండి, చేతులరెంటిని మోకాళ్ళ ప్రక్కన దండమువలె చాచి, యాని యుండుట.

**బోధక గురువు** - శాస్త్రములయందుఁ గల శబ్దార్థముల బోధించు వాఁడు. అష్టవిధ గురువులలో నొకఁడు.

**బోధము** - విశ్వాసము. ఎఱుక.

**బ్రహ్మ** - సత్తే బ్రహ్మము. (సదేవ బ్రహ్మ.)

**బ్రహ్మకళాదశకము**- సృష్టి, బుద్ధి, స్మృతి, మేధ, కీర్తి, లక్ష్మి, ధృతి, స్థితి, స్థిర. సిద్ధి, అనునవి.

**బ్రహ్మచక్రము**- సంసార చక్రము. బ్రహ్మాండము.

**బ్రహ్మచర్యము** - వివాహము లేకుండుటయు, వివాహమైయున్న యెడల ఋతుకాలములందు మాత్రము నిజ భార్యతో సంగమించుటయు, పరస్త్రీల తల్లివలె భావించుచు బ్రహ్మమందే జొన్పినచిత్తముఁగలవాఁడైయుండుట.

**బ్రహ్మచర్యభేదములు**- గాయత్రీ బ్రహ్మచారి, బ్రాహ్మణ బ్రహ్మచారి, ప్రాజాపత్య బ్రహ్మచారి, బృహద్వ్రష్టచారులు.

(1) ఉపనయనానంతరము క్షార, లవణ, వర్జితముగ భుజించుచుండు వాఁడు. గాయత్రీ బ్రహ్మచారి.

(2) వేదగ్రహణ పర్యంతము బ్రహ్మచర్యము నల్పువాఁడు. బ్రాహ్మణ బ్రహ్మచారి లేక వైదిక బ్రహ్మచారి.
(3) ఒక సంవత్సరము వరకు వేద వ్రతము నాచరించువాఁడు లేక పరస్త్రీ విముఖుఁడై ఋతుకాలములందు మాత్రము నిజపత్నిని గూడుచుండు వాఁడు. ప్రాజాపత్య బ్రహ్మచారి.
(4) గురుకులవాసియై మరణ పర్యంతము నైష్ఠికుఁడుగ నుండువాఁడు. బృహద్బ్రహ్మచారి.

**బ్రహ్మచారి**— బ్రహ్మచర్యము ననుష్ఠించుచుండువాఁడు.

**బ్రహ్మణస్పతి**— వేదాధిపతి. విష్వక్సేనుఁడు. వేదములందు బ్రహ్మణస్పతిగానుండి. పురాణములలో తొండముతో కూడిన వినాయకుఁడాయెను.

**బ్రహ్మదండి**— వెన్నెముక. దేహమునకు వెనుకభాగమందు మూలాధారము మొదలు శిరస్సువరకు తంతులకాధారమైన వీణాదండమువలె వ్యాప్తమైన దీర్ఘాస్థి. దీనిని బ్రహ్మైక్య ప్రతిపాదకమగు బ్రహ్మనాడియనియు, బ్రహ్మదండి యనియు, వీణాదండమనియు, ఏకస్తంభమనియు, ఏకస్థూణమనియు, వెన్నుపూసయనియు, మేరువయనియు, చెప్పుదురు. పసుపు వర్ణముగ పూవులు పూయుచు ముండ్లు గలిగి, సుమారు రెండున్నర అడుగు లెత్తువరకు పెరిగి, ఆముగింజల ప్రమాణముగల నల్లని గింజలు.గల ముండ్ల చెట్టగు ఓషధికిని బ్రహ్మదండి యందురు. ఇదియే స్వర్ణక్షీరి. లేక బలురక్కసి.

**బ్రహ్మపర్యాయ నామములు**— జీవాత్మ, పరమాత్మ, జ్ఞానాత్మ, అంతరాత్మ, కూటస్థుఁడు.

**బ్రహ్మపురము**— శరీరము.

**బ్రహ్మభూయమ్**— బ్రహ్మస్వరూపము గుట. (బ్రహ్మత్వం, బ్రహ్మసాయుజ్యం, అని పర్యాయ నామములు గలవు.)

**బ్రహ్మము**— అధిష్ఠాన చైతన్యము. శరీర వ్యాపక రహితము.

**బ్రహ్మయోని**— అపరుఁడగు బ్రహ్మకు కారణభూతుఁడైనవాఁడు.

**బ్రహ్మరంధ్రము**— ఉచ్చి. నడినెత్తి. ఆజ్ఞాచక్రమునకుఁబైనున్న సహస్రారము. ద్వాదశాంతము.

**బ్రహ్మలింగములు**— బ్రహ్మమునుఁ దెలుపు గురుతులు. సర్వప్రపంచ కర్తృత్వము.

**బ్రహ్మవిదుఁడు**— సత్త్వాపత్తి యను నాల్గవ జ్ఞానభూమికయందు సంచరించువాఁడు.

**బ్రహ్మవిద్య**— స్వయంభువుఁడగు బ్రహ్మచేఁజెప్పఁబడినవిద్య. పరమాత్మ సంబంధమైన విద్య.

**బ్రహ్మవిద్యలు**— చాందోగ్య బృహదారణ్య, తైత్తిరీయాద్యుపనిషత్తులలోఁ బరబ్రహ్మో పాసకులకుగాను చెప్పఁబడియుండు ముప్పదిరెండు ఉపాసనలు.

| | | |
|---|---|---|
| 1 | సద్విద్య. | ఛాందోగ్య |
| 2 | అంతరాదిత్యవిద్య. | ,, |
| 3 | ఆకాశవిద్య. | ,, |
| 4 | ప్రాణవిద్య. | ,, |
| 5 | పరంజ్యోతిర్విద్య. | ,, |
| 6 | శాండిల్యవిద్య. | ,, |
| 7 | ఉపకోసలవిద్య. | ,, |
| 8 | వైశ్వానరవిద్య. | ,, |
| 9 | భూమవిద్య. | ,, |
| 10 | దహరవిద్య. | ,, |
| 11 | మధువిద్య. | ,, |
| 12 | సంవర్గవిద్య. | ,, |
| 13 | పంచాగ్నివిద్య. | ,, |
| 14 | ఈశావాస్యవిద్య. | ఈశావాస్య |
| 15 | నాచికేతవిద్య. | కఠోపనిషత్ |
| 16 | అంగుష్ఠ ప్రమితవిద్య. | ,, |
| 17 | సత్యకామవిద్య. | ప్రశ్నోపనిషత్ |
| 18 | అక్షరపరవిద్య. | ముండకం |
| 19 | ఆనందమయవిద్య. | తైత్తిరీయం |
| 20 | పురుషవిద్య. | ,, |
| 21 | ప్రతర్దనవిద్య. | కౌషీతకీ ఉపనిషత్ |
| 22 | బాలాకివిద్య. | ,, |
| 23 | అజావిద్య. | శ్వేతాశ్వతరోపనిషత్ |
| 24 | రుద్రవిద్య. | ఇతరోపనిషత్ |
| 25 | చతుర్ముఖవిద్య. | ,, |
| 26 | ఉద్దాలకాంతర్యామివిద్య. | బృహదారణ్యం |
| 27 | గార్గ్యక్షరవిద్య. | ,, |
| 28 | జ్యోతిషాం జ్యోతిర్విద్య. | ,, |
| 29 | మైత్రేయీవిద్య. | ,, |
| 30 | ఆదిత్య మండలస్థ సత్య (బ్రహ్మవిద్య.) | ,, |
| 31 | అక్షిస్థ సత్యబ్రహ్మవిద్య. | ,, |
| 32 | ఉషస్తి కహోళవిద్య. | ,, |

ఉపనిషత్తులలోఁ జెప్పఁబడియుండు విద్యలు మొత్తము నలువది యారులో బ్రహ్మవిద్యలు ముప్పదిరెండు పోను, కామ్యవిద్యలు పదునాలుగు. వానిపేర్లు కామ్యవిద్యలు అను శీర్షికలోఁ జూడుడు.

**బ్రహ్మవిద్వరిష్ఠుఁడు**— తుర్యగాయను నేడవ జ్ఞానభూమికయందు సంచరించువాఁడు. జీవన్ముక్తుఁడు. సర్వదా నిర్వికల్పనిష్ఠయందుండి శిష్యులు మేల్కొలిపినను ప్రపంచోన్ముఖుఁడు కాని వాఁడు.

**బ్రహ్మవిద్వరీయుఁడు**— పదార్థ భావనయను నారవ జ్ఞానభూమికయందు సంచరించువాఁడు. జీవన్ముక్తుఁడు. అనవరతము బ్రహ్మనిష్ఠయందుండుచు, శిష్యులు మేలుకొలిపినపుడు మాత్రము వలసినచో నన్నపానములఁగొనెడి మహాత్ముఁడు.

**బ్రహ్మవిద్వరుఁడు**— అసంసక్తియను ఐదవ జ్ఞానభూమికయందు సంచరించువాఁడు. జీవన్ముక్తుఁడు. ఏకాంతమగు స్థలమును జేరి బ్రహ్మనిష్ఠనలుపుచు, ఆకలిఁగొన్నపుడు మాత్రము భిక్షాన్నమును భుజించుచుండు మహాత్ముఁడు.

**బ్రహ్మవిదుఁడు**— జీవన్ముక్తుఁడు. శరీరేంద్రియాభిమాన రహితుఁడై, నిత్యనైమిత్తిక కర్మలను, యజ్ఞదానతపములను, ప్రతిఫలాపేక్షా రహితముగ నాచరించుచు, గృహ దార పుత్రాదులందు విరక్తిఁ గలిగి, జితేంద్రియుఁడై, యాత్మ జ్ఞానానుభవ జన్యజ్ఞానముఁ గలవాఁడై, యదృచ్ఛాలాభసంతుష్టుఁడై ప్రత్యగాత్మయగు తనయందే యానందించుచు, లోకోపకారార్థము సత్కర్మల నాచరించుచు, గృహస్థుఁడైయుండియో, లేక సన్న్యాసాశ్రమము స్వీకరించియో, శిష్యులకు వేదాంతమును బోధించుచుండువాఁడు.

**బ్రహ్మసూత్రము** - జంధ్యము. లేక యజ్ఞోపవీతము. త్రిగుణ విభాగముల వలననైన యిరువదియేడు భేదములు గల ద్వివిధ ప్రకృతులకంటె పరమైన పరమపదమును సూచించునదియే, యిరువదియేడు పోగులుగల, మూఁడు పోగులుగల, తొమ్మిది పేటలుగల, యజ్ఞోపవీతము.

**బ్రహ్మసూత్రములు** — వ్యాసభగవానునిచే 4 అధ్యాయములు, 16 పాదములు, 192 అధికరణములు, 555 సూత్రములుగ రచియింపఁబడిన యుత్తర మీమాంసయను వేదాంత దర్శనము.

**బ్రహ్మాంజలి**— ప్రణవోచ్చారణ పూర్వకమైన యంజలి.

**బ్రహ్మాండము**— ఆకాశాది పంచమహాభూతములు.

**బ్రహ్మానందము**— సుషుప్తియందు స్వజాతీయ, విజాతీయ, స్వగతభేద, రహితముగ వెలింగెడి జ్ఞానము. అష్టానందములలో నొకటి.

**బ్రహ్మర్గలం**— చిఱునాలుక. లేక అంగిటినాలుక. (బ్రహ్మర్గలం అంతర్జిహ్వా సుషిరం)

**బ్రహ్మాసనము**— యోగమునందలి స్వస్తిక, పద్మ, మున్నగు నాసనాదులు.

**బ్రాహ్మణము**— సంహితను జూడుము.

**బ్రాహ్మణ పరివ్రాజకన్యాయము** — గోబలీవర్దన్యాయము. ఒక జాతిని గ్రహించియు నేదియో యొక విశేషము నాశ్రయించి యందలి యొక భాగమును ప్రత్యేకముగ గ్రహించుట. అనఁగ వీరు బ్రాహ్మణులు అనిన నాలుగు ఆశ్రమములలో నుండువారని గ్రహించినను, ఆశ్రమ భేదమునుబట్టి వీఁడు పరివ్రాజకుఁడు, వీఁడు గృహస్థుఁడు, వీఁడు వానప్రస్థుఁడు, వీఁడు బ్రహ్మచారి, యనిచెప్పుట.

**బ్రాహ్మణుఁడు**— (1) ఉత్తరీయమును త్యజించి, పరుపులేకనే భూమిపై శయనించుచు, భుజమునే దిండుగ (తలగడగ) నుంచుకొనుచుండువాఁడు. (అనుత్తరీయ వసనమనపస్తీర్ణశాయినం, బాహూపధాయినం శాంతం, తం దేవా బ్రాహ్మణం విదుః) (2) దేహయాత్ర నడుపుట కొరకు అశనాచ్ఛాదన శయనములందు గుణదోషముల నాలోచింపక, దైవప్రాప్తములగు నశనాదులచేతఁ దృప్తుఁడగుచుండువాఁడు. (యేన కేనచిదాచ్ఛన్నో

యేనకేనచిదాశితః యత్ర క్వచన శాయాస్యాత్తం దేవా బ్రాహ్మణంవిదుః) (3) శీతబాధను నివారించుకొంతను, కాపీసమును, కాషాయదండములను ధరించినవాఁడై, బ్రహ్మ ధ్యానమందు నిరంతరాసక్తిఁగలవాఁడై, జనసంగమును వదలి, యేకాకిగాఁదిరుగువానిని, బ్రాహ్మణుఁడని దేవతలు చెప్పుదురు. (కంథాకాపీన వాసాస్తు దండవృద్ధ్యాన తత్పరః ఏకాకీరమతే నిత్యం తందేవా బ్రాహ్మణంవిదుః.) బ్రహ్మజ్ఞాని. జీవన్ముక్తుఁడు. బ్రాహ్మణ వంశ సంజాతుఁడు.

**బ్రాహ్మణభేదములు—** బ్రాహ్మణాద్వివిధాప్రోక్తా పండితా పామరాస్మృతాః, పామరాద్వివిధానామ బ్రాహ్మణ బ్రువ ధారణాః పండితా ద్వివిధాప్రోక్తా నియోగా వైదికా స్మృతాః)

**బ్రాహ్మణాచ్ఛంసి—** యజ్ఞములందు బ్రహ్మయను ఋత్విక్కునకు సాయముఁజేయు ఋత్విక్కు.

**బ్రాహ్మ్యతీర్థము—**బొటనవ్రేలియొక్క మొదటినుండి విడుచు బ్రహ్మ సంబంధమగు తీర్థము.

**బ్రాహ్మ్యస్నానము—** ఆపో హిష్ఠా మయోభువః అనుమంత్రమును నుచ్చరించుచు నీళ్ళను ప్రోక్షించుకొని చేయు స్నానము.

**భక్తి—** అంతఃకరణము భజనద్వారా భగవదాకారమగుట. వ్యవస్థితి పూర్వకమైన మనస్సుయొక్క భగవదాకార స్థితి. స్వరూపమైన సవికల్పవృత్తి. (భజత మంతఃకరణస్య భగవదాకారం భక్తిః) ఊడుగవిత్తులత్తవు నొయ్యన చేరెడిభంగి, అయస్కాంతము సూదిని లాగినట్లు, సాధ్వి నిజ వల్లభునిఁజేరునట్లు, తీగె వ్రూనికి పోకు విధముగ, నీశ్వరుని చరణారవిందములందు హత్తుకొనిన చిత్తవృత్తి. స్వస్వరూపానుసంధానము. (స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే)

**భక్తి త్రియము—** బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి

**భగము—** అణిమాద్యష్టైశ్వర్యములు. కీర్తి, శ్రీ, జ్ఞానము. వీర్యము, వైరాగ్యము, ధర్మము, ఈ యారింటిని భగమందురు. (ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశస్స శ్రియః జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాంభగ ఇతీరితాః) ఉపస్థకును, మ్రాని తొఱ్ఱకును పేర్లు.

**భగవతీ—** సర్వైశ్వర్యములతోఁగూడినది.

**భగవదనుభవ చతుష్టయము —** కర్మప్రధానీ భూతానుభవము, జ్ఞానప్రధానీ భూతానుభవము, కర్మజ్ఞానోభయ ప్రధానీ భూతానుభవము, కేవలానుభవము.

**భగవంతుఁడు—** షడ్గుణైశ్వర్యయుతుఁడు. భూతముల పుట్టుకను, నాశమును, రాఁబోయెడి సంపత్తును, ఆపత్తును, జ్ఞానమును, అజ్ఞానమును, ఎవఁడెఱుఁగుచున్నాఁడో, అతఁడు భగవంతుఁడు. (ఉత్పత్తి ప్రళయంచైవ భూతానామాగతింగతం వేత్తి విద్యాను విద్యాంచ సవాచ్యో భగవానితి.)

**భద్రాసనము**— వృషణములకు క్రింది భాగమైన నరముల రెండుప్రక్కల యందును కాలిమడమలను చేర్చ వలయును. అనఁగా నెడమప్రక్క ఎడమ మడమను, కుడిప్రక్క కుడి మడమను చేర్చవలయును. ఇరు ప్రక్కలయందును సమీపమందుఁగల రెండు పాదములను రెండుచేతులతో బలముగఁజేర్చుకొని యుండునది భద్రాసనమందురు. ఒకటితో నొకటి చేరిన వ్రేళ్ళుఁగలదియును, కడుపుతో నంటి నదియగు చేతులతో వెనుక ప్రక్కగాఁబట్టుకొని యుండునది.

**భరము**— జననమరణ రూపసంసారము.

**భస్త్రిక**— అష్టవిధకుంభకములఁజూడుము.

**భవప్రత్యయులు**—పంచభూతములను, ఇంద్రియములను, వికృతి తత్త్వములందును, అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, అను ప్రకృతి తత్త్వములందును, ఆత్మ యను తలంపుఁగలిగి యుండువారు.

**భాగవత్తనువు**— కారణ శరీరము.

**భాగత్యాగము**—విరుద్ధాంశ పరిత్యాగము.

**భావనాద్వైతము**— వస్త్రములకును, తంతువులకును అనఁగ వస్త్రములకు నూలుపోగులకు నైక్యమెట్లో, అట్లు కార్య కారణములు రెండును నొక్కటి యేయని యోచించుట.

**భావశుశ్రూష**— పరబ్రహ్మము త్రికాల సాధ్యమైనదనియును, ఆ పరబ్రహ్మమే తాననియును భావించుట,

**భావాష్టకము**— ధర్మ, జ్ఞాన వైరాగ్య, ఐశ్వర్యములును, అధర్మ, అజ్ఞాన, అవైరాగ్య, అనైశ్వర్యములును చేరి భావాష్టక మందురు.

**భావి ప్రతిబంధము**— పాప కర్మల వలన కాలనియతిఁదెలియ వచ్చునది. జ్ఞాన ప్రతిబంధకములలో నొకటి.

**భాష్యము** సూత్రముల ననుసరించిన పదముల వర్ణించుచు, స్వపదములచే వివరించు సూత్రార్థములు. (సూత్రార్థో వర్ణ్యతే యత్ర పదైస్సూత్రానుసారిభిః స్వపదానిచ వర్ణ్యంతే భాష్యం భాష్యవిదో విదుః)

**భిక్షువు**— భిక్షాన్నమును భుజించి బ్రహ్మ నిష్ఠఁజేయుచు జ్ఞానమును బోధించు చుండువాఁడు.

**భుజగీకరణము**— కుంభక విశేషము. కంఠముచే వాయువును పూరించి, కంఠ నాళముచేతనె వాయువును రేచించు నట్టి ప్రాణాయామ పద్ధతి.

**భువనాధ్వము**— భద్రకాళి, వీరభద్రాది, ఇన్నూట యిరువదినాలుగు భువనములు. షడధ్వములలో నొకటి.

**భూచరీముద్ర**— తారకయోగుల కవశ్యమగు పంచముద్రలలో నొకటి యగు ముక్కుకొనయందు చూపు నిలిపి చూచెడి చూపు.

**భూతప్రతిబంధము**— తనకు పూర్వ మొకప్పుడు కలిగియుండిన ప్రియ వస్తువుపై సదాస్మరణ కలుగుట.

**భూమ**— సుఖము. ఏస్థితియందు రెండవ దానిని చూచుట, వినుట, తెలిసి

కొనుట లేదో, అట్టిస్థితిని భూమా యందురు. (యోవైభూమా తత్సుఖం) బహుత్వము. పరబ్రహ్మము.

భూమికలు— సోపానములు, మెట్లు.

భేకాసనము— రెండపాదములను రెండు భుజములపైనుంచి, యాపాదములపై రెండుచేతులనుంచి యుండునట్టి రీతి.

భౌతికము— భూతసంబంధమైనది.

భౌతిక లింగపంచకము — భ. కీ. ఖ. భారతదేశమందలి శివలింగములు.

(1) పృథ్వీలింగము. ఏకాంబరేశ్వరుఁడు. కాంచీపురము.

(2) అప్పులింగము.— అఖిలాండేశ్వరుఁడు. జంబుకేశ్వరము.

(3) అగ్నిలింగము. అరుణాచలేశ్వరుఁడు. తిరువణ్ణామలై.

(4) వాయులింగము కాళహస్తీశ్వరుఁడు. శ్రీకాళహస్తి.

(5) ఆకాశలింగము. నటేశ్వరుఁడు. చిదంబరము.

భ్రమరకీటన్యాయము — భ్రమరము అనఁగాఁ బూతెనియనాను తుమ్మెద జాతి పురుగు ఇతరజాతి సామాన్యపు పురుగునుదెచ్చి గూటియందుంచి తనఝుంకార శబ్దముచే నాపురుగునను తన జాతి భ్రమరముగ మార్చునట్లు, అజ్ఞానియగు వ్యక్తిని తనచెంతఁజేర్చి, తన యోగమహిమచేతను, జ్ఞానబోధచేతను, తనవలె నాయజ్ఞానిని, జ్ఞానిగా మార్చుపద్ధతి.

ాచన— ఈ విషయమును పరిశోధన స లిపి చూడ గఁదెలియవచ్చినదే మనఁగ, నీ జాతిపురుగు అనఁగా మన యిండ్లయందు మట్టితోడను, లక్క తోడను గోడలకు లేక దూలములకు గూండ్లు నిర్మించి, అందు తాను గ్రుడ్లు పెట్టి, యాగ్రుడ్డుపగిలి పిల్లయైనప్పుడు ఆ పిల్లపురుగు రెక్కలు మొలచి బయలు వెడలువఱకు దానియాహారమునకై, ఇతరజాతి పురుగును గూటియందు పెట్టుచున్నదనియు, గూటిలోని పిల్లపురుగు కొంచెము కొంచెముగ యాపురుగునుతిని పెరిగి పెద్దదియై రెక్కలు మొలచినవెంటనే గూటినుండి బయటికివచ్చి వేయుచున్నదనియు, స్పష్టముగ తెలిసినది. పాఠకులీ విషయమును పరిశోధించి చూచిన తెలియగలదు.

భ్రమరసృష్టి— కామసంకల్పాది రూపమనోవృత్తి.

భ్రాంతిజన్య తాదాత్మ్యము — తాదాత్మ్యత్రయమును జూడుడు.

భ్రామరి— అష్టవిధ కుంభకములఁ జూడుడు.

భ్రూమధ్యము— కనుబొమల నడిమి స్థలము, ఈచోటికి పర్యాయనామములు గఁజతుష్పథము, శృంగాటకము, త్రికూటము, త్రివేణీసంగమము, కేదారము, శ్మశానము, అనుచుందురు. దీనిని స్థూల భ్రూమధ్యమందురు. సూక్ష్మ భ్రూమధ్యమనునది త్రిపుటి అనఁగ జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయముల ఐక్యమునకుఁజెప్పుదురు.

మజ్జ— ఎముకల మధ్యనుండు మూలుగు.

**మతాంతరసిద్ధాసనము**— లింగము మీఁద నెడమ పాదమునుంచి, ఎడమ పాదముమీఁద కుడిపాదమునుంచి కూర్చుండుట.

**మతి**— అనేక శాస్త్రార్థములను జెప్పుట వలనఁగలుగు అర్థనిర్ణయము. ఇందు యుక్తములగు, పనులఁజేయుట, సంశయములు బోఁగొట్టుట, శిష్యోపదేశము, కనుబొమలనాడించుట, ఊహాపోహములు, మొదలైనవి కలుగును.

**మత్సరము**— పరోత్కర్షాసహనము. అనఁగాఁనితరుల మేలోర్వమి.

**మత్స్యావతారము** — విష్ణువుయొక్క ప్రథమావతారము. కాశ్మీరదేశమందలి హిమవన్నగముపైనుండు గంగాబల్ సరస్సున, చైత్ర బహుళపంచమినాడు జననము.

**మత్స్యేంద్ర సిద్ధాసనము** — యోని స్థానమును నెడమకాలి మడమచే హత్తించి, కుడిగుడికాలును లింగము మీఁదహత్తించి, హృదయమునకు నాలుగంగుళములకుపైన గడ్డము నానించి, నిశ్చలమగు అర్ధోన్మీలిత దృష్టితో భ్రూమధ్యమును వీక్షించుచు, చేతుల నాభిస్థానమున నుంచుట.

**మత్స్యేంద్రాసనము**— ఎడమతొడ మూలమున నుంపఁబడిన కుడిగుడి కాలిపైభాగమును, వెనుక బయట నుంపఁబడియుండు కుడిచేతితోఁబట్టు కొని, కుడిమోకాలి బయట నుంపఁబడి యుండు ఎడమ పాదమును ఎడమ కాలికి బైటచుట్టిన కుడిచేతితో నెడమ కాలి బొటనవ్రేలిని పట్టుకొని, ఎడమ ప్రక్కన ముఖముండునట్లు తిరిగిన శరీరముగా నుండునట్లుంచుట.

**మధుపర్కము**—పూజ్యులగువారు తన యింటికి వచ్చినపుడు, వారినిగౌరవించుటకై సిద్ధపరుపఁబడిన పానము. ఈ మధుపర్కము పెరుగు, నెయ్యి, నీరు, తేనె, పంచదారలయొక్క మేళనమగును. (దధి సర్పిర్జలంక్షౌద్రం సితా చైతైస్తు పంచభిః ప్రోచ్యతే మధుపర్కస్తు. ........ ॥

**మధుప్రతీకము** — వశీకృతేంద్రియుఁడగు యోగికీ దూరదృష్టి, దూరశ్రవణము, మున్నగు సిద్ధులు కలిగియుంటట.

**మధుమతిభూమిక**— జ్ఞానభూమికాసప్తకమున నేడవదియగు తుర్యాగాయను భూమిక.

**మధువు**— తేనె, తేనెటీఁగలచే గూర్పఁబడిన పుష్పరసము లేక మకరందము. బలవర్ధకమగు సాత్త్వికాహారము. పూర్వపు మధుసంచయనము హింసాభరము. ఆధునిక వ్యవసాయ శాఖ వారిచే సేకరింపఁబడు విధానము హింసలేనిది. ఈ తేనె 8 విధములగు తేనెటీగజాతులచేఁ గూర్పఁబడు చున్నది. మాక్షికము, భ్రామరము, క్షౌద్రము, పౌత్రికము, ఛత్రము, అర్ఘ్యము, ఔద్దాలము. దాలము, అను పేర్లతో నున్నది.

మాక్షికము- పుష్పరసమును గ్రోలు కపిల వర్ణముఁగల మక్షికములనఁబడు అడవి యీఁగలచేఁగూర్పఁబడిన తేనె.

భ్రామరము- తుమ్మెదలచేఁగూర్పఁబడినతేనె.

క్షౌద్రము- క్షుద్రములనంబడు పింగళ వర్ణముఁగల చిన్నతేనెటీగలచేఁగూర్పఁబడిన పింగళ వర్ణముఁగల తేనె.

పౌత్రికము- పుత్రికలనంబడు పచ్చని రంగుఁగల కొంతయీఁగలచేఁగూర్పఁబడిన తేనె.

ఛత్రము- పీతవర్ణముఁగల తేనెటీగఁలచేఁగట్టఁబడిన గొడుగువలె నుండు తేనె తెట్టియల యందలి తేనె.

అర్ఘ్యము- పచ్చనై గరుసుఁగల ముక్కులు గల్గి తుమ్మెదల వలెనుండు ఈఁగలచేఁగూర్పఁబడిన తేనె.

ఔద్దాలము- భూమిని భేదించి పుట్టలఁబెట్టు స్వభావముఁగల్గి కపిలవర్ణముఁగల తేనెటీఁగలచేఁ బుట్టయందుఁ జేర్పఁబడిన బంగరు రంగుఁగల తేనె.

దాలము- ఇంద్రనీల ఖండము వలె నల్లనై సూక్ష్మాకారములగు తేనెటీఁగలచే వృక్షనితొఱటలయందుఁగూర్పఁబడి కొంచెము పచ్చనై యుండు తేనె.

**మధ్యచరిముద్ర** — పంచముద్రలలో నొకటియగు పైకిని క్రిందికినిగాని నడిమి చూపు.

**మధ్యమకుంభకము**— ప్రాణాయామమున నొడలు వడఁకునట్లు కుభించుట.

**మధ్యమ పరమాణువు**— పరమాణువులో సర్ధభాగము.

**మధ్యమ ప్రాణాయామము**— రెండు ఉద్ఘాతములు లేక ఇరువదినాలుగు మాత్రలకాలము వరకు నాచరించు ప్రాణాయామము.

**మధ్యమవృత్తి**— శిష్యులగువారు గుర్వాజ్ఞననుసరించి గురువు చెప్పిన పనులఁజేయుట.

**మధ్యమావాక్కు**— బ్రహ్మప్రణవమందలి "ఉ" కార విద్యాపాదాత్మక మహదహంకార రూపవృత్తి. మాటలు వినినను వాని యర్థముఁదెలియనిదశ.

**మననము**— యోచించుట.

**మనఃపరిణామభేదములు**— క్షిప్తము, మూఢము, విక్షిప్తము, ఏకాగ్రము, నిరుద్ధము లని యైదువిధములు. అందు.

క్షిప్తము- అనునది కర్మానుసారముగ ననుభవించు పలువస్తువులయందును ఆశఁగలదై దేనియందును నెలకొనక తిరుగునట్టి మనస్సు యొక్క స్థితి. దీనియందు సమాధికుదురదు.

మూఢము- నిద్ర, అలసత్వము, తామసములతోఁగూడిన మనస్సు యొక్క స్థితి. దీనియందు సమాధికుదురదు.

విక్షిప్తము- ఎప్పుడో యొకప్పుడు మాత్రము సమాధికుదిరి, తక్కినపు డెల్లను ఇతరవిషయములందు ప్రవర్తించునట్టి మనస్సుయొక్కస్థితి. దీనియందు సమాధికుదిరినను విక్షేపము యొక్క ప్రధానమువలన యోగపక్షమందు నెలకొనుటలేదు. వేగమైన గాలిచే విక్షేపింపఁబడు దీపమువలె తనంతట నష్టమైపోవును.

ఏకాగ్రము- యమనియమాద్యష్టాంగయోగాభ్యాసబలమున నెడతెగక ప్రవహించు ప్రవాహమువలె, ఒకే వస్తువు నందు ప్రవేశించియుండు మనస్సుయొక్క యునికి. దీనియందు సంప్రజ్ఞాతసమాధి కలుగుచున్నది. దీనినే సవికల్ప సమాధియందురు.

నిరుద్ధము- మనస్సైనది తనను మఱచి ఇతరవిషయములందే మాత్రమును ప్రవేశింపని యునికి. దీనియందు అసంప్రజ్ఞాత సమాధి కలుగుచున్నది. దీనినే నిర్వికల్ప సమాధియందురు.

**మనుష్యానందము**— సౌందర్య, యవ్వన, ఆయురారోగ్యములతో దృఢగాత్రుఁడై, ఏకచ్ఛత్రాధిపత్యముగ భూమినేలుట. అష్టవిధానందములలో నొకటి.

**మనోమయకోశము**— అన్నమయ ప్రాణమయ కోశములు రెంటితోఁ గూడిన ఆత్మయైనవాఁడు, మనస్సు మొదలగు పదునాలుగు కరణముల చేత, శబ్దాది విషయ సంకల్పాది ధర్మములను చేయుచుండు స్థితి.

**మనోరాజ్యము**— సంతత విషయ ధ్యానము.

**మయూరాసనము**— చేతివ్రేళ్ళను విరళముఁజేసి రెండుచేతులను నేలయందూని మోచేతులను నాభికిరుప్రక్కలందుంచి ముఖమును పైకెత్తి కాళ్ళను నెమిలితోకవలెచాచి దండమువలె పైకెత్తి యుంచుట.

**మరలోకము**— సకల భూతములును మరణించునట్టి భూలోకము.

**మరుత్తులు**— పితృలకు స్థానమై యుండువారు.

**మర్కటాసనము**— చేతులతో పాదములను చక్కగానదిమి, పాదములమధ్యమున శిరస్సును విల్లువలెనుంచి యంగుష్ఠములను దృఢము గఁబట్టి యుండుట.

**మర్కటకిశోరన్యాయము**- భక్తుఁడు భగవత్ప్రాప్తికై జ్ఞాన, యోగ, తపస్సులఁగావించు పద్ధతి. కోతిపిల్ల స్వశక్తిచేఁదల్లిని గట్టిగాఁబట్టుకొనియుండునట్లు, ప్రయత్నపూర్వకముగ నీశ్వరునిఁబొందఁగోరుట. దీనికి శక్తి చాలమిచేఁగొండొక సమయమున చ్యుతి గలుగవచ్చును.

**మర్త్యుఁడు**— మరణమే ధర్మముగఁగల మనుష్యుఁడు.

**మస్కరి**— సన్న్యాసి. కామ్య కర్మముల ప్రతిషేధించువాఁడు. వేణుదండము గలవాఁడు. (మాకరణశీలః కామ్యకర్మ ప్రతిషేధ పరోవామస్కరి) (2) (మస్కరోవేణుదండః సోఽస్యాస్తీతి మస్కరి)

**మహాకాశము**— జ్వలించుచున్న మంటలచే భయంకరకార్చిచ్చువలెనుండు నాకాశము. పంచాకాశములలో నొకటి.

**మహాజాగ్రము**— అజ్ఞాన భూమికాసప్తకమున నొకటి. ప్రపంచవాసన ప్రబలియుండుట. పంచభూతములు స్ఫురించు మెళకువ. సృష్టి.

**మహాదేవి**— ప్రణవము. ప్రకృతి.

**మహాపద్మము**— సర్పవిశ్వను జూచుడు.

**మహాబంధము**— ఎడమగు డి కాలిని లింగస్థానమందుంచి. కుడికాలినిచాచి రెండు చేతులతోఁజక్కగాఁబట్టుకొని, గడ్డమును ఱొమ్మునందుంచి, పూరకముఁగావించి కుంభించి రేచింప వలయును. ఇట్లు ఎడమవైపునభ్యసించిన వెనుక, కుడివైపు నభ్యసింప వలయును. ఏపాదముచాపఁబడినదో, దానిని పిమ్మట తొడమీఁద నుంచవలెను.

**మహాభేకాసనము** — ఖేచర్యాసనము. సర్వాంగములను నాకాశమందు పాపిగించుట.

**మహామాయ**— ప్రణవము. ప్రకృతి.

**మహామోహము**— విషయభోగేచ్ఛ.

**మహారజస్సు**— స్త్రీ యొక్క ఋతు రక్తము.

**మహాలక్ష్మి**— ప్రణవము. ప్రకృతి.

**మహావాక్యములు**— జీవేశ్వరుల క్యైక్య నిరూపణ యుక్తములగు తత్పదార్థ, త్వంపదార్థముల యభేదము నుఁ దెలుపునట్టి తత్త్వమసీత్యాది వేద వాక్యములు. (అభేదబోధకం వాక్యం మహావాక్యం.)

**మహావాక్యచతుష్టయము** — నాలుగు వేదములయొక్క జ్ఞానకాండల సారములగు

(1) ప్రజ్ఞానం బ్రహ్మ అనువాక్యము. ఋగ్వేదమందలి ఐతరేయో పనిషత్తులోనిది. సర్వమును ఎదియెఱుఁగుచున్నదో యట్టిచైతన్యమే బ్రహ్మమను వాక్యము.

(2) అహంబ్రహ్మాస్మి. నేను బ్రహ్మ మగుచున్నాను. అను నర్థముగలది. యజుర్వేదమందలి బృహదారణ్యకోపనిషద్వాక్యము.

(3) తత్త్వమసి— అది (అపరబ్రహ్మము నీవు అగుచున్నావు., అనునర్థముగలది. సామవేదమందలి చాందోగ్యోపనిషద్వాక్యము.

(4) అయమాత్మా బ్రహ్మ. ఈయాత్మయే బ్రహ్మము. అనునర్థముగలది. అథర్వణ వేదమందలి మాండూక్యోపనిషద్వాక్యము.

**మహావిద్య**— అజపాగాయత్రి.

**మహాశూన్యము**— భ్రూమధ్యాకాశము.

**మహాసరస్వతి**— ప్రణవము. ప్రకృతి.

**మహిమ**— ప్రకృతిని లేక స్వభావమును పూరింపఁజేయుటవలన శరీరము నువలసినంత గొప్పదిగాఁజేసికొనఁగల్గు తపస్సిద్ధి. అణిమాదులలో నొకటి.

**మహీపీఠము**— సిద్ధర్షి సంఘము. స్వాయంభువగు బ్రహ్మయొక్క మానసపుత్రులు అనేక ఋషులతోసహా శ్రీసనత్కుమారులవారి యధికారము నకులోబడి, మహీపీఠమను, నొక సమాజముగా నేర్పడి శ్వేతద్వీపమందున్నారనియు, వారులోక కల్యాణము నకై పాటుపడుచుందురనియు ప్రసిద్ధి.

**మాతృపంచకము** — తన్ను గన్నతల్లి, తన భార్యను గన్నతల్లి, అన్నభార్య గురుభార్య, ఏలికయొక్క భార్య.

**మాత్ర**— కాలముయొక్క అల్పభాగము. మాత్రయనఁగ యోగశాస్త్రములలో పలువిధములుగఁజెప్పబడి యున్నవి. (1) మోకాలిని త్వరితముగను అలస్యముగను లేక చేతితోఁజుట్టి చిటికవేయు నంతకాలము. (2) మోకాలిని తుడిచి చిటికెవేయునంత కాలము. (3) చిటికె వేయునంతకాలము. (4) మూఁడు చిటికెలు వేయునంత కాలము. (5) ఒక్క శ్వాసకాలము. (6) మూఁడు తాళములు వేయు నంతకాలము.

చందస్సునందు.

ఒక చిటికెవేయు కాలము ఒకమాత్ర. దీనిని లఘువందురు. హ్రస్వాక్షరోచ్చారణకాలము.

రెండు చిటికలు వేయునంతకాలము రెండుమాత్రలు.దీనిని గురువందురు. దీర్ఘాక్షరోచ్చారణకాలము.

మూఁడు చిటికెలు వేయునంతకాలము మూఁడు మాత్రలు. దీనిని ప్లుతమందురు. సంబోధనకాలము.

నాలుగుచిటికెలు వేయునంతకాలము నాలుగుమాత్రలు దీనిని కాకపాద మందురు. (సంగీతమునందు)

(వ్యంజనం త్వర్ధమాత్రకం) అర్ధమాత్ర వ్యంజనోచ్చారణ కాలము క్. ఖ్. గ్. ఘ్. ఇత్యాదులు.

ఇందుకుగుర్తులు లఘువు । గురువు ◡ కాకపాదము +.

వైద్యమున మాత్రయనఁగ ఘుటిక.

**మానసికతపస్సు** — మనస్సంతోషము, సౌమ్యత్వము, ఇంద్రియ నిగ్రహములుగలిగి, భావశుద్ధితోనుండుట. త్రివిధ తపస్సులలో నొకటి.

**మానసిక స్వాధ్యాయము**— అన్యులకు వినఁబడకుండునట్లు పఠించుట. స్వాధ్యాయ త్రయములలో నొకటి.

**మానుషవిత్తము** — శరీరపాటవముఁ గలిగి గోహిరణ్యాది సంపత్తిఁగలిగి యుండుట.

**మానుషసంపద** - రజోగుణ ప్రధానములగు ఉంబములకై చేయు అనుష్ఠానములు. పటాటోపము.

**మాయ**— (యా నపద్యతేవస్తుతః సా మాయా) ఏదివాస్తవముగ లేదో అదే మాయ. కల్పితము. సత్వగుణము. (తదేవ మూలప్రకృతిః, తన్స్వరూపము జ్ఞానం) అజ్ఞానము- బ్రహ్మతోఁగూడిన మూల ప్రకృతి.

**మాయికమలము**— స్థావరజంగమాత్మక ప్రపంచోత్పత్తి స్థితి లయములకు కారణమైనది. జ్ఞానవాసనను కలుగనీయనిది.

**మాయేయమలము**— పాపకార్యములందు మనస్సును చొరఁబెట్టునది.

**మార్జాల కిశోరన్యాయము** — భక్తిమార్గము. సర్వము భగవదేచ్ఛయుని శరణాగతినిఁబొంది తన కష్ట సుఖములు తల్లిదేయని పిల్లిపిల్లలు తల్లిని నమ్మియుండునట్లు, ఈశ్వరుని నమ్మి అనన్యభక్తిని సలుపుచుండు పద్ధతి.

**మాల**— జపమాల. తావళము. సమూహము.

**మాలాసంస్కారము** — గురువుగారు శిష్యుని పరిపక్వము ననుసరించి జపమాలనిచ్చు సంప్రదాయము.

**మితాహారము**— స్నిగ్ధములును, మధురములును నగు, ఆహారమును నీశ్వర ప్రీతిగ సగము కడుపునకుతిని, పాతిక కడుపునకు నీరుత్రాగి, పాతిక కడుపు గాలితిరుగుటకొఱకు వెలితిగనుంచుట. (ద్వాభాగౌపూరయేదన్నైస్తో యేనైకం ప్రపూరయేత్। వాయోస్సంచరణార్థాయ, చతుర్థమశేషయేత్॥ )

**మిత్రుఁడు**—అహరభిమాన దేవతయగు సూర్యుఁడు. ఈకాలము మొదలు ఇంతవరకు పగలు అని కాలమును నిర్ణయించిన ప్రథముఁడు.

**మిథ్య**— లేని ప్రపంచమును బ్రహ్మము నందారోపించుట.

**మిథ్యాచారి**— విషయాదులందను రక్తిఁ గలిగియు, కర్మేంద్రియముల నరికట్టియుంచి, మనసావిషయములందాసక్తిఁగలిగి ప్రపంచమున జ్ఞానివలె నటించువాఁడు.

**మిథ్యాత్మ**— స్థాణువును పురుషుఁడను కొనునట్లు, పంచకోశములను తానను కొనుట.

**ముక్తాసనము** — సిద్ధాసనభేదము.

**ముక్తిత్రయము** — క్రమముక్తి, జీవన్ముక్తి, విదేహముక్తి.

**ముకుందుఁడు** — ఇహపర సౌఖ్యముల నొసఁగువాఁడు.

**ముక్తులు** — సగుణముక్తి, నిర్గుణముక్తి, జీవన్ముక్తి, విదేహముక్తి.

**ముఖ్యవృత్తి** — శిష్యాదులు గురునకు నే సమయమందేది యవసరముఁ గలదో, నాయవసరమును గ్రహించి యాయాపనుల నొనర్చుట.

**ముఖ్యాత్మ** — స్థాణువును స్థాణువుగాఁ దలంచునట్లు, తన్ను సాక్షిగాఁ దెలియుట.

**ముఖ్యానందము** — ప్రియాది సమస్త వస్తువులు గలిగినపుడును, అవిలేనిపుడును, మోదభేదంబులులేకనుండుట. అష్టవిధానందములలో నొకటి.

**ముని**— మౌనవ్రతుఁడు.

**ముముక్షత్వము** — సకలసంసారములను, వానివాసనలను, త్యజించుటకు కారణమగు మోక్షేచ్ఛ.

**ముముక్షువు**— సప్తజ్ఞానభూమికలలో మొదటి మూఁడు భూమికలయందు సంచరించువాఁడు. ఆరురుక్షువు, మోక్షార్థి.

**ముహూర్తము** —రెండుఘడియలు లేక 48 నిమిషముల కాలము.

**మూకాక్షరము**— ○ ఈ గుర్తు. అనుస్వారము. ఓంకారముయొక్క చతుర్థ పాదము.

**మూఢము**— మనః పరిణామ భేదముల **జూఢుధు.**

**మూఢవృత్తి**— భ్రమ, చంచల, భయాది లక్షణములుగలవృత్తి. వృత్తి త్రయములో నొకటి.

**మూర్తములు**— పృథ్వీ, అప్పు, తేజస్సులు. కంటికి కనఁబడు భూతములు.

**మూర్ఛ**— పూరకాంతమునందు దృఢమైన జాలంధర బంధనముచేసి మెల్ల మెల్లగా రేచించుట. అష్టవిధ కుంభకములలో నొకటి.

**మూర్ఛితము** — రేచకము నివర్తింపఁబడినవాయువు. ఓషధుల సంబంధము చేత చలన రాహిత్యమైన పాదరసము.

**మూర్తిత్రయము**— బ్రహ్మ, విష్ణు, రుద్రులు.

**మూలప్రకృతి**— అవ్యక్తమను పేరుఁగల పరమేశ్వరుని శక్తి.

**మూలబంధము**— గుదికాలిచేత యోనిస్థానమును చక్కగా పీడించి, గుదమును సంకుచితముఁజేసి క్రిందికి పోవునట్టి యపానవాయువును మీఁదికి లాగుట. మతాంతరమున ఇనుప కచ్చడము ధరించి బిగించుట.

**మూలమంత్రము**— ప్రణవము. మూలాధారమునుండి యుద్భవించుటచే మూల మంత్రమునఁబడును. (మూలాధారాత్సము ద్భవాత్, మూల మంత్ర ఇతి స్మృతః)

**మూలాధారచక్రము**— గుదస్థానమున "వశషస" అను నాల్గక్షరములతే నాలుగు దళములుగఁగల్గి త్రికోణాకృతితో భూమితత్త్వయుక్తమై వినాయకుఁడధి దేవతగఁగలిగిన చక్రము. షడాధారములలో నొకటి.

**మూలావిద్య**— ఈశ్వరునియందు కల్గిన యవ్యక్తము.

**మూలికాసిద్ధి**— శక్తివంతములును, వీర్యవంతములును నగు కొన్ని ఓషధీ మూలికలచే నిద్రాహారములు లేకుండుట, శీతోష్ణ విషవ్యాధి నిగ్రహము, దూరగమనాదులు, లేహ్యచూర్ణ కాయకల్పసిద్ధులు, రసాయనఘుటికలు, పాదుకలు మున్నగువానిఁగలిగియుండుట.

**మృతజీవులు** — శరీరము నశించినను కీర్తిచేఁబ్రసిద్ధి నొందుచుండువారు, కవులు, త్యాగులు, వీరులు, దాతలు, న్యాయ ప్రభువులు.

**మృతము**— బ్రహ్మరంధ్రమున లీనమైన వాయువు. భస్మమైన పాదరసము.

**మేధ**— విన్నవానినెల్ల మఱువక గ్రంథ ధారణ సామర్థ్యముఁగల బుద్ధి విశేషము. సప్త విధబుద్ధులలో నొకటి.

**మేధానాడి** — పండ్రెండేళ్ళుతన బిందువును స్ఖలితముఁగానీయక బ్రహ్మచర్య మనుష్ఠించి కాపాడెనేని, శరీరమున నొక క్రొత్తనరముత్పన్నమగును. ఆ రీతిగఁ గలిగిన నరమే మేధానాడి, అది పుట్టినది మొదలు ఎంతటి జటిలమైన విషయమైనను జ్ఞప్తికిఁదెచ్చుకొని సమస్తమును చెప్పఁగలుగుచుండు.

**మేరువు** - వెన్నెముక. జపమాలలోని మేరుపూస. హేమాద్రి.

మైత్రావరుణుఁడు – యజ్ఞము లయందు హోతకు సహాయముఁజేయు ఋత్విక్కు. అగస్త్యుఁడు.

మైథునాష్టాంగములు – స్త్రీని దలఁచుట, పొగడుట, క్రీడించుట, చూచుట, రహస్యముగ మాటలాడుట, ఉద్దేశించుట, నిశ్చయించుట, సంగమించుట.

మోఘకర్మ – నిష్ఫలములైన కర్మలందాసక్తిఁగల్గి చేయుపని.

మోఘజ్ఞానము – విపరీత జ్ఞానము వలనఁగల్గెడి నిష్ఫల జ్ఞానము.

మోఘాశ – నిష్ఫలమైన కోరికలు.

మోహము – దేహాద్యభిమానము. వలపు. అజ్ఞానము. మూర్ఛ. నాదియనెడిబుద్ధి.

మ్లేచ్ఛులు – మనకు తెలియని భాష మాట్లాడువారు. (మ్లేచ్ఛంతే అవ్యక్తం భాషంతే ఇతిమ్లేచ్ఛాః) మ్లేచ్ఛ- అవ్యక్త శబ్దే.

మోక్షము – అహంకార మమకారముల వదలుట. జనన మరణములను బంధమునుండి విడుదల. ముక్తి, కైవల్యము, నిర్వాణము, అపవర్గము, ఇవి సమానార్థకములు.

మోక్షభూమి – గంగాది నదులు గలదియు, సాధుసమ్మతములను, నిర్మలములును, మంచినీరు గల నదబావులు తటాకములు గల స్థలములు. (మోక్షభూమి రితిఖ్యాతం, విమలం సాధుసమ్మతం, దివ్యాపగా దేవఖాత, వాప్యాది విమలోదకం)

మౌనత్రయములు – వాఙ్మౌనము, అక్షమౌనము, కాష్ఠమౌనము.

మౌన సమయములు – మలమూత్రములవిడుచునపుడు, స్త్రీసంగమమువేళ, స్నానమపుడు, భోజనము, దంతధావనము, యజ్ఞము, హోమము, జపము ఇత్యాదు లాచరించు సమయములు. (మేహనే మైథునే స్నానే భోజనే దంతధావనే ఇజ్యాయాం సహహోమేచ జపేమౌనం సమాచరేత్)

మండలత్రయములు – సోమ, సూర్య, అగ్నిమండలములు.

(1) చంద్రమండలమనఁగ భ్రూమధ్యముకడ లయస్థానము.
(2) సూర్యమండల మనఁగ హృదయము కడ నుండి మనస్సును వృద్ధిపరచునట్టి విష్ణుగ్రంథి యనఁబరగు స్థితిస్థానము.
(3) అగ్నిమండల మనఁగ నాభికి దిగువ స్వాధిష్ఠానము.

మండూకాసనము – కాలి మడమల రెంటిని ఒకటితో నొకటిఁజేర్చి గుదస్థానమునందానునట్లుంచి, రెండు చేతులను చాచి, మోకాళ్ళపై దండము వలె నుంచుట.

మంత్ర పల్లవములు – నమః, స్వాహా, ఫట్, వౌషట్, వషట్, ఖేద, స్వధ అను మాటలు.

ఈ యక్షరములను జపించు మంత్రములయందు వశ్యమాకర్షణము

లకు మంత్రమునకు పూర్వమునను, ద్వేషమారణములకు మంత్ర మధ్యమునను, స్తంభనోచ్చాటనములకు మంత్రాంతమునను, మంత్రపల్లవములఁ జేర్చి జపించిన నభీష్టసిద్ధి యగు నందురు.

నమః భక్తికిని, స్వాహా మోక్షమునకును, హుం ఉచ్చాటనమునకును, ఫట్ మారణమునకును. వషట్ వశ్యమునకును, వౌషట్ అందఱికన్న మిన్నగనుండుటకును ఖేతస్వధ .... ములకును ఉపయోగింపవలెనందురు.

**మంత్రము** – మననముఁ జేయువానిని రక్షించునది. (మంతారం త్రాతయితి మంత్రః)

**మంత్రయోగము** – గురూపదిష్ట మంత్రములను విధిపూర్వకముగఁబంద్రెండేండ్లు జపించుట.

**మంత్రాంగములు** – ఋషి, ఛందము, దైవతము, శక్తి, బీజము, కీలకము, వినియోగము, అంగన్యాస కరన్యాస విధులు.

**మంత్రాధ్వము** – సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము, హృదయము, శిఖ, శిరస్సు, కవచము, నేత్రము, అస్త్రము అను నీ పదునొకండును, మంత్రాధ్వము లనంబడును. పరమశివుని ముఖము నందే సమస్తశాస్త్రములు, మంత్రములు కలిగెను. అందు ప్రధానము లగు సద్యోజాతాది మంత్ర పంచకమును, ఆ మంత్రములకు ముఖ్యములైన షడంగ దేవతామంత్రములును చేరి పదునొక్కటి యాయెను.

**యజుర్వేద జన్మస్థలము** – కురుక్షేత్రమని ప్రసిద్ధిగాంచిన కురురాజ్యమును, తత్ప్రదేశ పరిసరములును.

**యజుర్వేదము** – ఈ యజుర్వేదము కృష్ణమనియు శుక్లమనియుద్వివిధము. కృష్ణ యజుర్వేదమునకు తైత్తిరీయమని నామాంతరముఁ గలదు. ఈ తైత్తిరీయ వేదమునకు గూడ సంహిత, బ్రాహ్మణము,ఆరణ్యకము లనిమూఁడు భాగములు గలవు. ఈ సంహితయందు ఏడు అష్టకములు లేక కాండములును నలువది నాల్గు ప్రశ్నలు లేక ప్రపాఠకములును, అఱువందల యేఁబది యొక అనువాకములును, రెండువేల నూట తొంబదియారు పంచాశత్తులు లేక పనసలు గలవు. చతుర్వేదములలో నొకటి. (యజుర్వేదో ద్విజా ఏక, శతభేదేన భేదితః)

**యజుస్సులు** – అక్షర నియమములేక వాక్యరూపములుగా నుండు మంత్రములు.

**యజుర్వేదోపనిషత్తులు** – ఈ వేదమునందు గల యుపనిషత్తులు ఏఁబదియొకటి. అందు శుక్ల యజుర్వేదమున పందొమ్మిది.

1. అద్వయతారకోపనిషత్తు
2. అధ్యాత్మోపనిషత్తు
3 ఈశావాస్యోపనిషత్తు
4. జాబాల్యుపనిషత్తు
5. తారసారోపనిషత్తు
6. త్రిశిఖ బ్రాహ్మణోపనిషత్తు

7. తురీయాతీ తావధూతోపనిషత్తు
8. నిరాలంబోపనిషత్తు
9. పరమహంసోపనిషత్తు
10. పైంగలోపనిషత్తు
11. బృహదారణ్యోపనిషత్తు
12. భిక్షుకోపనిషత్తు
13. మండలబ్రాహ్మణోపనిషత్తు
14. మంత్రికోపనిషత్తు
15. ముక్తికోపనిషత్తు
16. యాజ్ఞవల్క్యోపనిషత్తు
17. శాట్యాయనీయోపనిషత్తు
18. సుబాలోపనిషత్తు
19. హంసోపనిషత్తు

కృష్ణయజుర్వేదోపనిషత్తులు

1. అక్ష్యుపనిషత్తు
2. అమృతబిందూపనిషత్తు
3. అమృతనాదోపనిషత్తు
4. అవధూతోపనిషత్తు
5. ఏకాక్షరోపనిషత్తు
6. కఠరుద్రోపనిషత్తు
7. కఠోపనిషత్తు
8. కలిసంతరణోపనిషత్తు
9. కాలాగ్న్యుపనిషత్తు
10. క్షురికోపనిషత్తు
11. కైవల్యోపనిషత్తు
12. గర్భోపనిషత్తు
13. తేజోబిందూపనిషత్తు
14. తైత్తిరీయోపనిషత్తు
15. దక్షిణామూర్త్యుపనిషత్తు
16. ధ్యానబిందూపనిషత్తు
17. నారాయణోపనిషత్తు
18. పంచబ్రాహ్మణోపనిషత్తు
19. ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు
20. బ్రహ్మోపనిషత్తు
20. బ్రహ్మవిద్యోపనిషత్తు
21. యోగకుండల్యుపనిషత్తు
22. యోగతత్త్వోపనిషత్తు
23. యోగశిఖోపనిషత్తు
24. రుద్రహృదయోపనిషత్తు
25. వరాహోపనిషత్తు
26. శారీరకోపనిషత్తు
27. శుకరహస్యోపనిషత్తు
28. శ్వేతాశ్వరోపనిషత్తు
39. సర్వసారోపనిషత్తు
30. స్కందోపనిషత్తు
31. సరస్వత్యుపనిషత్తు

**యజ్ఞము**— యూపస్తంభములేని యగ్నిహోత్రము.

**యతమాన సంజ్ఞుఁడు** — తాఁబేలు తన యవయవముల వలసినపుడు ముడుచుకొనునట్లు, స్వాధీనములైన యింద్రియములుగలవాఁడై, విషయ దూరుఁడైన మొదటి దశయుందుండు బ్రహ్మవిదుఁడని యెడు స్థిత ప్రజ్ఞుఁడు.

**యతి** — సన్న్యాసి జితేంద్రియుఁడు.

**యమపాశముద్ర**— రెండు బొటన వ్రేళ్ళను లంకెగావేయునట్టి గాయత్రీ ముద్ర.

**యమము**— అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, క్షమ, ధృతి ధైర్యము, దయ, అర్జవము, సమబుద్ధి, మితాహారము, శౌచములాది నాఁగలది.

**యమున**— పింగళానాడి. సూర్యనాడి. ఉత్తర భారతమునందలి యొక ప్రసిద్ధ మగునది.

**యామునేయులు**— వైష్ణవ మతమును స్వీకరించిన బ్రాహ్మణులు. శ్రీ వైష్ణవులు.

**యాయావరుఁడు** — యాజన, అధ్యాపన, ప్రతిగ్రహ విముఖుఁడై అయాచిత వృత్తిచే జీవించువాఁడు.

**యుక్తప్రత్యక్షము**— యోగసిద్ధిఁగలిగి యుండుట.

**యుగము**— ఐదు సంవత్సరముల కాలము (యుగంభవేద్వత్సరపంచకేన యుగానితు ద్వాదశ వర్షషష్ట్యా) 12 యుగములు ప్రభవాది 60 సంవత్సరములగు నా పరిమితికాలము. కృతాది యుగములు.

**యుంజానప్రత్యక్షము**— యోగాభ్యాసముఁజేయుచుండుట.

**యోక్త** — యోగశాస్త్రమును రచించిన కర్త. పాతంజలి మున్నగువారు.

**యోగచతురంగములు**— శ్రవణ, మనన, నిధి, ధ్యాసలు.

**యోగజప్రత్యక్షము**— ఋతంభరా ప్రజ్ఞ.

**యోగజప్రత్యక్షభేదములు** — యుక్త ప్రత్యక్షము, యుంజాన ప్రత్యక్షము, ఋతంభరాప్రజ్ఞ.

**యోగపట్టము**— యోగులు కూర్చునపుడు నడుము వంగకుండుటకై మోకాళ్ళకును నడుమునకును చేర్చి తగిలించుకొను వస్త్రపుపట్ట.

**యోగదండము**— లాతాము.

**యోగప్రతిబంధములు**— అతిభోజనము, అతినిద్ర, అతిశ్రమముఁగల పని, అతిభాషణ, జనసంగము, చంచలత్వము, నియమన వ్రతము.

**యోగబంధత్రియము**— మూలబంధము, ఉడ్యానబంధము, జాలంధర బంధము.

**యోగనిద్ర**— ఉన్మన్యవస్థ. సమాధి.

**యోగనిద్రాసనము**— కాళ్ళచేత కంఠమును బట్టుకొని, చేతులను వెనుక కట్టుకొని శయనించుట.

**యోగము**— చిత్తవృత్తి నిరోధము. ఉపాయము. ధ్యానము. కూడిక యుక్తి. (యోగశ్చిత్తవృత్తినిరోధకః) (యోగస్సన్నహనోపాయధ్యాన సంగతి యుక్తిషు) సమాధి.

**యోగవాగలు**— అంతరిక్షమునఁ బోయెడు సిద్ధపురుషులు ధరించు పావకోళ్ళు.

**యోగవిఘ్నములు** — అలస్యము, ధూర్తసంగము, మంత్రసాధనము, రసవాదము, రోగము, కర్మానర్హత, సందేహము అజాగ్రత, మత్తత, అతృప్తి, భ్రమ, సమాధికుదురక పోవుట. చిత్తస్థైర్యములేమి, దుఃఖము, వణఁకు, మున్నగునవి.

**యోగవిత్తములు**— యోగమును సాధించినవారు.

**యోగసిద్ధిప్రదములు**— ఉత్సాహము, సాహసము, ధైర్యము, తత్త్వజ్ఞానము, నిశ్చయము, జనసంగ పరిత్యాగము.

**యోగక్షేమములు**— పొందని వస్తువును పొందుట యోగము. పొందిన దానిని కాపాడుకొనుట క్షేమము.

**యోగాసనము**— హంసదండమును మోకాళ్ళ క్రిందనుంచుకొని పాదములను నేలపైనుంచి తొడలనడుమ మోచేతులంజొన్పి రెండుచేతులను దవడలయందుంచుకొని యుండుట.

**యోగిభేదములు** — (1) యోగాభ్యాసియగు ప్రవృత్తిమాత్ర జ్యోతిష్కుఁడు. (2) ఋతంభరా ప్రజ్ఞావంతుఁడు. (3) భూతేంద్రియ జయశీలుఁడు. (4) అతిక్రాంత భావనీయుఁడు. (5) మృదువులు, (6) మధ్యములు, (7) అధికులు.

**యోగోపనిషత్తులు** — నూటయెనిమిది ఉపనిషత్తులలోను హఠయోగము లేక అష్టాంగ యోగములద్వారా గమ్యస్థానమును జేరుటకు బోధించునవి ఇరువది యుపనిషత్తులు. వీనినే యోగోపనిషత్తులని పేర్కొనిరి.

1. అద్వయ తారకోపనిషత్తు.
2. అమృతనాదోపనిషత్తు.
3. అమృతబిందూపనిషత్తు
4. క్షురికోపనిషత్తు
5. తేజోబిందూపనిషత్తు
6. త్రిశిఖబ్రాహ్మణోపనిషత్తు
7. దర్శనోపనిషత్తు
8. ధ్యానబిందూపనిషత్తు
9. నాదబిందూపనిషత్తు
10. పాశుపతబ్రహ్మోపనిషత్తు
11. బ్రహ్మవిద్యోపనిషత్తు
12. మండలబ్రాహ్మణోపనిషత్తు
13. మహావాక్యోపనిషత్తు
14. యోగకుండల్యుపనిషత్తు
15. యోగచూడామణ్యుపనిషత్తు
16. యోగతత్త్వోపనిషత్తు
17. యోగశిఖోపనిషత్తు
18. వరాహోపనిషత్తు
19. శాండిల్యోపనిషత్తు
20. హంసోపనిషత్తు

**యోనిముద్ర**— ఒక చేతి చూపుడు వ్రేలిపై మఱియొకచేతినడిమి వ్రేలిని, రెండవ చూపుడువ్రేలిపై నాచేతిమధ్యవ్రేలినియుంచి అనామికలను చిటికెన వ్రేళ్ళను ముందుకుచాపి పట్టునట్టి శాక్త సంబంధమైన ముద్ర.

**రజ్జుసర్పభ్రాంతి**— త్రాటిని పాముగఁ దలఁచి యపోహపడుట.

**రజోగుణము**— రాగద్వేషములు.

**రమానాడులు**— ప్రాణోత్క్రమణ సమయమున దృశ్మన. ప్రాణముల నీనాడులందు సంయముచేసినయెడల స్వర్గాది పుణ్యలోక ప్రాప్తియగును. రమా పుణ్యేన పుణ్యంలోకం నయతి"

**రయి**— అన్నరూపమగు సోముఁడు.

**రసవాదము**— పాదరసమును చలనరాహిత్యముగఁజేసి సున్నముఁగావించుట, తాళకము, సర్వీరము, ఇంగిలీకము, గౌరిపాషాణములను ఇట్టి పారదము కలసియుండు రసవర్గములను సున్నముగావించునట్టి విద్య. సిద్ధపురుషులగువారు జరావ్యాధి మరణములనుండి విడువడి, కాయ సిద్ధిని బొంది, దృఢగాత్రులైయుండి, తాము కోరినన్నాళ్ళు ఆరోగ్యముగ జీవించుట

కును. తమకు కావలసిన సమస్తసాధన సంపత్తుల చేకూర్చు కొనుటకును, నీ రన వాదవిద్య నుపయోగింతురు. కాయసిద్ధినిఁబొందుటకై, ముప్పు అను మందును సిద్ధపరచి భుజింతురు. ముప్పు అనఁగ మూడుప్పుల కలయిక. (1) చవుటియుప్పు (2) సున్నపు రాళ్ళు (3) సముద్రపు సురుగు. ఈ వస్తువులచే ముప్పును చేయుదురు. ఈముప్పు నిర్దుష్టమగు నెడల సేవింపవచ్చును. లేనిచోఁ గూడదు.

కాయ కల్పమునకై చేయఁబడిన యీ మందును పరీక్షించుటకై ఒకేసేరు రాగినికరిగించి అందులో నావగింజ ప్రమాణము ఈ మందును వేసిన యెడల పదియారు వన్నెలబంగార మగునట అట్లు బంగారమగుటయే దీనికి పరీక్ష. కానిచో దానిని తినరాదు.

ఈవిషయమును సిద్ధవైద్య గ్రంథము లన్నిటియందును ముప్పుయోగమును ముందుగఁజెప్పి, పిమ్మట నే యౌషధ యోగములఁజెప్పుట సిద్ధసంప్రదాయము. ఏమందు నందైనను నీముప్పును కొంచెము కలిపినచో, మందులు శక్తివంతములై, సమస్త వ్యాధులఁ దీర్చునఁట. ఈ యోగసాధనకై యెందఱో ప్రయత్నించి సిద్ధినిఁ బడయక, తనకుగల సర్వస్వమును గోలుపోయి, భిక్షకులైపోయిరి, పోవుచున్నారు, పోఁబోయెదరు. ఈరసవాద విద్యనుగూర్చిన శాస్త్రములలో మొదటి నుండి చివరవరకు పరిభాషా పదములనే వాడియున్నారు. "వేదవాదులు కల్లలాడరు రసవాదులెన్నఁడు తెల్ల మాటరు" అని నుడివియున్నారు. అగస్త్యులు. వ్యాఘ్రపాదులు, మార్కండేయులు, ఊర్వశి, దధీచి, తిరువళ్ళువరు, రామలింగస్వామి, సనారి, విశ్వనాథ అవధూత, మున్నగువారు గ్రంథములరచించియున్నారు. వీరిలో చివరివారు రామలింగస్వామి. విశ్వనాథావధూతగారు. తెనుఁగు భాషలోని గ్రంథములకంటె అరవ భాషలో లెక్కకుమిక్కిలి సిద్ధగ్రంథము లున్నవి.

**రసాస్వాదనము—** యోగికి సమాధియందు విక్షేపమువలనఁగలిగిన దుఃఖనివృత్తిచే, నే యానందము కలుగుచున్నదో దానియనుభవము.

**రహస్యత్రియము —** (1) ప్రస్థాన త్రయము, తిరుమంత్రము, చరశ్లోకము. (2) మంత్రము, మంత్రార్థము, మంత్రరహస్యము.

**రాగక్లేశము -** అర్థములందధికాసక్తిఁ గలిగి యుండుట. పంచ క్లేశములలో నొకటి.

**రాఘవుఁడు—** తనను నమ్మినవారి పాపముల నాశముఁజేయువాఁడు, (అఘం = పాపం. రాతి = నాశయతీతిరాఘః రాఘం తత్కృత్యవ్యహరతీతిరాఘవః)

**రాజయోగము—** అష్టాంగయోగ సాధనలచేఁగ్రమముగఁ బొందఁగల్గినది. పెక్కండ్రు రాజులచే ననుష్ఠింపఁబడినదియు, ఋషులకంటెను రాజులే ముందుగఁదెలిసికొని యనుష్ఠించినదియునైన యోగముయొక్క గమ్య

(రుక్-సాంసారికదుఃఖం. ద్రావయతి = నాశయతి, ఇతిరుద్రః)

**రేచకము**— ఉచ్ఛ్వాసము, ఊపిరిని వెలికి విడుచుట.

**రం** — అగ్నిబీజము.

**రంగత్రియము** — దక్షిణ భారతదేశమునయున్న కావేరీనది ప్రారంభము నుండి కడలిలోఁగలియువరకు, దాని తీరమున నుండు శ్రీ రంగనాథులను పేర్లతో వెలయుచుండు, విష్ణు క్షేత్రములగు మైసూరు రాజ్యమందలి శ్రీ రంగపట్టణము, తమిళదేశమగు తిరుచ్చిరాపల్లిపద్దనుండు శ్రీ రంగము, తంజావూరి మండలమున నున్న తిరువెళ్ళందూరు, (తృతీయ రంగము) అను క్షేత్రములు.

**లఘిమసిద్ధి** — తానైనను,వలసినవస్తువునైనను, భారముఁగలవానినికోరినంతనే తేలికగా నొనర్చఁగల యణిమాది సిద్ధులలో నొకటియగు తపః. శక్తి.

**లయము**— శబ్దాది విషయములను, ధ్యానింపఁబడు వస్తు స్వరూపవిషయములను, మఱచియుండుట.

**లక్షణావృత్తి గ్రహణము**—మాయాऽవిద్యలచే నేర్పడిన ఈశ్వర, జీవేశ్వర, భేదములనువిడిచి, అధిష్ఠానమగు చైతన్యమును మాత్రము గ్రహించుట. సామాన్యముగ పదార్థములచేఁ దాత్పర్యముఁగానప్పుడు, తాత్పర్యానుకూలముగ నాపదముల నుండియే దానికిసంబంధించిన మఱియొక యర్థమును గ్రహించుట.

**లక్షణావృత్తిత్రయము** — జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణలు.

**లక్ష్యార్థము**— వివేకముచే నూహింపఁదగిన వస్తువు.

**లాతాము**— శ్వాసను కుడినుండి ఎడమముక్కునకు, ఎడమనుండి కుడిముక్కునకు మార్చుకొనుటకై చంకలయందూనుకొనెడి హంసదండము. హంసయనఁగ శ్వాసకుపేరు.

**లోకకలలు**— ప్రకృతిమయములగు పదునైదు కళలు.

**లోకములు**— (1) సుకృత, దుష్కృత, ఫలముల ననుభవించునట్టి జన్మలు, (2) భూలోక, భువర్లోక, స్వర్లోక. మహాలోక, జనలోక, తపోలోక, సత్యలోకములను సప్తోర్ధ్వలోకములు.

**లోపాముద్ర**— చిన్ముద్ర. బొటనవ్రేలిని చూపుడువ్రేలిని సంయోగ పరచిన చిన్ముద్ర, జ్ఞానముద్ర, తర్కముద్ర, లోపాముద్ర, యను పేర్లతో నొప్పును. అగస్త్య ఋషియొక్క భార్య.

**లోభము**—అప్రాప్తవస్తువు లభింప వలయునను వాంఛ. ప్రాప్తవస్తువు నితరులకుఁజెందఁగూడదను పిసిని గొట్టుతనము.

**లోలాసనము**— పద్మాసనస్థుఁడై చేతుల నూని యుండుట.

**లంబికాయోగము**— లంబిక యనఁబడు చిఱునాలుకకుపైనున్న కపాలకుహరమున నాలుకను జొన్పించునట్టి ఖేచరీముద్ర. ఖేచరీముద్రను చూడుడు.

**లింగదేహము**— సూక్ష్మశరీరము. జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియపంచకము, ప్రాణాదివాయు పంచకము, మనస్సు, అహంకారములు. ఈ పదునేడింద్రియముల కలయిక.

**లింగభంగము**— అరూప మనోనాశము.

**లింగమాత్ర**— బుద్ధితత్త్వము.

**లింగము** - ప్రణవము. ఎప్పటికిని లయమొందనిది. సర్వకారణమైన పరిపూర్ణ పరబ్రహ్మము. ఆత్మ. శివలింగము. గురుతు. జంగిలికము. ఇత్యాదులు. భూమి పీఠముగను, చతుర్వేదములు ఆలయముగను, గలిగినచిదాకాశ పరబ్రహ్మమే లింగశబ్దార్థము. సర్వము లయించు స్థానము. (ఆకాశం లింగమిత్యాహుః పృథివీతస్య పీఠికా, ఆలయస్సర్వ వేదానాం లయనాల్లింగముచ్యతే)

**లింగముద్ర** - అఱచేతితో గుప్పెడి నిలువుగానుంచి, బొటనవ్రేలును నిలువఁబెట్టి శివలింగాకారముగ నుంచు శాక్త సంబంధముద్ర.

**లింగశరీరము** - సూక్ష్మశరీరము.

**లింగసన్న్యాసము** - దండకమండలువులుంచుకొనునట్టి సన్న్యాసము.

**లింగి** - ఊహించిన వస్తువు. కపట సన్న్యాసి.

**వజ్రదండము** - వెన్నెముక.

**వజ్రాసనము** - సిద్ధాసన భేదము.

**వజ్రోలి** - లింగద్వారముచే జలము మొదలగు వానిని లోనికి గ్రహించి విడుచు హఠయోగ పద్ధతి. యోగియైన వాఁడు, అనుకూలవతియగు స్త్రీతో రమించి, తన వీర్యమును స్ఖలితము కానీయక, స్త్రీయొక్క శోణితమును శిశ్నము ద్వారాలోనికి పిల్చుకొనుట.

**వరణము** - అంతర్ముఖుఁడైన పరమాత్మ స్వరూపమే తానేయని యభేదానుసంధానము చేయుట.

**వరుణుఁడు** - రాత్ర్యభిమాన దేవత. ఈ వేళమొదలు నీవేళవరకు రాత్రి యని కాలమును నిర్ణయించిన ప్రథముఁడు.

**వర్తమానప్రతిబంధములు**— విషయాసక్తి, ప్రజ్ఞామాంద్యము, కుతర్కము, విపర్యయము, దురాగ్రహము, మున్నగు లక్షణములు. జ్ఞాన ప్రతిబంధములలో నొకటి.

**వరహావతారము** - భూ సముద్ధరణ కొరకు కాశ్మీరదేశముననున్న బారామూలాయను వరాహపురమున చైత్ర బహుళత్రయోదశి నాడు విష్ణుమూర్తి ధరించిన సూకరరూపము.

**వరాహకల్పము** - బ్రహ్మయొక్క ఆయుః ప్రమాణమున నుత్తరార్ధము.

**వరాహముద్ర** - చేతిపై చేయినుంచి క్రిందికి చిటికెనవ్రేళ్ళు బొటనవ్రేళ్ళు నాలుగుపాదములుగను, మధ్యవ్రేళ్ళు మూతిగను; చూపుడువ్రేళ్ళు వంచి ముందుచాపి కోఱలుగను, చూపునట్టి గాయత్రీముద్ర.

వర్ణాధ్వము - అకారము మొదలు హకారము వరకును గల యేబది యక్షరములు.

వల్లర్యాసనము - సమముగాఁబద్మాసనస్థుఁడై యుండి, పాదములను తొడలందుఁజేర్చి, వానిపై మోచేతులనుంచి రెండు చేతులను గ్రుచ్చి శిరముమీఁద నుంచి గడ్డమును ఱొమ్మునైనుంచి, వాయువును నిరోధించి ఏకాగ్రచిత్తుఁడై యుండుట.

వశిత్వము - సకలభూత భౌతికముల స్వాధీనమొనర్చుకొనఁగల తపశ్శక్తి.

వశీకరణసంజ్ఞ - పూర్ణపరిపక్వమైనట్టి నాల్గవదశయందుండు స్థితప్రజ్ఞత్వము. బ్రహ్మ విద్వరిష్ఠత్వము.

వషట్కృతము - అగ్నియందు వేల్చఁబడిన హవిస్సు.

వసువు - అంతటను నివసించువాఁడు.

వస్తుకృతపరిచ్ఛేదము - ఒక పదార్థమునసుండి మఱియొక పదార్థమున లేకుండుట.

వస్త్రధౌతి - హఠయోగు లభ్యసించు ధౌతికర్మలలో నొకటి. నాలుగంగుళముల వెడల్పును ఎనిమిది లేక పదునారుమూరల పొడవునుగల సన్నని వస్త్రమును దీసికొని, గోరువెచ్చని నీటిలోఁదడిపి, గురువుచే నుపదేశింపఁబడినమేరకు కొంచెము కొంచెముగ మ్రింగుచు, పూర్తిగ మ్రింగఁగలుగు వరకు దినమునకు మూఁడు మూరలు హెచ్చింపుచు, నామ్రింగినదానిని నౌలికర్మచేసి కడుపునందుండు గుడ్డను చక్కగ జాడించి మెల్లమెల్లగ బయటకులాగుపద్ధతి. బట్టనుమ్రింగునపుడు బట్ట కొసను పండ్లతోఁగరచుకొని యుంచవలయును. లేనిచో లోపలి బట్టను బయటికిఁదీయజాలము. ధౌతి కర్మలఁజూడుడు.

వాక్యచతుష్టయము - ప్రజ్ఞానం బ్రహ్మ యను అభ్యానవాక్యము. అహంబ్రహ్మాస్మి యను అనుభూతివాక్యము, తత్త్వమసియను ఉపదేశవాక్యము, అయమాత్మాబ్రహ్మ యను సమ్మత వాక్యము.

వాఙ్మౌనము - పరమాత్మయందే జ్ఞప్తిఁగలిగి లౌకికములగు మాటలాడకుండుట.

వాచకగురువు - విషయములందు విరక్తినిఁగలిగించునాత్మానురాగ ప్రదుడు. అష్టవిధ గురువులలో నొకఁడు.

వాచంయమి - మౌనవ్రతుఁడు.

వాచారంభణము - వాక్కుచేఁజెప్పఁబడుటకు మాత్రమే వీలైన స్థితి. నామమాత్రము.

వాచికతపస్సు - స్వాధ్యాయము, సత్య ప్రియము, హితము, మృదు భాషణలు.

వాచికస్వాధ్యాయము - అన్యులకు వినఁబడునట్లు పఠించుట.

వాచ్చాంబిళ్ళలు - వైష్ణవ మతమును స్వీకరించిన బోయ, మంగల, గొల్ల, కుమ్మర, మున్నగు కులములవారు.

వాచ్యార్థ లక్ష్యార్థములు - వాచ్యార్థములింద్రియ గోచరములగు వేర్వేరు

పదార్థములుగ నుండుటచే, నొకటితో నొకటికైక్యము గలుగుట యసంభవము. లక్ష్యార్థములు వివేకముచే నూహింపఁబడునవి కావున, జీవాత్మ పరమాత్మలు వేర్వేరుగనున్నను, ఒకే పదార్థ సంబంధములగుట వలనఁ గడకు నైక్యము పొనఁగును.

**వాదము**— రాగద్వేషరహితులై భక్తిశ్రద్ధలతోఁదెలియని దానిని సావధానముగ నుభయులును మాటలాడి తెలిసికొనుట.

**వానప్రస్థులు**— తృతీయాశ్రమస్థులగు వైఖానస, ఉదుంబర, వాలఖిల్య, ఫేనపులనువారు. వీరిలో భార్యతోడ నుండువారు సదారులు. భార్యలేని వారు అదారులు.

**వామనావతారము** — బలిరాజ్యమును ఇంద్రునకొసఁగుటకై బీహారు రాష్ట్రమున బక్సారులోనిదగు మహాసిద్ధాశ్రమమున భాద్రపద శుద్ధ ద్వాదశీ శ్రవణ నక్షత్రములందు దేవమాతయగు అదితికి జన్మించిన విష్ణ్వవతారము.

**వాయుబీజము**— యం అను నక్షరము.

**వాయువ్యస్నానము**— (1) గోధూళిని శరీరమునకు సోకింపఁజేయుట. (2) పశువుల కొట్టమునందలి మట్టిని యొడలికిఁబూసికొనుట.

**వాయువు**— శబ్ద, స్పర్శ, లను రెండు గుణములుగల్గి మహత్పంచ భూతములలో నొకటియగు గాలి.

**వారుణస్నానము**— నీటియందుమునిగి స్నానముఁజేయుట.

**వార్తాకుఁడు**— కృషిగోరక్షణాదికములఁ జేసికొనుచు, వైశ్యాది వృత్తిచే జీవించుచు, నిత్యనైమిత్తికాది క్రియాపరుఁడగు గృహస్థుఁడు.

**వార్తికము**— మూలగ్రంథముచేఁజెప్పఁబడిన యర్థమును, చెప్పఁబడని యర్థమును, అధ్యాహారముఁజేయఁ (ఊహింపఁ) బడినయర్థమును, స్థూలదృష్టిచే వ్యత్యస్తముగఁగనఁబడు నర్థములఁబోలినవానిని, దీర్ఘముగ విచారించి నిజార్థమును దెలుపు శ్లోకబద్ధమగు వ్యాఖ్యానము.

**వాలఖిల్యులు**— జటావల్కల ధారులై, ఎనిమిది మాసములార్జించి, దానినిఁ దక్కిన నాల్గుమాసములవఱకును భుజింపుచు, మిగిలినదానిని కార్తీకమాసమునఁబరిత్యజించు వానప్రస్థులు.

**వాసన**— పూర్వసంస్కారము.

**వాసనాత్రియము**— లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసనలు.

**వాసనానందము**— అష్టవిధానందములలో నొకటి. నిద్రఁగడచిన తోడనే వృత్తి తోచుట.

**వాసుకి**— సర్పవిశేషము. దీనితోకయందు త్వలచిహ్నముండును.

**వాసుదేవుఁడు**— పరబ్రహ్మము. పాంచరాత్రశాఖకుఁజేరినవారు పరబ్రహ్మమునకు వాసుదేవుఁడనియు, జీవునకు

సంకర్షణుఁడనియు, మనస్సునకు ప్రద్యుమ్నుఁడనియు, అహంకారమునకు అనిరుద్ధుఁడనియు, సంకేతనామములవాడుదురు.

**వ్యాఖ్యానము** — పదచ్ఛేద పదార్థోక్తి, ర్విగ్రహూవాక్య యోజనా। ఆక్షేపస్య, సమాధానం। వ్యాఖ్యానం। పంచ లక్షణం.

**వ్యాపకమంత్రత్రియము**— రామానుజ వైష్ణవీయమగు నారాయణ, వాసుదేవ, విష్ణు అనునవి.

**వ్యానవాయువు** — శరీరమాద్యంతము వ్యాపించియుండు వాయువు.

**వ్యావహారికుఁడు**— ఓంకారముయొక్క ప్రథమపాదమగు జాగ్రదవస్థలోనుండు విశ్వుఁడనఁబడు జీవుడు.

**వ్యాసకాంజలికముద్ర**- రెండుచేతులు దోసిలిగాఁబట్టుకొని తన హృదయము వైపునకుఁద్రిప్పుచు ముందుకుఁజూపునట్టి గాయత్రిముద్ర.

**వ్యాసులు**— ప్రతి మహాయుగమందును శ్రీ మహావిష్ణువు వేదవ్యాస రూపమున నవతరించి వేదమును లోకమున వ్యాపింపఁజేయును. ప్రస్తుత వైవస్వత మన్వంతరమున 27 మహాయుగములుగడచి 28 వ మహాయుగమున కలియుగము జరుగుచున్నది. కృత, త్రేత, ద్వాపర, కలియుగములు నాలుగును కలసి మహాయుగమగును. ఈ మహాయుగములం దవతరించిన వ్యాసులు:

1. స్వాయంభువుఁడు
2. ప్రజాపతి
3. ఉశనుఁడు
4. బృహస్పతి.
5. సవిత
6. మృత్యువు
7. ఇంద్రుఁడు
8. వసిష్ఠుఁడు
9. సారస్వతుఁడు
10. త్రిధాముఁడు
11. త్రివృషుఁడు
12. భరద్వాజుఁడు
13. అంతరిక్షుఁడు
14. ధర్ముఁడు
15. త్రయ్యారుణి
16. ధనంజయుఁడు
17. కృతంజయుఁడు
18. సంజయుఁడు
19. భరద్వాజుఁడు
20. గౌతముఁడు
21. ఉత్తముఁడు (హర్యాత్ముఁడు)
22. వేనుఁడు (వాజశ్రవుఁడు)
23. సోమశుష్మాయణుఁడు (తృణబిందువు)
24. ఋక్షుఁడు (వాల్మీకి)
25. శక్తి
26. పరాశరుఁడు
27. జాతూకర్ణియనువారు గతించిరి. చివరిది యగు
28. వ మహా యుగమునకు వ్యాసుఁడు కృష్ణద్వైపాయనుఁడు రాబోవు
29. వ మహాయుగమునకు అశ్వత్థామ వ్యాసుఁడగునఁట. దిజ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతము.

**వ్రాత్యుఁడు**— సంస్కారహీనుఁడు.

**వికల్పవృత్తి**— శబ్దమునకు విషయ యుండు వస్తువు ప్రస్తుతము లేకున్నను, ఉన్నదని గ్రహించుట. ఉదా: దేవదత్తుని కంబళియనుటలో దేవదత్తుఁడచట లేకున్నను, కంబళినిఁ జూచుటతోడనే దాని యొడయుఁడగు దేవదత్తుని జ్ఞాపకము కలుగుట.

**వికార్యము**- పాలుపెరుగుగ మారినట్లు ఒకపదార్థమే మరియొక విధముగ మారుటచే జనించినది.

**వికృతి**— ప్రకృతి కార్యమగు ప్రపంచము.

**విఘసాశనుఁడు**— దేవతలకును, అతిథులకును పెట్టి భుజించువాఁడు.

**విచారణ**— జ్ఞాన శాస్త్రపరిజ్ఞానంబును, సంత్సంగంబును, వైరాగ్యంబును, గల్గి బ్రహ్మమెయ్యదియని విచారించుట.

**విజాతీయము**— తన జాతి కానిది.

**విజ్ఞానమయకోశము** — బుద్ధి, జ్ఞాన పంచతన్మాత్రలు కలయిక. అన్న, ప్రాణ, మనోమయ కోశములతోఁ గూడిన యంతఃకరణమునందు వాని యందుఁగల విశేషముఁగూర్చి ధ్యాన మననాది వృత్తులు గల్గుట.

**విజ్ఞానము**- అనుభవజ్ఞానము. నిశ్చయ రూపిణియగు బుద్ధి. కీలాపరిజ్ఞానము.

**వితతముద్ర**— రెండుచేతులను విప్పి యుంచునట్టి గాయత్రీముద్ర.

**వితండవాదము**— తన సిద్ధాంతమును తెలుపకయు, స్థాపింపకయు, కుతర్క యుక్తులచే నెదుటివాని మాటలను వినకనే యవమానపరచి నిందించుట.

**విదేహముక్తి** — ప్రారబ్ధకర్మాప సానమందు ఆ దేహము పోయి తానే బ్రహ్మమై యుండుట.

**విదేహులు** - సానంద సమాధియం దుండువారు.

**విద్యానందము**- తత్త్వమస్యాది వాక్యార్థ విచారణ జనితాపరోక్షజ్ఞానము. అష్ట విధానందములలో నొకటి.

**విద్యాంగములు**- ప్రస్థానములు.

వివరణ:— మధుసూధన కృత ప్రస్థాన భేదవివరణము నందును, అగ్ని పురాణారంభమందును, తెలుపఁబడిన రీతిగ వైఖరీవాణీ రూపమైన విద్యా భేదములు పదునెనిమిదింటిని ప్రస్థానములందురు. అవి వేదములు 4, ఉపవేదములు 4, వేదాంగములు 6, పురాణము 1, న్యాయము 1, మీమాంస 1, ధర్మశాస్త్రము 1 అగును. ఋగ్వేదమున 21 శాఖలును యజుస్సున 109 శాఖలును సామమున 1000 శాఖలును. అధర్వణమున 50 శాఖలును మొత్తము 1180 శాఖలు అగును. ప్రతిశాఖాంతమున నొక యుపనిషత్తుండును. వీనిలో 840 ఉపనిషత్తులు కర్మను బోధించునవి గాన కర్మఖాండ యనియు, 232 ఉపనిషత్తులు ధ్యేయమును బోధించునవి కావున

ముపాసనాకాండయనియు, 108 ఉపనిషత్తులు బ్రహ్మస్వరూపమును బోధించునవి గావున జ్ఞానకాండయనియుఁజెప్పుదురు. ఉపనిషద్వివరణ ముక్తికోపనిషత్తు నందు గలదు. ప్రయాణము, పద్ధతి, మరణములకు గూడ ప్రస్థానమను పేరుగలదు.

**విదృతి** - ఆనందమయ ద్వారము గు బ్రహ్మబిలము. మూడు పట్టు అనఁబడు ఉచ్చి శరీరమున మొదట జీవుఁడు ప్రవేశించినపుడు చిల్చఁబడియా ద్వారమున ప్రవేశించెనుగాన విదృతి యనఁబడెను.

**విద్వత్సన్న్యాసము** — సద్గురు సన్నిధానమున భక్తితో విచారముఁజేసి, యాత్మతత్త్వజ్ఞానములవడిన పిదప స్వీకరింపఁబడు తురీయాశ్రమము.

**విద్వాంసులు**- ఆత్మతత్త్వము నెఱిఁగిన పండితులు.

**విధారణము**- లోపలి యూపిరిని వెలికి ప్రసరింప నీయకఁ బట్టియుంచు నట్టి కుంభకము.

**విధిరూపసమాధి** — మీఁదు, క్రిందు, మధ్యనిలచియున్న సర్వపరిపూర్ణ బ్రహ్మానంద దశ.

**వినాయకుఁడు**— దుష్టులను, విఘ్నములను, నశింపఁజేయువాఁడు. తనకు వేరొక ప్రభువులేక తనకు తానే ప్రభువైనవాఁడు.

**విపరీతకరణి** — కపాలాసనము లేక సర్వాంగాసనము.

**విపరీతభావన** — ఒకవస్తువు నందలి నైజమును వేరొక విధముగఁదలఁచు వ్యతిరేక భావన.

**విపరీతము**— రాత్రి, వ్యత్యస్తము, (పరితంతు దివాప్రోక్త విపరీతంతు శర్వరి రాకా మధ్యగత చ్చంద్ర సూర్యరిత్యభిధీయతే) పగటికి పరీతమనియును, రాత్రికి విపరీతమనియును, పూర్ణిమ చంద్రుఁడు నడినెత్తికి పైగ వచ్చినపుడు సూర్యుఁడనియును సంకేత నామములు గలవు.

**విపర్యయవృత్తి**— మిథ్యాజ్ఞానము. విపరీత గ్రహణము.

విపల — మూఁడున్నర మాత్రలకాలము.

విపశ్చితులు — ఆత్మతత్త్వము నెఱిఁగిన పండితులు.

విలక్షణము — విరుద్ధ స్వభావముఁగలది

విరక్తిత్రయము - ఐహిక, ఆముష్మిక మిశ్రమ విరక్తులు.

విరజము — మలిన రహితము. సుషుమ్నానాడి (సుషుమ్నాతు పరేలీనా విరజా బ్రహ్మరూపిణి)

**విరజస్తముఁడు**— రజస్తమముల వదలిన సత్త్వగుణి.

**విరాట్టు** — పంచీకరణముఁజేయఁబడిన పంచభూతకార్యములయొక్క సమిష్టి స్థూలశరీరోపాధిఁగల పరమాత్మ.

**విరాట్ప్రణవము** — అ, ఉ, మ, అర్ధమాత్ర, నాదము, బిందువు, కల, కలాతీతము, శాంతి, శాంత్యతీతము ఉన్మని. మనోన్మని, పురి, మధ్యమ,

పశ్యంతి, పరా యను పదియారు మాత్రలు గల ప్రణవము.

**విరాట్పురుషుఁడు** – సమష్టి స్థూలభూత సూక్ష్మశరీరములతోఁగూడిన పరమాత్మ.

**వివర్తనము** – త్రాడు పాముగఁగనఁబడునట్లు (తన రూపమును మార్పు లేకనే వేరురూపముగఁదోచుట)

**వివిక్తము** – ఏకాంతము.

**వివిదిషా సన్న్యాసము** – కేవలము జ్ఞానసముపార్జనేచ్ఛచేఁ జేకొనుసన్న్యాసము.

**వివేకపంచకము** – దృగ్దృశ్యవివేకము, పంచకోశ వివేకము, పంచభూత వివేకము, నామరూప వివేకము, తత్త్వ వివేకము.

**వివేకము** – ప్రకృతి వేరు పురుషుఁడు వేరని యెఱుంగుట.

**విశయము** – సంశయము.

**విశిష్టలింగము** – పంచమహా భూతములు.

**విశుద్ధచక్రము** – షడాధారములఁ జూడుడు.

**విశేషము** – ప్రపంచము.

**విశ్వరూపుఁడు** – సకలప్రపంచములే యాత్మగఁగలవాఁడు.

**విశ్వుఁడు** – జాగ్రదవస్థయందు కుడికంటియందుండి స్థూలప్రపంచము ననుభవించు జీవుడు.

**విషములు** – జీవుల చంపు వస్తువులు. వత్సనాభము, హారిద్రము, సౌతికము, ప్రదీపనము, సౌరాష్ట్రికము, శంఖకము, కాలకూటము, హాలాహలము, బ్రహ్మపుత్రము అను నీ తొమ్మిదిని విషములగును. వివరములు (1) వత్సనాభము. (వసనాభి) అనునది, వావిలయాకుల వంటి యాకులుగల వృక్షములందు జనించును. దీనిగాలి సోకినమాత్రమున జ్వరము కలుగును.

(2) సౌతికము - దీనిని దారద మందురు. దరదదేశమందు పుట్టును.

(3) హారిద్రము - పసుపు కొమ్ముల వలెనుండు వేరులు.

(4) ప్రదీపనము - అంజనాద్రియందు జనించును. ఇయ్యది నిప్పు వలె నెఱ్ఱని ప్రకాశము గల్గి దర్శన మాత్రము చేతనే దహించు స్వభావము గల్గియుండును.

(5) సౌరాష్ట్రికము - సురాష్ట్ర దేశమందు పుట్టును.

(6) శంఖకము - శుక్లదేశమునందు పుట్టి శంఖమువంటి కాంతిఁగల్గి యుండును. దీనిని శాక్తిక మనియుఁ జెప్పుదురు.

(7) కాలకూటము- మలయ, కొంకణ పర్వతము లందును, శృంగిబేరము మున్నగు పట్టణములందును, జనించును.

(8) హాలాహలము – తాటిచెట్టువలె నున్నతమై నల్లనగు ద్రాక్షపండ్లగుత్తుల

పంటి గెలలతోఁగూడిన వృక్షమున జనించును.

(9) బ్రహ్మపుత్రము - మలయ పర్వతమున కపిల వర్ణము తోఁగూడి జనించును.

**విషయానందము**— స్రక్చందనాభరణ వసనవనితాది భోగములచేఁగలిగిన సంతసము (స్రక్ = పూలమాల)

**విషువత్పుణ్యకాలము** — దివారాత్రములు సమముగ నుండు మేష సంక్రాంతి, తులాసంక్రాంతి దినములు. అనగ సూర్యుఁడీరాసులందు ప్రవేశించు సమయములు.

**విష్ణువు**— అంతర్బాహ్యములందు వ్యాపించియుండువాఁడు. (విశ్వంవేష్టి వ్యాప్నోతీతి విష్ణుః)

**విష్ణుకలాదశకము**— జర, పాలిని, శాంతి, ఈశ్వరి, రతి, కామిత, వరద, హ్లాదిని, ప్రీతి, దీర్ఘ అనునవి.

**విసంవాదాభావము**— లోకమునందితరులతో వివాదము లేకపోవుట. లేనిదానిని కల్పించి వాదించుట.

**విసంవాదిభ్రమ**— భ్రమజ్ఞానము. వ్యర్థమగు భ్రమ. దీపప్రభనుజూచి రత్నమని తలంచునట్టిది.

**విస్తృతముద్ర** — రెండు చేతులను బాగుగ విస్తరింపఁజేయు గాయత్రీ ముద్ర.

**విహంగమార్గము** — పక్షిగ్రుడ్లు పెట్టి వానిపైఁగూర్చుండి పొదిగి పిల్లలఁజేసి కాపాడినట్లు గురుఁడే శిష్యునియందు బాధ్యతవహించి బోధించి జ్ఞానిగా నొనర్చు పద్ధతి.

**విహితగురువు** — సకల సంశయములనివారించి నిత్యముక్తిని ఘటింపఁజేయువాఁడు.

**విక్షిప్తత**— చిత్త భేదములఁజూడుము.

**విక్షిప్తము** — సత్త్వగుణాధిక్యమై భోగసాధనలఁబ్రవర్తించు చిత్తపరిణామభేదము.

**విక్షేపము**— ముత్యపు చిప్పను భ్రమచే వెండిగాఁదలఁచినట్లు, స్వభావ చైతన్యుఁడగు తనను, కల్పితుఁడగు నహంకారిగాఁజూచుట. బహిర్దృష్టి.

**వీణాదండము**- వెన్నెముక, బ్రహ్మాండి, మేరువ, ఏకస్థూణములని పర్యాయనామములు గలవు.

**వీరాచారము**— వంగదేశమునఁగల వైష్ణవులలో నధములైనవారు సారాయముతోను, స్త్రీలతోను సంబంధము గల తాంత్రిక సాధనానుష్ఠాన పద్ధతి.

**వీరాసనము**— కుడిపాదమును ఎడమ తొడమీఁదను, ఎడమపాదమును కుడి తొడక్రిందనుజేర్చి కూర్చుండుట. దీనికి అర్ధాసనము, అర్ధశవాసనము, పర్యంకాసనములని పర్యాయ నామములు గలవు.

**వృత్తి**— దశ, బుద్ధి, పని, (శబ్దమునకు అర్థముతోఁగల సంబంధము.)

**వృత్తిత్రయము**— శాంత, ఘోర, మూఢ వృత్తులు.

**వృద్ధుఁడు** — డెబ్బది సంవత్సరముల వయస్సు కలిగిన వాఁడు, జ్ఞాని.

**వృశ్చికాసనము** — రెండు చేతులను భూమియందూని రెండుమోచేతులను ప్రక్కలందుజేర్చి, గడ్డమును క్రిందుగ నుంచి తేలుకొండెవలె రెండుపాదములను శిరస్సునందుంచి యుండుట.

**వృషభుఁడు**— ధర్మప్రకాశుఁడు.

**వృక్షము**— ఛేదింపఁబడునది. మ్రాను.

**వృక్షాసనము** — కపాలాసనము.

**వేదకగురువు**— తత్త్వమును పరీక్షింపఁ జేయువాఁడు.

**వేదదీక్ష**— వేదాంత శాస్త్ర సమ్మతముగ శివు చైతన్య మాత్రుఁడవే నని దృఢముగ బోధించుట.

**వేదనము**— జ్ఞానము.

**వేదములు** — ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణ వేదములు. ఇవి కర్మ, ఉపాసన, జ్ఞానములని మూఁడు కాండలుగ నున్నవి. అందు కర్మకాండ ఇహపర సౌఖ్యోపలబ్ధికై యాచరింప వలసిన పద్ధతులను, ఉపాసనాకాండము సగుణ బ్రహ్మోపాసన విధులను, జ్ఞానకాండము నిర్గుణ బ్రహ్మస్వరూపమును బోధించును. ఈ జ్ఞానకాండమును ఉపనిషత్తులనియు, వేదాంతమనియు జెప్పుదురు, (ఋ.వే. 21, య.వే. 109, సా.వే. 1000, అ.వే. 50=1180 శాఖలుగ వేదవ్యాసుల వారు విభజించిరి.)

**వేద్యత్వము** - జ్ఞాన విషయ భూత తత్త్వముఁదెలియఁబడెడు స్వభావము.

**వేదాంగములు** - పాణిని రచించిన శిక్ష, పాణిని రచించిన వ్యాకరణము, పింగలముని రచించిన ఛందస్సు, యాస్కముని రచించిన నిరుక్తము, ఆదిత్యాదులు రచించిన జ్యోతిషము, అపస్తంబ సూత్రాదికర్తలు రచించిన కల్పము.

**వేదాంతవాదిమతములు**- భాస్కరీయ, శబ్దబ్రహ్మవాద, క్రీడా బ్రహ్మవాద, ద్వైత, శుద్ధాద్వైత, విశిష్టాద్వైతములను షట్సిద్ధాంత మతములు.

**వేదాంతము**- వేదములందలి చివరి భాగములగు జ్ఞానకాండమనఁబడు ఉపనిషత్తులు.

**వైకుంఠచతుష్టయము** - వాసుదేవ, సంకర్షణ ప్రద్యుమ్న, అనిరుద్ధములను చతుర్వ్యూహములు. (వాసుదేవుఁడును జూడుడు)

**వైకుంఠము** - రైవతమను కాలమున శుభ్రుఁడను వానికి వికుంఠయను నామెయందు జనించిన వైకుంఠుఁడను బదరికాశ్రమస్థ విష్ణు పీఠాధిపతి తనపేరుతో నిర్మింపఁజేసిన పట్టణము. పరమపదము,

**వైఖరీవాక్కు**- బ్రహ్మ ప్రణవమందలి అకార విద్యారూపమైన యేఁబది యక్షరములచేత తానుపలికెడు సమస్త శబ్దములును, శబ్దార్థములనుతెలియునట్లు జేయు బహిర్ముఖమగు వృత్తి.

వైఖానసుఁడు - గ్రామములకు వెలుపల నున్నని భూమియందు పండిన ధాన్యములతో నగ్ని హోత్రాదులఁ జేయుచుండు వానప్రస్థుఁడు.

వైతథ్యము - అసత్యము.

వైతరణీనది- నరకలోకమందలి నిప్పు యేరు. మఱియు. (1) ఉత్కల దేశమున జాజిపూర్ అనఁబడు యజ్ఞపురము ప్రక్కన ప్రవహించునది. (2) నాసికకు సమీపమున బ్రవహించు నది. (3) కురుక్షేత్రమందు ప్రవహించు నది. (4) హిమాచలమున బదరీనుండి కేదారమునకేగు మార్గమున గోపీనాథాలయము ప్రక్కన ప్రవహించు నది.

వైద్యుతము - ఓంకారము. ఆకాశమందున్న యగ్ని. (అంతరిక్ష గతో వహ్నిః వైద్యుతస్స్వాంత రాత్మకః,

వైనాదికులు - బౌద్ధులు.

వైభాషికమతము - బౌద్ధమత శాఖా భేదము.

వైష్ణవమాయ- సాత్వకి, రాజసి, తామసి, యను త్రివిధ మాయలందు సాత్వకియను మాయ కర్పూరము వలె తెల్లనివర్ణముగల రుద్రునియందును, దేవతలయందును నుండును. రాజసీమాయ బ్రహ్మదేవుని యందును, తామసీమాయ దైత్యయక్షరక్షోగణము లందుండును.

వైష్ణవోపనిషత్తులు — విష్ణుపర్వతమును ప్రతిపాదించెడి పదునాలుగు ఉపనిషత్తులు.

1. అవ్యక్తోపనిషత్తు
2. కలిసంతరణోపనిషత్తు
3. కృష్ణోపనిషత్తు
4. గరుడోపనిషత్తు
5. గోపాలతాపన్యుపనిషత్తు
6. తారసారోపనిషత్తు
7. త్రిపాద్విభూత్యుపనిషత్తు
8. దత్తాత్రేయోపనిషత్తు
9. నారాయణోపనిషత్తు
10. నృసింహతాపిన్యుపనిషత్తు
11. రామతాపిన్యుపనిషత్తు
12. రామరహస్యోపనిషత్తు
13. వాసుదేవోపనిషత్తు
14. హయగ్రీవోపనిషత్తు

వంధ్య— వంజ లేక గొడ్రాలు, వంధ్యలు నాలుగు విధములు, (1) జన్మవంధ్య యను నామె బొత్తిగ బిడ్డలు కలుగని స్త్రీ (2) కదళి వంధ్యయను నామె ఒక్కబిడ్డను మాత్రముకని మరల గర్భమే ధరించని స్త్రీ (3) కాకవంధ్యయను నామె ఇద్దరు బిడ్డలను మాత్రమే కని మరల గర్భధారణలేని స్త్రీ (4) మృతవంధ్య చావుబిడ్డలను కనుచుండినను, లేక పుట్టిన ప్రతి బిడ్డ చచ్చుచుండినను నామెకీ పేరగును.

వంధ్యాపుత్రుఁడు- గొడ్రాలి బిడ్డఁడు. అనగా మిథ్య.

వింశతిముద్రలు- యోగశాస్త్రసంబంధమగు ఇరువదిముద్రలు.

1. మహాముద్ర
2. జాలంధరముద్ర
3. మహావేదముద్ర

4. యోనిముద్ర
5. తటాకముద్ర
6. అశ్వినీముద్ర
7. మాతంగినీముద్ర
8. నభోముద్ర
9. మూలబంధముద్ర
10. ఖేచరిముద్ర
11. వజ్రోలిముద్ర
12. మాండూకముద్ర
13. అశ్వపాశినీముద్ర
14. భుజంగినీముద్ర
15. ఉడ్యాణబంధముద్ర
16. మహాబంధముద్ర
17. విపరీతకరణిముద్ర
18. శక్తిచాలనీముద్ర
19. శాంభవీముద్ర
20. కాకముద్ర ఇత్యాదులు

**వ్యతిరేకసంజ్ఞ—** ఎవరియందును దేని యందును ఆశలేక తనంతట మోద భేదముల విడచిన రెండవస్థితి యగు బ్రహ్మ విచారమనియెడు స్థితప్రజ్ఞత్వము.

**వ్యభిచారము—** తప్పుదారిని నడుచుట. జారత్వము.

**వ్యష్టి—** ఏకత్వము, ప్రత్యేకము.

**వ్యాకృతము—** విస్తరించుట. ప్రకృతి యైనది సూక్ష్మాతిసూక్ష్మమై గోచరము కానట్టి దశయందు అవ్యాకృతమని యును, విస్తరించి బహిర్గతమైనపుడు వ్యాకృతమనియును చెప్పుదురు. ఒక వస్తువుయొక్క రెండవస్థలే యగును. కార్యకారణములవంటిది. (కార్యకారణయోరైక్యం వ్యాకృతా వ్యాకృతాత్మనోః) బాలుడే యువకుడైన వ్యక్తి మారదుగదా (బాల్యయువత్వస భేదేన దేవదత్తో నభిద్యతే) వ్యక్తము.

**వ్యాఖ్యానలక్షణషట్కము—** (1) పద పరిచ్ఛేదము జేయుట. (2) పదముల కర్థము జెప్పుట, (3) విగ్రహ నిరూపణము, (4) వాక్యముల ప్రయోజనము, (5) ఆక్షేపము, (6) సమాధానము. (పదచ్ఛేద పదార్థోక్తి-విగ్రహో వాక్యయోజనా, ఆక్షేపోఽథ సమాధానం వాఖ్యానం షడ్విధంమతం)

**వ్యాపకభగవన్నామములు —** నారాయణ, వాసుదేవ, విష్ణు, ఇత్యాది సర్వ వ్యాపకమగు భగవత్స్వరూపమును ప్రతిపాదించు నామములు.

**వ్యాహారము—** పలుకు వచనము.

**వ్యాహృతము—** పలుకఁబడినది.

**వ్యుత్థానదశ—** యోగములేనిదశ. వ్యుత్థానమనఁబడు చిత్తపరిణామమున నుండు సమయము.

**వ్యూహము—** సృష్టి, స్థితి, సంహారము లను, చేతనుల రక్షించుట, ఉపాసకుల ననుగ్రహించుట కొఱకు భగవానుఁడు సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధరూపములతోఁదోచునట్టిస్థితి. రచన, సైన్యమును నిలుపు పద్ధతి.

**వ్యోమచక్రము—** ఆకాశసముదాయము. భ్రూమధ్యము.

**శకటముద్ర—** ఒకచేతిపై నొకచేయి నుంచి బొటనవ్రేలు చూపుడువ్రేలు కలిపి చక్రాకారముగ రెండువైపులఁ బట్టెడి గాయత్రిముద్ర.

**శివాగమములు**— ఇవి ఇరువది యెనిమిది. ఒకటినుండి పదివరకు శివభేదములనియు, పదునొకటినుండి యిరువది యెనిమిదివరకు రుద్రభేదములని చెప్పఁబడుచున్నవి.
(1) కామికము (2) యోగజము (3) చింత్యము (4) కారణము (5) అజిత (6) దీప్త (7) సూక్ష్మ (8) సహస్ర (9) అంశుమాన (10) సుప్రభేద (11) విజయ (12) నిశ్వాస (13) స్వయంభు (14) అనిల (15) వీర (16) రౌరవ (17) మకుట (18) విమల (19) చంద్రజ్ఞాన (20) బింబ (21) ప్రోద్గీత (22) లలిత (23) సిద్ధ (24) సంతాన (25) శర్వోక్త (26) పారమేశ్వర (27) కిరణ (28) వాతులాగమములు. ఇవి శివాగమములు వైష్ణవాగమములు పాంచరాత్రములని, వైఖానసములని ద్వివిధములున్నవి.

**శిక్ష** — వేదములందలి అక్షరములను, శబ్దములను, ఉచ్చరించు తీరును వివరించినట్టి వేదాంగము. దండన.

**శీతలి**— పక్షిముక్కువలె పెదవులకుబైట చాపఁబడిన నాలుకచేత వాయువును పూరించి, సూర్యభేదనమువలె కుంభకసాధనఁజేసి, నాసిక ద్వారములచే మెల్లగ రేచించు కుంభక విశేషము.

**శీతాగ్ని**— పంచాగ్నులలో నొకటియగు హృదయమందుండునట్టి యగ్ని.

**శీర్షణ్యములు**— శీర్షమందు బుట్టిన నేత్ర శోత్రాదీంద్రియములు.

**శుక్లము**— ఓంకారము. తెలుపువర్ణము. రేతస్సు.

**శుక్లయజుర్వేదము**— వాజసనేయ సంహిత. ఇప్పుడీ వేదమునందు మాధ్యందిన శాఖయనియు, కాణ్వ శాఖయనియు, రెండుశాఖలు గలవు. ఈ రెండుశాఖల వారిని మనదేశమునందు సామాన్యముగ ప్రథమశాఖ వారనిచెప్పుదురు. ఈ శుక్లయజుర్వేదము నలువది యధ్యాయములుగల గ్రంథము. దీనికి శతపథ బ్రాహ్మణము, బ్రాహ్మణము అనిపేరు. ఈ వేదమంత్రములతో నధ్వర్యుఁడను ఋత్విక్కు యజ్ఞమునందు హోమాది ప్రధానకృత్యముల నాచరించును.

**శుక్తిరజితభ్రాంతి** — ముత్యపు చిప్ప వెండివలెనుండుటచే వెండియని భ్రమించుట, (శుక్తి = ముత్యపు చిప్ప.)

**శుద్ధచైతన్యము**— మాయోపాధి రహితమైన చైతన్యము.

**శుద్ధబ్రహ్మానందస్వరూప సమాధి** — అతద్వ్యావృత్తి రూప సమాధి.

**శుద్ధరాజయోగసమాధి** — ధ్యాన, ధ్యాత, ధ్యేయ, రహితమగు దశ. దీనిని సర్వశూన్యమనియు చెప్పుదురు.

**శుభాసనము**— పద్మాసనము.

**శుభేచ్ఛ**— జన్మాంతర సుకృత పరిపాకము వలనఁగలిగిన జ్ఞానముచే భవజలధిని దాటుటకు సజ్జనులనుఁజేరి వారిద్వారా తాపంబులఁదీర్చుకొనివారి యుపదేశమును పొంది సత్కర్మలు

వేదాంత విచారణలు గలిగి ముముక్షు వగుట.

**శూన్యకము** — కేవలకుంభకము.

**శూన్యము**— హృదయాకాశము.

**శేషి**— శ్రేష్ఠుఁడగు ఈశ్వరుఁడు.

**శేషి శేషత్వములు**— స్వామి భృత్యుల వలె సంభంధముఁగలది.

**శేషుఁడు** — శ్రేష్ఠుఁడుకాని జీవుఁడు. జీవుని భగవంతుఁడు తన యిష్టము చొప్పున వినియోగించుకొనును కావున జీవుఁడు శేషుఁడనబడును (యథేష్ట వినియోగార్థం శేషశబ్దేన కథ్యతే) సర్పవిశేషము.

**శైవసాంప్రదాయ సభాపంచకము** — పరమేశ్వరుఁడు తాండవముగావించిన సభాస్థలములని చెప్పబడుచుండు నైదు శివక్షేత్రములు. నటనముగావించిన స్థలములగుటచే నటరాజను పేరు గల మూర్తుల గలిగియున్నవి. (1) చిదంబరములోనున్న కనకసభ. (2) దక్షిణమధురలోనున్న రజితసభ. (3) తిరునెల్వేలియందు తామ్రపర్ణి నదీ తీరముననున్న తామ్రసభ. (4) మలయ పర్వతముయొక్క దక్షిణ భాగముననున్న చిత్రసభ. అనఁగ కుట్రాల జలపాతము వద్దనుండునది, (కుఱు + ఆలం) చిఱు మఱ్ఱిచెట్టు. న్యగ్రోధ భేదమగు నీ చెట్లకడనుండి ప్రారంభమగుటచే కుట్రాల జలపాతమని పేరుకలిగినది. (5) మదరాసునకు పశ్చిమమున 34 మైళ్ళదూరముననున్న తిరువాలంగాడు (వటారణ్యము) నందున్న రత్నసభ.

**శైవాగమప్రతిపాదిత గాణాపత్య మతషట్కము**— మహాగణపతిమతము (2) హరిద్రాగణ పతి మతము. (3) ఉచ్ఛిష్టగణపతిమతము. (4)నమనీతగణపతి మతము. (5) స్వర్ణగణపతిమతము. (6) సంతానగణపతి మతము.

**శైవోపనిషత్తులు** — శివపర్వతమును బోధించు పదునై దుపనిషత్తులు. (1) అక్షమాలికోపనిషత్తు, (2) అథర్వశిరోపనిషత్తు (3) అథర్వశిఖోపనిషత్తు (4) కాలాగ్నిరుద్రోపనిషత్తు (5) కైవల్యోపనిషత్తు (6) గణపత్యుపనిషత్తు (7) జాబాల్యుపనిషత్తు (8) దక్షిణామూర్త్యుపనిషత్తు (9) పంచబ్రహ్మోపనిషత్తు (10) బృహజ్జాబాలోపనిషత్తు (11) భస్మజాబాలోపనిషత్తు (12) రుద్రహృదయోపనిషత్తు (13) రుద్రాక్షజాబాలోపనిషత్తు (14) శరభోపనిషత్తు (15) శ్వేతాశ్వరోపనిషత్తు.

**శోభాశ్రియాసనము** — యోగపట్టతోఁ జేర్చి బంధించుకొని యుండుట.

**శౌచము**— శుచి. బాహ్యశౌచము. దేహశుద్ధి. అంతశ్శౌచము,భావశుద్ధి.

**శంకపాలుఁడు**— సర్పవిశేషము. దీనికి తలయందు త్రిశూలమువలె లేక అర్ధచంద్రాకృతిగల గుర్తుండును.

**శంకువు** — మఱ్ఱి, రావి, మున్నగు ఆకులు పండి రాలిసమీఁద కొంత కాలము మట్టియందు పూడియుండిన కొంతభాగము నశించి కేవలము నరములు ఈనెలు మాత్రము మిగిలియుండును. దీనిని శంకువందురు. మేకు.

**శంఖప్రక్షాళనము**— నోటితో నీరుత్రాగి గుదము గుండ విడుచుటయు, ముక్కులనుండ నీరుత్రాగి నోటిగుండ విడుచుటయు, ముక్కుయొక్క ఒక ద్వారముగుండ నీరుత్రాగి మఱియొక ముక్కుద్వారముగుండ విడుచుటయు శంఖప్రక్షాళనమందురు.

**శంఖముద్ర** — ఒకచేతి బొటనవ్రేలిని రెండవచేతి నాలుగు వ్రేళ్ళతో గప్పి మిగిలిన నాలుగువ్రేళ్ళు చాపి శంఖాకారముగఁబట్టు శాక్తసంబంధముద్ర.

**శాంతమూలము** — శాంతించిన ప్రణవము.

**శాంతవృత్తి** — వైరాగ్యము, శమము, ఉదారము, మున్నగు లక్షణములు గలవృత్తి.

**శాంతిత్రయము** — ప్రస్థానత్రయము.

**శాంతిమంత్రములు** — ఉపనిషత్ప్రారంభాద్యంతములయందు పఠించు శాంతి మంత్రములు. ఋగ్వేదోపనిషత్తులకు "వాఙ్మేమనసి" అనుశాంతి మంత్రమును. యజుర్వేదోపనిషత్తులగు శుక్లమునకు "పూర్ణమదః" అను శాంతి మంత్రమును, కృష్ణమునకు "సహనావవతు" అను శాంతిమంత్రమును సామవేదోపనిషత్తులకు 'ఆప్యాయంతు మమాంగాని" అను శాంతిమంత్రమును, అథర్వణ వేదోపనిషత్తులకు "భద్రంకర్ణే భిశ్శృణుయామదేవాః" అను శాంతిమంత్రమును పఠింపవలెను. శాంతిమంత్రమును గొని యుపనిషత్తువేదము తెలియనగును.

**శాంభవత్రియదీక్షలు**— క్రియాంతర్గత దీక్షలు, మను దీక్షాంతర్గత దీక్షలు, వేదదీక్షాంతర్గత దీక్షలు.

**శాంభవదీక్ష** — గుర్వును గృహమున మాత్రమే సంసిద్ధిని గలుగజేయునట్టి దీక్ష.

**శాంభవీముద్ర** —ప్రపంచముద్రలలో నొకటియగు బాహ్యదృష్టి అంతర్లక్ష్యము గలముద్ర. శంభువును పొందించునది. (అంతర్లక్ష్యం బహిర్దృష్టి ముద్రా భవతి శాంభవీ)

**శాంభవీశక్తి**— సుషుమ్నానాడి.

**శ్రద్ధ**— గురువులందును, వేదాంత శాస్త్రములందును. ఈశ్వరుని యందును, విశ్వాసముఁగలిగియుండుట. అక్కర.

**శ్రద్ధాత్రయము**— గురు, శాస్త్ర, నిష్ఠల యందలి శ్రద్ధలు.

**శ్రవణము** — వేదాంత శాస్త్రములను పెద్దలచే వినుట, లేక షట్ లింగ రూపయుక్తులచే వేదాంత తాత్పర్యమును నిశ్చయించుట.

**శ్రీ** — మంగళము, ఐశ్వర్యము, సరస్వతి, పార్వతి, శోభ, గౌరవము, సంపద, వృద్ధి, బుద్ధి, సాలీడు, మారేడుచెట్టు, అలంకరణము, సంగీతము

నొకరాగము, విషము, భృగుమహర్షికి ఖ్యాతియను భార్యయందు జనించి భార్గవియని పేరుగాంచి విష్ణుదేవుని పెండ్లియాడిన లక్ష్మి.

**శ్రీ చక్రము**— బిందు, త్రికోణాది నవ చక్రములు, నవావరణలు, వాని యధి దేవతలుగాఁగల్గిన శాక్తేయ సంబంధమగు చక్రము (త్రిపురతాపినీ ఉపనిషత్తునందు చూడుడు.)

**శ్రీ మద్భగవద్గీతకు పర్యాయ నామములు** – గీతా, గంగా, చ, గాయత్రీ, సీతా, సత్యా, సరస్వతీ, బ్రహ్మవిద్యా, బ్రహ్మవల్లీ, త్రిసంధ్యా, ముక్తగేహినీ, అర్ధమాత్రా, చిదానందా, భవఘ్నీ, భయనాశనీ, వేదత్రయీ, పరా, ఉ (అ) నంతా, తత్త్వార్థజ్ఞానదాయినీ॥

**శ్రుతి**— వేదము, వినికి, సంగీతమున కుపకరించు తంబురమున్నగువానిధ్వని.

**శ్రేయస్సు**— మోక్షసాధన జ్ఞానము.

**శ్రౌతకర్మలు**— దర్శపూర్ణిమాసలు, ఆధానము, అగ్నిష్టోమీయపశు యాగము, అగ్నిష్టోమము మొదలగు వేద విహిత కర్మలు, ఈ కర్మలుచేయు నపుడు యజమానునకు ప్రధానముగ అధ్వర్యుఁడు, హోత, ఉద్గాత, బ్రహ్మ అను ఋత్విక్కులు సహాయులై యుండ వలయును.

**సౌశ్రితి**— గురు శుశ్రూషలయందు సహనముగల బుద్ధి విశేషము.

**షట్కర్మలు**— (1) హఠయోగు లాచరించు ధౌతి, వస్తి, నేతి, త్రాటక, నౌలి, కపాలభాతి, అను కర్మలు.

(2) వైదికులాచరించు యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహములను కర్మలు.

**షట్ఛక్తి బీజములు** – హ్రాం, హ్రీం, హ్రూం, హ్రైం, హ్రౌం, హ్రః.

**షట్ఛక్తులు** – హృదయదేవి యను పేరుతో హ్రాం అను బీజాక్షరముగల సర్వజ్ఞశక్తి. శిరోదేవియను పేరుతో హ్రీం అను బీజాక్షరమును గూడి యుండు నిత్యతృప్తి శక్తి. శిఖాదేవి యను పేరును హ్రూం అను బీజమును గలిగిన అనాది బోధశక్తి. కవచదేవియను పేరును హ్రైం అను బీజాక్షరమును గూడిన సర్వ స్వతంత్ర శక్తి. నేత్రదేవియను పేరును హ్రౌం అను బీజమునుగల నిత్య మలుప్త శక్తి. అస్త్రదేవి యను పేరును హ్రః అను బీజాక్షరమునుగల అనంతశక్తి.

**షట్శాస్త్రములు** – తర్కము, వ్యాకరణము, ధర్మము, మీమాంస, వైద్యము, జ్యోతిషములు. (తర్కవ్యాకరణౌధర్మ శాస్త్ర మీమాంస మిత్యపి. వైద్యశాస్త్రం జ్యోతిషంచ షట్శాస్త్రాణి కథ్యతే)

**షట్కోశములు** – చర్మ, రక్త, మాంస, మేధ, మజ్జ, అస్థి మున్నగునవి.

**షడధ్వములు** – మంత్రాధ్వము, పదాధ్వము, వర్ణాధ్వము, తత్త్వాధ్వము, భువనాధ్వము. కళాధ్వములు. (అధ్వ మనగ మార్గమని యర్థము)

**షడభిజ్ఞత్వము** – దివ్యదృష్టి, దివ్య శ్రోత్రము, పూర్వనివాసానుస్మృతి, పరచిత్త జ్ఞానము, ప్రత్యక్ష విషయ

జ్ఞానము, ఆకాశగమనాదులు గలిగి యుండుట.

**షడశీతి పుణ్యకాలములు** - భారత యుద్ధమున భీష్ముని మరణమునకు సంబంధించిన విషయము, షడశీతి యనగ (షట్ + అశీతి) 86 అని యర్థము. సూర్యుడు, మిథున, కన్య, ధనుస్సు, మీనరాశులకు సంక్రమణ చేయుకాలములు, తులారాశి నుండి ప్రతి 86 భాగల కొక షడశీతి పుణ్య కాలము వచ్చును, అనఁగ ధనుస్సున 26 వ భాగయు, మీనమున 22 వ భాగయు, మిధునమున 18వభాగయు, కన్యలో 14 వభా గయు షడశీతి పుణ్యకాలములగును. కన్యలో మిగులు 16 భాగలు మహాలయములందురు. భీష్మాచార్యులు యుద్ధమున పడినది మొదలు ప్రాణమువదలిన దినము వరకు 86 దినములగును. శాంతి పర్వం ॥భా॥

**షడాధారచక్రములు**- మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము అనాహతము, విశుద్ధము, ఆజ్ఞేయచక్రములు.

(1) మూలాధారము- గుదమేఢ్రములకు మధ్య త్రికోణాకారమును వ శ ష స అను నాల్గక్షరములే నాలుగు దళములుగను గల పద్మమునకు కర్ణిక యందు భూబీజాక్షరమగు లం అను నక్షరముగలిగి, ఆ కర్ణికపై కుండలి యను పరాశక్తి యమరియుండు చక్రము. (గుదంమేఢ్రా తరాలస్థం। మూలాధారం త్రికోణకరి। శివస్య జీవరూపస్య స్థానంతద్ధిప్రచక్షతే, యత్ర కుండలినీనామ పరాశక్తి ప్రకీర్తితా)

(2) స్వాధిష్ఠానము- స్వ అను స ఓ ప్రాణవాచకము. ప్రాణముచే క్రాశమమైనది స్వాధిష్ఠానము (స్వస్య అధిష్ఠానం స్వాధిష్ఠానం) లింగమూలము నందు బభమయరల అను నారక్షరములే యారు దళములుగఁగల్గిన పద్మమునకు బ్రహ్మ అధి దేవతగ గల్గిన చక్రము. (స్వాధిష్ఠానాహ్వయం చక్రం లింగమూలే షడ శ్రకే)

(3) మణిపూరకము- నాభిస్థానమున మేఘచ్ఛాయగలదై, డఢణ తథదధన పఫ, అను పదియక్షరములతోఁగూడిన పది దళములుగల పద్మమును విష్ణు అధిదేవతగా నుండు చక్రము. (నాభి దేశేస్థితం చక్రం దశాస్త్రంమణిపూరకం)

(4) అనాహతము- హృదయమున "కఖగఘఙచఛజఝఞటఠ" అను పదిరెండక్షరములే రెకులుగా గల్గిన పద్మమునకు రుద్రుఁ డధిదేవతగఁ గలచక్రము. దీనినే పూర్ణగిరి పీఠమని చెప్పుదురు. (ద్వాదశారం మహాచక్రం, హృదయేచాప్య నాహతం। తదేతత్పూర్ణగిర్యాఖ్యం పీఠంకమల సంభవ)

(5) విశుద్ధము- కంఠస్థానమున అఆ ఇఈఉఊఋౠఌౡఏఐఓఔఅంఅః అను స్వరములు పదునారు దళములుగగలిగి జాలంధర పీఠమునకు స్థానమైన పద్మమునకు అధిపతి ఈశ్వరుడు.

(6) ఆజ్ఞాచక్రము- భ్రూమధ్యమందు రెండు దళములుగల కమలమునందును హంక్షం యను బీజములు.

ఈ స్థానమునకధిపతి సదాశివుఁడు. బుద్ధికి స్థానము. ఈస్థలమును మూడవ కన్ను అందురు. ఈ షడాధారచక్రములు వారివారి సంప్రదాయము ననుసరించి పెక్కు రీతుల వర్ణింపఁబడియున్నవి. ఇవి యన్నియు యోగిజన యూహాకల్పితములు.

మనుష్యశరీరములో నారు నాడీకేంద్రములున్నవి. వీనిని షడాధార చక్రములందురు. ఈ యాధార పద్మములకు దళములుఁగ వర్ణింపఁబడిన ఏబది యక్షరములు హార్మోనియంలోని రీడ్సు వంటివి. ఒక్కొక్క దళము కదలినపుడు ఒక్కొక్క అక్షరము శబ్దరూపమున బహిర్గతమగును. ఉదాహరణముఁగ అకుహ విసరజనీ యానాంకంఠః అనఁగ అ అను నక్షరము పలుకఁదలచినతోడనే కంఠ స్థానముననున్న విశుద్ధ చక్ర నాడీకూటమునుండి "అ" అను రేకు కదలును, అపుడు అకారశబ్దము కలుగును. ఇట్లే తక్కినవి. ఇట్టి రహస్య విషయముల కనిపెట్టిన పారదర్శులైన ఋషులు వందనీయులు.

**షడామ్నాయములు**— మంత్రశాస్త్రములందలి శ్రేష్టములగునట్టి పూర్వామ్నాయము, దక్షిణామ్నాయము, పశ్చిమామ్నాయము, ఉత్తరామ్నాయము, ఊర్ధ్వామ్నాయము, అనుత్తరామ్నాయములు.

**షడ్దర్శనములు**— గౌతమ కృతన్యాయశాస్త్రము, కణాదకృత వైశేషికము, కపిలకృత సాంఖ్యము, పతంజలికృత యోగము, జైమినికృత పూర్వమీమాంస, వ్యాసకృత ఉత్తర మీమాంసలు.

**షడ్వికారములు**— గర్భవాసము, జననము, వృద్ధి, పరిణామము, క్షీణము, మరణము.

**షడ్విధలింగములు** — ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వము, ఫలము, అర్థవాదములు, ఈ లింగముల చేత నుపనిషద్వాక్యములకు తాత్పర్యనిర్ణయము చేయఁబడును. లింగమనఁగ గురుతు అని యర్థము. (లీనమర్థంగమయతి తితి లింగం) అని నిర్వచనము.

**షడ్విధ వైష్ణవమతములు** — భక్త, భాగవత, వైష్ణవ, పాంచరాత్ర, వైఖానస, కర్మహీనాది మతములు.

**షడ్విధసమాధులు**— సవికల్పము, నిర్వికల్పములను ద్వివిధసమాధులే ఆరు విధములాయెను. అందుసవికల్పమున (1) బాహ్య దృశ్యాను విద్ధ సవికల్ప సమాధి (2) అంతరదృశ్యాను విద్ధ సవికల్ప సమాధి (3) బాహ్య శబ్దాను విద్ధ సవికల్ప సమాధి (4) అంతర శబ్దాను విద్ధ సవికల్ప సమాధి, నిర్వికల్పమున (5) బాహ్య నిర్వికల్ప సమాధి. (6) అంతర నిర్వికల్ప సమాధి (సవికల్పో నిర్వికల్ప సమాధిర్ద్వివిధా భవేత్ దృశ్య శబ్దాను విద్ధోయం సవికల్ప పునర్ద్విధా) అను విద్ధమనగ సంబంధమని యర్థము.

**షడీతిబాధలు**— అతివృష్టి, అనావృష్టి, మిడుతలు, పందికొక్కులు, చిలుకలు, సన్నిహిత రాజులు.

**షడూర్మలు**— ఆకలి, దప్పి, శోకము, మోహము, జర, మరణములు.

**షడ్వైరులు** — కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము.

**షడంగయోగములు**— ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు.

**షడంగములు**— మంత్రధ్యానమునకు పూర్వము మంత్రకర్త, దేవత, మున్నగు వారిని స్మరించి ధ్యానించిన మంత్రము ఫలప్రద మగునను విశ్వాసము గావున ధ్యానారంభమునకు పూర్వము ఋషి, దేవత, ఛందస్సు, బీజము, శక్తి, కీలకము స్మరింపవలసిన యారంగములు.

**షణ్ణవతితత్త్వములు** — జ్ఞాన, కర్మ, అంతరేంద్రియములు 14, భూతములు 5, జ్ఞానతన్మాత్రలు 5, నాడులు 10, అవస్థలు 5, మలములు 3, గుణములు 3, మండలములు 3, వాతపైత్య శ్లేష్మాదులు 3, రాగములు 8, చక్రములు 6, ధాతువులు 7, వాయువులు 5.

ఉపవాయువులు 5, కోశంబులు 5, నవరంధ్రములు 9, అంతు 96 తత్త్వములతో నీ శరీర మొప్పుచున్నది.

**షణ్మతములు** — భారతదేశమున వేదబాహ్యములగు పెక్కుమతము లుద్భవిల్ల దురాచారములకు ప్రజలు లోనైయుండినపుడు, శ్రీ ఆదిశంకరాచార్యులవారు దిగ్విజయము గావించి దుర్మతముల ఖండించినవి. పోను, అంగీకరించిన మతములారు. అవియే (1) శైవము (2) వైష్ణవము, (3) గాణాపత్యము (4) కౌమారము (5) శాక్తేయము (6) సౌరము లనంబడునవి.

**షణ్ముఖముద్ర**— ఐదువ్రేళ్ళను గలుపుచుఁజిటికెన వ్రేళ్ళను క్రిందికిఁజూపునట్టి గాయిత్రిముద్ర.

**షణ్ముఖీముద్ర**— కర్ణలోచననాసాయుగముల వ్రేళ్ళచేమూసి భ్రూమధ్యమున మనస్సు నుంచు ముద్ర.

**షోడశఋత్విక్కులు** — యజ్ఞకర్మల నిర్వహించుటకై నియమితులగు. (1) బ్రహ్మ. (2) బ్రాహ్మణాచ్ఛంసి, (3) అగ్నీద్రుఁడు, (4) పోతలు, (5) ఉద్గాత, (6) ప్రస్తోత, (7) ప్రతిహర్త, (8) సుబ్రహ్మణ్య, (9) హోత, (10) మైత్రావరుణులు, (11) అచ్ఛావాక, (12) గ్రావస్తుతులు, (13) అధ్వర్యుఁడు, (14) ప్రతిప్రస్థాత (15) నేష్ట, (16) ఉన్నేతలు.

**షోడశకర్మలు**-మానవులు గర్భవాసము మొదలు మరణ పర్యంత మాచరింపవలసినవిధులు, అవి (1) గర్భాధానము, (2) పుంసవనము, (3) సీమంతము, (4) జాతకర్మము (5) నామకరణము, (6) అన్నప్రాశనము, (7) చౌళము, (8) ఉపనయనము, (9) ప్రాజాపత్యము, (10) సౌమ్యము (11) ఆగ్నేయము, (12) వైశ్వదేవము (13) గోదానము, (14) సమావర్తము, (15) వివాహము, (16) అంత్యకర్మలు.

సజాతీయము — తనకు తన జాతి యైనది.

సత్ — పరబ్రహ్మము (సదేవబ్రహ్మ) నిలకడగానుండునది. అస్తియందురు.

సత్రియాగము — పదునేడుగురికి కంటెనుతక్కువకాని కర్తలచే నడుప బడు యాగము.

సత్రాయణము — బహుయజమానులు గలదియగు యాగము.

సత్యధృతి - శాశ్వతమైన దానియందుఁ గల బుద్ధి.

సత్యము- (ఏకమేవాద్వితీయం సత్యం) అద్వయుఁడగు పరమాత్మ. (యదస్తి తత్సత్యం) ఏది నిలకడగా నున్నదో యది. (సత్యం భూతహితం ప్రోక్తం, భూత హితమగు మాటలు చెప్పుట. నిజము.

సత్యయుగావిర్భవకాలము — సూర్యుఁడు, చంద్రుఁడు, బృహస్పతి, కర్కటరాశి లోఁగలియుకాలము. (విష్ణుపురాణం)

సత్యవచ— సత్యమును పలుకువాఁడు, గురుకులవాసానంతరము, ఆశ్రమాం తరమును పొందక, వ్రత, తీర్థస్నాన, శీలత్వములుఁగలిగియుండు బ్రహ్మచారి.

సత్వగుణము — జ్ఞానము, త్రిగుణ ములలో నొకటి.

సత్వాపత్తి — జ్ఞానభూమికా సప్తకమున మొదటి మూఁడుభూమికల నభ్య సించి, ఇంద్రియ సుఖములందాశను మాని, శుద్ధాంతరంగుఁడై, ఇతర సంకల్పములులేక, బ్రహ్మనిష్ఠయందు పట్టుఁదప్పకనుండునట్టి యపరోక్ష వృత్తి. ఈ తీరుననుండువారలే బ్రహ్మ విదులు. ఈస్థితిని సంప్రజ్ఞాత సమాధి యందురు.

సతీర్థుఁడు — ఒక గురునియొద్దనే చది వినవాఁడు.

సదోపవాసి — ఎప్పుడును భుజింపని వాఁడు. దినమునకు రెండుపూటలు మాత్రమే భుజింపుచు, మధ్యలో నేమియుఁదినక త్రాగకనుండువాఁడు. (ఇరుప్రొద్దుగుడుచుచు నెడనెడఁగుడు వక నుండు నాతండు సదోపవాసి)

సద్యోముక్తి — ఈ లోకమందే బ్రహ్మ విచారణఁజేసి జీవన్ముక్తినిఁబొందుట

సన్న్యసము — (1) తురియాశ్రమము లోకోపకారార్థమై సంసారమును త్యజిం చుట, జీవాత్మను పరమాత్మయం దనవరతము నైక్యముఁగావించి యుండుట (సదాజీవాత్మనో రైక్యం సన్న్యాసః పరికీర్తితః) (2) వాయువు ప్రకోపించి వాక్కు దేహము మనస్సు వీనిని నిరోధింపఁజేసి హృదయమునఁ బ్రవేశించు రోగవిశేషము. (3) ఓష ధులతో శుద్ధి పాదరసమును జేర్చి భాండమందుంచి చీలనిచ్చి మందాగ్నిచే పాకముజేయుట.

సన్న్యసోపనిషత్తులు — సన్న్యాస లక్షణము, విధి, అనుష్ఠానము, మహి మలగూర్చి తెలుపునట్టి పదునేడు

**సప్తసంతానములు**– తటాక నిర్మాణము, ధననిక్షేపము, అగ్రహార ప్రతిష్ఠ, దేవాలయ ప్రతిష్ఠ, వనప్రతిష్ఠ, ప్రబంధ రచన, స్వసంతానము.

**సప్తసామములు** — (1) హింకారము-హుం (2) ప్రస్తావ-ప్ర (3) ప్రణవ-అది (4) ఉద్గీథ-ఉత్ (5) ప్రతీహార-ప్రతి (6) ఉపద్రవ – ఉప (7) నిధన-ని.

**సప్తసోమయజ్ఞములు** – అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశి, వాజపేయము, అతిరాత్రము, అప్తోర్యామము.

**సప్తావస్థలు**— అజ్ఞానము, ఆవరణము, విక్షేపము, పరోక్షజ్ఞానము, అనర్థ నివర్తి, నిత్యతృప్తి.

**సబీజసమాధి** — చిత్తము అన్యపదార్థముల నాశ్రయించుకొని యుండుస్థితి, సవితర్క, సవిచార, సాలంబ, సంప్రజ్ఞాత, నిర్వితర్క, నిర్విచార సమాధులు, ఇవియన్నియు సమానార్థకములు.

**సమవాయబంధనము** — సంయోగ సంబంధములేకయే పరస్పరము గూడి యున్న పదార్థములు, ఎన్నటికిని విడుదలలేని చేరిక.

**సమాధానము** — శ్రవణాదుల వలనఁ దా గ్రహించిన వానియందు మనస్సు నిలుపుట. లేక సద్గురూపదిష్ట మహావాక్యార్థములను శాస్త్రములందు జూచుకొని మనస్సును దృఢపరచుకొనుట.

**సమాధి**– ఉన్మని అవస్థ. జీవేశ్వరైక్యము. ధ్యానము ధ్యానింపఁబడు వస్తువు నామరూపములులేక వస్తుమాత్రముగ ప్రకాశించుస్థితి. బ్రహ్మనిష్ఠ. నీటియందు ఉప్పుకరకి కలసి పోయినట్లు మనస్సు ఆత్మయందైక్య మగుట, (సలిలే సైంధవం యద్వా సామ్యం భవతియోగతః। తథాచమన సోరైక్యం సమాధిరభిధీయతే) శంకాపరిహారము, మాట్లాడకుండుట, వ్రతోప వాసము-అంగీకారము, కావ్యగతి. శవమును పూడ్చుట, చిత్తైకాగ్రము, (ధ్యాతృధ్యానేపరిత్యజ్య క్రమాద్ధ్యేయైక గోచరం నివాతదీపవచ్చిత్తం సమాధి రభిధీయతే)

**సమాధిపర్యాయనామములు**–సమాధి, ఉన్మని, మనోన్మని, అమరత్వము, లయము, తత్త్వము,శూన్యాశూన్యము, పరమపదము, అమనస్కము అద్వైతము, నిరాలంబము, నిరంజనము, జీవన్ముక్తి, సహజము, తుర్యము, తురీయము మున్నగునవి.

**సమాధిపరిణామము** – సర్వార్థతా-పరిణామము యొక్క లయము, ఏకాగ్రతా పరిణామముయొక్క ప్రారంభ సమయము.

**సమాధివలనఁగలిగినసిద్ధులు**– జన్మాదులను నిమిత్తముఁజేసికొని ఆకాశ గమనము, జలమువందుండుట, జీవచర్యలు లేక దేహము నుంచుకొని యుండుట. పరకాయ ప్రవేశము, చిరకాలము జీవించుట, వివిధాకారములు ధరించుట, ఇత్యాదులు.

**సమాధిసిద్ధి కారకములు**- జన్మములు, మూలికలు, మంత్రములు, తపస్సు, సమాధి ఇత్యాదులు.

**సమానవాయువు** - నాభిస్థానమున నున్న వాయువిశేషము.

**సమానాసనము** - ఒక పాదమును తొడయందుంచి వేరొక పాదమును గుహ్యముపై నుంచుట.

**సమావర్తనము** - సాంగోపాంగముగ వేదవిద్యను, ఉత్తమశిక్షను, పదార్థ విజ్ఞానమును, పూర్ణముగఁ బొందిన వాఁడై వివాహవిధాన పూర్వకముగ గృహస్థాశ్రమమును స్వీకరించుటకై విద్యాలయమును వదలి యింటివైపునకు వచ్చుట.

**సమిష్టి** - అన్నియు కూడియుండుట.

**సమ్ముఖోన్ముఖ ముద్ర** - చేతివ్రేళ్ళు కలియునట్లు ముడిచి అట్లు రెండు చేతులు ఒకదానికొకటి యెదురుగ నుండునట్లు పట్టెడి గాయత్రిముద్ర.

**సరస్వతి** - విద్యాధిదేవత, వాగ్దేవత, ప్రణవము, సుషుమ్నానాడి, ప్రకృతి. ఒకానొక అంతర్వాహిని యగునది. బ్రహ్మదేవుని భార్య.

**సర్పవిద్య**- అష్టనాగరాజులఁజూడుము.

**సర్వార్థత** - అనేక విషయములయందు పరిణమించు చిత్తధర్మము.

**సర్వాంగాసనము** - శిరమును భూమియందాని అనఁగా రెండుచేతులతో నడుమును పట్టుకొని, భుజములు మొదలు మోచేతులవఱకును గల భుజాస్కంధములను, గళమును, శిరముయొక్క వెనుకభాగమును, భూమియందుఁజేర్చి, (భూమియందు శిరముగలిగిన స్థితియందుండి) పాదములను మీఁదుగాఁజాచి యుంచుట. విపరీతకరణి.

**సవికల్ప సమాధి** - జ్ఞాతృజ్ఞాన జ్ఞేయములను త్రిపుటిగోచరముతో నద్వితీయ పరబ్రహ్మము నందు నంతఃకరణ వృత్తినిఁ దెలిసికొనుట. సబీజసమాధి. సంప్రజ్ఞాత సమాధి.

**సవిచార సమాధి** - పంచతన్మాత్రలు మొదలగు సూక్ష్మవిషయములను గుఱిచేసికొని, యివి యేకాలమందెట్టి స్వరూపముఁగలిగియుండెనని భావించుట.

**సవితర్క సమాధి** - స్థూలభూతముల లక్ష్యమును గుఱిచేసికొని, వీని శబ్దార్థ జ్ఞానభేదముచే వీనిలో దేనినుండి యేది పుట్టినదను కార్యకారణ భావములను విమర్శించునట్టి శబ్దార్థ జ్ఞానముల కూటమి.

**సహజ సమాధి** - నిర్వికల్ప సమాధి.

**సహజన్యతాదాత్మ్యము** - తాదాత్మ్య త్రయమును జూడుడు.

**సహజోలి** - వజ్రోలి ముద్రానిమిత్తము స్త్రీ సంభోగమైనపిదప, గోమయముచే సిద్ధపరచఁబడిన బూదిని దంపతులిరువురును లలాటము, నేత్రము, హృదయము, భుజములు, చేతులు మున్నగు నంగములందు బూసికొనుట.

**సాత్త్వికజ్ఞానము** - సర్వ భూతాంతర వర్తియగు నాత్మ యద్వయంబగు నవిభక్తమని యెఱుఁగుట.

**సాత్త్వికతపస్సు** - ఫలకాంక్షలేక దేవ గురు ప్రాజ్ఞులందు భక్తిఁగలిగి, శౌచార్జవ బ్రహ్మచర్యాహింసా ప్రవర్తకుఁడై యుండి, పరులకెగ్గు ఒనరింపని భాషణఁగల్గి ప్రితహితుఁడై, సత్య వ్రతుఁడై, వేదాధ్యయనము గల్గి యుండుటయు, ఆత్మనిగ్రహము మనోనైర్మల్యము గల్గియుండుటయు మనోవాక్కాయ తపస్సులగును.

**సాత్త్వికపూజ** - దేవతల పూజించుట.

**సాత్త్వికభావనలు** - కంఠావరోధనము, రోమాంచనము, స్వేదము, అశ్రువు, వైవర్ణ్యాదులు.

**సాధకుల పంచావస్థలు** - శ్రవణ, వరణ, స్మరణ, అపన, ప్రాపనదశలు.

**సాధన చతష్టయము** - నిత్యానిత్య వస్తువివేకము. ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాది షట్కసంపత్తి, ముముక్షత్వము.

**సాధన భక్తి** - భగవంతునియందు ప్రీతి కలుగుటకు నాచరింపఁబడు భగవన్నామస్మరణ, శ్రవణ, ధ్యాన, అర్చన, నమస్కారాదులు.

**సాధనయోగము** - మంత్ర, లయ, హఠ, రాగయోగములు.

**సాధనసాధ్యకర్తృత్వము** - ఎవఁడు పనులజేయునో యాతఁడే స్వయముగ సాధనములఁగైకొని కార్యముల నాచరించుట.

**సాధ్యభక్తి** - భగవంతుడే రక్షకుఁడని దృఢమైన నమ్మకముగలిగి యాత్మ సమర్పణఁ గావించుట.

**సానంద సమాధి** - చిత్తమునఁ ద్రిగుణములు లేశము మిగిలియుండు కాలమున నంతఃకరణ సత్వమును భావించుచుండుట.

**సాన్నిధ్యసాధ్యకర్తృత్వము** - తానేమియుఁ జేయకయే పరులచే సకలకార్యముల నిర్వహింపఁజేయుట.

**సామములు** — పాంచభక్తికములు, సాప్తభక్తికములు, స్తోభాగీతి విశిష్టములగు మంత్రములు.

**సామవేదము** - సామమనఁగ గానము. గానముఁ జేయదగు మంత్రములుగల వేదము. ఈ వేదమునకు వేయిశాఖలుండెనట. ఇపుడు ఒక శాఖమాత్రమే నిలచియున్నది. యజ్ఞకాలమున ఉద్గాతయను ఋత్విక్కు నీ మంత్రములతో గానమొనర్చి దేవతల స్తుతించును కావున నీ వేదమునకు ఉద్గాతృ వేదమని నామాంతరము గలదు. ఈ వేదమునకుఁ ఛాందోగ్యబ్రాహ్మణము మున్నగు బ్రాహ్మణ గ్రంథము లెనిమిది గలవు. (నవధాభేతితోఽథర్వవేద స్సామస్సహస్రధా.

**సామానోపనిషత్తులు** - అక్ష్యుపనిషత్తు, అధ్యాత్మోపనిషత్తు, అన్నపూర్ణోపనిషత్తు, ఆత్మోపనిషత్తు, ఆత్మబోధోపనిషత్తు, ఏకాక్షరయోపనిషత్తు,

కాషితక్ బ్రాహ్మణోపనిషత్తు, గర్భోపనిషత్తు, నిరాలంబోపనిషత్తు, పైంగలోపనిషత్తు, ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు, మాంత్రికోపనిషత్తు, మహోపనిషత్తు, ముక్తికోపనిషత్తు, ముద్గలోపనిషత్తు, మైత్రాయణ్యుపనిషత్, వజ్రసూచికోపనిషత్తు, శారీరకోపనిషత్తు, శుకరహస్యోపనిషత్తు, సర్వసారోపనిషత్తు, సావిత్ర్యుపనిషత్తు, సుబాలోపనిషత్తు, సూర్యోపనిషత్తు, స్కందోపనిషత్తు.

**సాయంసంధ్యాకాలము** - సూర్యమండలముయొక్క అర్ధాస్తమయము మొదలు, నక్షత్రములు ప్రకాశించు వరకు, మధ్యఁగల రెండు ఘడియల కాలము. (సాయంసంధ్యా ద్విఘటికా హ్యస్తాదుపరిభాస్వతః)

**సాయులు** - పరమహంసలు.

**సాలంబసమాధి** — సంప్రజ్ఞాతసమాధి, సవితర్క, సవిచార, సానంద, సాస్మిత, సాలంబ, సమాధులన్నియు సమానార్థముఁగలవి.

**సాలగ్రామములు** — సాలగ్రామమను పర్వతము నేపాళ-తిబెత్తు సరిహద్దున నున్నది. (సాలము = వృక్షములు. గ్రామము = సమూహము) వృక్షము లధికముగ నుండుటచే సాలగ్రామ పర్వతమను పేరుచే పిలువఁబడుచున్నది. ఈకొండనుండి యేటవాలుగా బారునదులలో బొరలివచ్చు శిలలు ఖండములై యరిగి గుండ్రముగనున్నగ సిద్ధమై కాకవేణీ, గండకీ నదులలో వచ్చి చిక్కుచున్నవి. ఇట్లు చిక్కెడి సాలగ్రామ శిలలు 58 విధములు, అందు 48 విష్ణురూపముగను 8 శివరూపముగను 2 శక్తి రూపముగను కనబడుచున్నవి. బ్రహ్మకైవర్త పురాణమున విష్ణువు పతివ్రతామతల్లియగు తులసిచే శిలారూపమౌనటుల శపింపఁబడి 19 రూపములుగ సాలగ్రామములాయెనని వచింపబడియున్నది. వీని శిలాశబ్దము లుప్తమై తాఁబుట్టిన పర్వతపు పేరుతోనే సాలగ్రామములనఁబడుచున్నవి. ఇవి యర్చావతారములుగ భావించి భక్తులచేఁబూజింపఁబడుచున్నవి.

**సాష్టాంగనమస్కారము** — పాదౌ శిరస్తథాహస్తౌ నికుంచముకుళాకృతీ మనోబుద్ధ్యభిమానశ్చ ప్రణామోఽష్టాగసంజ్ఞితః।

కరయుగములుచరణంబులు యురములలాటస్థలంబు యున్నతభుజ ముల్, సరిధరణిమోపి మ్రొక్కిన బరువడి సాష్టాంగమండ్రు పరమ మునీంద్రుల్॥

**సాస్మితసమాధి** — త్రిగుణ సంబంధరహిత చిత్తమున, శుద్ధసత్వమును మాత్రము భావించుటచే సత్వగుణము నశించి చిత్తమున చైతన్యశక్తి క్రమముగ వృద్ధియై చైతన్యశక్తి మాత్రము మిగిలియుండుట.

**సిద్ధాంతశ్రవణము** -వేదాంత పాఠముల వినుట.

బ్రహ్మైక్య ప్రతిపాదక మగు అగ్నినాడి యనఁబడు బ్రహ్మనాడి.

**సుషుమ్నానాడిపర్యాయనామములు**— సుషుమ్న, శూన్యపదవి, బ్రహ్మరంధ్రము, మహాపదము, శాంబవి, మధ్యమార్గము, శ్మశానము, స్థిరానాడి, విరజానాడి ఇత్యాదులు.

**సులీనత** — చిత్తభేదములఁజూడుడు.

**సుహృద్గుణములు** — శుచి, త్యాగము, స్నేహము, దాక్షిణ్యము, ఋజువర్తనము, శౌర్యాదులు.

**సూత్రధౌతి** — నూలుచేఁబేనఁబడిన, పాదములు మొదలు శిరము వరకు పొడవుగల దారమును నోటితో మ్రింగి కడుపులోనికి పోవునట్లుచేసి -యీడించి వెలికిఁదీయు హఠయోగు లాచరించు పద్ధతి.

**సూత్రము**— ప్రణవము, నూలుదారము, అర్థగాంభీర్యముగల సంగ్రహవాక్యము, ఆపస్తంబాది సూత్రములు.

**సూత్రలక్షణము** — అల్పాక్షర మసందిగ్ధం, విధిపద్విశ్వతో ముఖం అస్తోభ మనవద్యంచ, సూత్రం సూత్రవిదోవిదుః. (సంజ్ఞాచ, పరిభాషాచ, విధిర్నియమ ఏవచ, అతిదేశోఽధికారశ్చ షడ్విధం సూత్రలక్షణం)

**సూత్రాత్మ** — సూత్రములు అనఁగా, నూలుపోగులు వస్త్రమందుండు రీతి జగంబులోపల వ్యాపించియుండు పంచీకరణముఁజేయఁబడని పంచభూతముల కార్యమైన సమస్త సూక్ష్మ శరీరోపాధిఁగల పరమాత్మయగు హిరణ్యగర్భుఁడు.

**సూర్యకలాద్విషట్కము** — తపినీ, తాపినీ, ధూమ్రా, మరీచీ, జ్వాలినీ, రుచీ, సుషుమ్నా, భోగదా, విశ్వా, బోధిన్, ధారుణీ, క్షమా.

**సూర్యద్వారము** — సుషుమ్నా నాడి.

**సూర్యాకాశము** — మిగుల వేడిమికలిగి కోటి సూర్యకాంతుల చేఁదేజరిల్లుచుండెడి యాకాశము. పంచాకాశములలో నొకటి.

**సూర్యుఁడు** — పూర్ణిమనాడు రాత్రి నడినెత్తికి పైగా గగనమందున్న చంద్రుఁడు. (రాకా మధ్యగతశ్చంద్ర సూర్యరిత్యభి ధీయతే) భానుఁడు.

**సూక్ష్మప్రాణాయామము** — నిర్ణీత సంఖ్యకన్న తక్కువగఁజేయు ప్రాణాయామము.

**సూక్ష్మనాడులు**— మానవశరీర మందుండు మూడున్నర కోటినరములు.

**సూక్ష్మము** — ఓంకారము, ఈ యోంకారము నుచ్చరించిన నతిసూక్ష్మమును స్థూలమును నగు, చరాచర భూతముల యొక్క శరీరముల నధీనముఁజేసికొనుచున్నదిగాన, సూక్ష్మమని చెప్పబడెను.

**సూక్ష్మశరీరము** — అపంచీకృత పంచమహాభూతముల యొక్క పదునేడు తత్త్వములుగల లింగశరీరము. మనస్సు, బుద్ధి ప్రాణాదులైదు, కర్మేంద్రియములైదు, జ్ఞానేంద్రియములైదు వీనికలయిక.

**సంయమద్వాముఁడు** — అక్షిపురుష బ్రహ్మము.

**సంయమము**- ధారణ, ధ్యాన, సమాధు లొక్కటై యుండుట. (త్రయమేకత్ర సంయమః)

**సంయోగవిషము** — సమభాగములుగ కలిపిన తేనెయు, నేయియు, సామాన్య ముగ నివి రెండును మంచివస్తువు లైనను సమాంశములు మిలితమైన పుడు ప్రాణహరమగు విష మగు చున్నది. కావున నీ విషయమున హెచ్చరిక కలిగియుండవలెను.

**సంవర్తకాగ్ని** — మహాగ్రాసమను పేరుగల తురీయ పరమాత్మ.

**సంవాదిభ్రమ** — రత్నకాంతిని జూచి రత్నమని భ్రమించుట. ఒక వస్తువును మఱియొక వస్తువని భ్రమించినను లాభముఁగల భ్రమ.

**సంవిత్తు** — జ్ఞానము.

**సంశయాభావన** - వస్తు ద్వయమును ఒకదాని యందారోపించుట, ఉదా॥ చీకటిలో కొయ్య మ్రోడును జూచి స్థాణవో మనుష్యుఁడోయని సంశ యించుట.

**సంశ్లిష్టత** — చిత్ర రూప భేదములఁ జూడుడు.

**సంసక్తినామిక** — మొదటి నాలుగు జ్ఞానభూమికల యభ్యా బలముచే విషయ సంగము గుణత్రయ సంగ ములులేక బ్రహ్మనిష్టయందు పట్టు దప్పక నుండుట. ఈస్థితిని పొందిన వారిని బ్రహ్మవిద్వరు లందురు.

**సంస్తవము** — హృదయమందుగల రంధ్రము.

**సంస్కార్యము** — శుద్ధిచేయఁదగినది.

**సంసృతి** — సంసారము, జననమరణ రూప ప్రవాహము.

**సంహిత** - వేదమునకు సంహిత యనియు, బ్రాహ్మణమనియు, ప్రధాన మైన విభాగములు గలవు. అందు మంత్రములు మాత్రముగల భాగమే సంహిత. అర్థగాంభీర్యముగల మంత్ర ముల వివరించుచు వానిని పఠిం చుచుఁజేయవలసిన పనులను దెల్పు నవి బ్రాహ్మణములు. కృష్ణయజుర్వే దమునకు నీ లక్షణము సరిపోదు.

**సాంఖ్యమతము** - ప్రకృతి పురుషుల నంగీకరించుచు కపిల మహర్షి చే స్థాపింపఁబడిన మతము.

**సాంగము** — అంతఃకరణములగు మనో బుద్ధి చిత్తాహంకారములు.

**సాంపరాయము** — మరణానంతరము ఆత్మ దేనినిపొందునో యది (సమ్యక్ పరేకాలే ఈయత ఇతి సాంపరాయః) పరలోక గమన సాధన విశేషము.

**సాంప్రదాయసమాధి** — యోగి కోరిన పుడు శ్వాసమునుబంధించి శరీరమును నాడులను చలనములేక జేసి ప్రేతము వలెనుండి మరలజాగ్రదవస్థకువచ్చుట.

**స్నానపంచకము** - (1) ఆగ్నేయస్నానము అనఁగ విభూతిని శరీరమెల్లెడలను బూసికొనుట.

(2) వారుణస్నానమనఁగ నీటియందు మునిగి చేయుస్నానము.

(3) బ్రాహ్మ్యస్నానము - ఆపోహిష్టామయోభువః అను మంత్రమును పఠించుచుచేయు స్నానము.

(4) వాయువ్యస్నానము - సాయం సంధ్యాకాలమున గోవులు గృహాభిముఖములై వచ్చునపుడు వాని గిట్ట (డెక్క) ల నుండి లేచిన ధూళినిఁ బైఁబడునట్లు చేసికొనుట.

(5) దివ్యస్నానము - ఎండ కాయుచు వాన కురిసినపుడు నా వర్షమునఁ దడియుట. (స్నానాని పంచపుణ్యాని, కీర్తితాని మహర్షిభిః ఆగ్నేయం, వారుణం, బ్రాహ్మ్యం, వాయువ్యం దివ్యమేవచ. ఆగ్నేయం భస్మనాస్నానమ్, అవగాహ్యాచ వారుణం, ఆపోహిష్టేతిచ బ్రాహ్మ్యం, వాయువ్యం గోరజస్మృతం, యత్తుసాతపవర్షేణ స్నానం తద్దివ్యముచ్యతే॥

**స్నానాంగ పంచకము** - సంకల్పము, మార్జనము, వరుణసూక్తము, అఘమర్షణము, స్నానాంగతర్పణము.

**స్మృతి** - ధర్మశాస్త్రము. తలంపు.

**స్మృతివృత్తము** - ప్రమాణవృత్తిచే ననుభవింపఁబడిన విషయములు జ్ఞాపకమునకు వచ్చు వృత్తి. ప్రమాణ, విపర్యయ, వికల్పములనెడి మూఁడు వృత్తులును, జాగ్రదవస్థయు, బుద్ధికి ·చరము గానట్టిస్థితిని, నిద్ర లేక ·ప్నవస్థయనఁబడును. అరీతిగనే నా మూఁడు వృత్తులలోని విషయములు స్మృతిగోచరమై బుద్ధికి గోచరించుట స్వప్నావస్థయనఁబడును.

**స్వగతభేదములు**- అవునకు తన శరీరమునందే కొమ్ములు, చెవులు, కాళ్ళు మున్నగునవి యొండొంటికి భేదములగునట్టి విధము.

**స్వతసిద్ధ దేవతలు** - పూర్వకల్పమునఁ జేయఁబడిన పుణ్యకర్మ ప్రభావము వలన నీకల్పమందు దేవతలుగానే జనించినవారు.

**స్వప్రతీకోపాసనము** - చాయాపురుషోపాసన.

అకాశమున మేఘములులేక, నిర్మలముగ నెండ కాయునపుడు, ఉదయము పూట 9 గంటలకు లేక సాయంత్రము 3 గంటలకు, తనయొక్క నీడను రొమ్మునందు దృష్టియుంచి, రెప్పలార్పక పది నిమిషములపాటు చూచుచుండినచో నా నీడచుట్టు మత్తాబు వెలుగువలె జ్యోతి కనుపించును. అట్లు కనుపించినవెంటనే తల పైకెత్తి ఆకాశమును చూచినట్లైన, తన రూపము బాగుగ నచట కనఁబడును. అట్లు కనుబడు చాయాపురుషుని యవయవముల లోపముల గుర్తించి తనకు ముందు రానున్న కష్టసుఖముల నెరుఁగ వచ్చును.

**స్వప్నజాగ్రము** - అజ్ఞానభూమిక. మఱచినదానినిఁ దలఁచుట. పరమేశ్వరస్మారకమున మఱుగుపడి సంసారనిమగ్నితనుండు స్థితి.

**స్వప్నము**-కంఠస్థానమున తైజసుఁడను పేరుతో సూక్ష్మప్రపంచము ననుభవించు జీవుఁడు. అజ్ఞానభూమికయగు

5. ఈశాన్యముఖమునుండి యూర్ధ్వముగ వెడలిన జ్ఞానోపదేశ ప్రవాహమునకు కైవల్యమని పేరు.

**హకారము** – పురుషుఁడు, శివుఁడు ప్రాణవాయువు, తత్పదము, సూర్యుడు. పృథ్వీబీజాక్షరము.

**హఠయోగము** – హ కారము సూర్యుఁడనెడు ప్రాణవాయువు, ఠకారమనఁగ చంద్రుఁడనెఁడు అపాన వాయువు. ఈయుభయ వాయువులను నైక్య పఱచునట్టిది హఠయోగము. ప్రాణకళ, ప్రాణాయామముద్వారా హఠయోగము సిద్ధించుచున్నదని యర్థము.
(హకారః కీర్తితస్సూర్యః, ఠకారశ్చంద్ర ఉచ్యతే, సూర్యచంద్ర మసొయోగాత్ హఠయోగనిగద్యతే||

**హఠాత్సిద్ధులు** – అకస్మికముగ నిధినిక్షేపములఁగొని శ్రీమంతుఁడైన, బీదవలె నేదోకారణమున ముక్తులగు వారు.

**హరి** – అజ్ఞానమును లేక పాపములను హరించువాఁడు.

8. **హరిపద పుణ్యకాలములు** – వృషభ, సింహ, వృశ్చిక, కుంభరాసులందు సూర్యుఁడు ప్రవేశించునట్టి మాస సంక్రాంతులు.

9. **హవ్యకవ్యములు** – హవిస్సు అనగా నేయి, నేతితో సిద్ధపరచఁబడిన వస్తువులు. దేవతలకును పితృవులకు యోగ్యమైన యన్నమగు నీ హవ్యమును, స్వాహాయను మంత్రోచ్చారణతోఁ నగ్నియందు వ్రేల్చుట హవ్యమగును.

కవ్యము :– కవియనఁగ జలపక్షి, జలపక్షుల మాంసముతో సిద్ధపరచిన కూరలు కవ్య మనఁబడును. కవ్యవాహనాగ్నియందు కవ్యమును విశ్వేదేవతల స్థానమునను పితృదేవతల స్థానమునను నియమితులైన భోక్తలకు భుజింపఁజేయునవియె హవ్యకవ్యములు. పాఠీనము లనబడు చేపల కూరలను యజ్ఞములలో హవ్యకవ్యములతోఁజేర్చి పెట్టవలెనని మనుస్మృతి విధి.

**హవిస్సు** – అగ్నియందు వేల్వఁదగిన నేతితో వండిన వస్తువులు.

**హవిర్యజ్ఞములు** – అగ్న్యాధేయము, అగ్నిహోత్రము, దర్శపూర్ణిమాసలు, ఆగ్రయాణము, చాతుర్మాస్యము, నిరూఢ పశుబంధనము, సౌత్రామణి యజ్ఞములు.

**హస్తినాడి** – జిహ్వయందును, ఎడమ నేత్రమునందును గల నాడి.

**హిరణ్య గర్భుఁడు** – సమిష్టిభూత సూక్ష్మశరీరములతోఁగూడిన సూత్రాత్మ. వ్యష్టివాచకము తైజసుఁడు.

**హృదయము** – మనస్సు, ఱొమ్ము.

**హృదయకమలము** – ఱొమ్ముభాగమునకు క్రిందుగను, నాభికి పైభాగమునను గుండెలలో వ్రేలాడుచుండు తామరమొగ్గ రూపముననున్న మాంస పిండము. "పద్మకోశ ప్రతీకాశం హృదయం చాప్యథోముఖం" శ్రుతి.

**హృల్లేఖనము** – హ్రీంకార వాచ్యము.

**హృషీకేశుఁడు** – సకలేంద్రియాధిష్ఠానమగు ఆత్మ. (హృషీకాణాం ఇంద్రియాణాం ఈశః = హృషీకేశః)

**హేతుకర్త** - చేయించువాఁడు.

**హేయగుణకము** - విడువఁదగిన స్వభావముఁ గలది.

**హోతృపంచకము** - బ్రహ్మ, అధ్వర్యుఁడు, అగ్నీధ్రుఁడు, అచ్ఛావాకుడు, ఉద్గాత, వీరు యజ్ఞకార్యములం దుపయోగపడువారు.

**హంస సన్న్యాసి** - తీవ్రవిరాగులలో నొకఁడగు సన్న్యాసి. అర్చిరాది మార్గమున సూర్యలోకమును బొంది, అటనుండి బ్రహ్మలోకమును జేరి, అచ్చట బ్రహ్మవిచారణఁజేసి బ్రహ్మతోగూడ ముక్తుఁడగునట్టి పుణ్యపురుషుఁడు.

**హంస** - శ్వాసము, పక్షివిశేషము, సూర్యుఁడు, సన్న్యాసి.

**హంసపంచాక్షరి** - ఓం, హ్రీం, శ్రీం, హం, సం అను నైదక్షరములు గల మంత్రము.

**హంసదండము** - యోగదండము అనఁబడు లాతాము.

శ్వాసము కుడిముక్కునందాడుచున్నపుడు ఎడమముక్కునకు మార్చవలయుననినచో లాతామును కుడిచంకలో బెట్టి శరీరభారము దానిపై నానునట్లు చేసిన కొన్ని నిమిషములలో నెడమవైపునకు మారును. అదేరీతిగ నెడమముక్కునందాడు శ్వాసను కుడివైపునకు త్రిప్పవలెనన్నను ఎడమ చంకయందుంచి యూనినట్లైన కొన్ని నిమిషములలో కుడివైపునకు మారును.

**క్షణము** - ఒక ముహూర్తకాలము. నలువదియెనిమిది నిమిషములు. (ఈలెక్క యోగశాస్త్రమునకు మాత్రమే అన్వయము.)

**క్షపణకుఁడు** - జైన సన్న్యాసి (క్షపతి దూరం లజ్జామితి క్షపణకః) సిగ్గును వదలిన బిత్తలవాఁడు.

**క్షమ** - అన్యులచేఁ దన కపకారముఁ గలిగినను మనస్సున క్రోధము గలుగకుండుట, మనస్సును అరిషడ్వర్గమునకు లోనుగానీయకుండుట క్షమ యనబడును.

**క్షిప్తము** - రజోగుణ ప్రధానమై సుఖదుఃఖాది విషయములం బ్రవర్తింపుచు నస్థిరమైన చిత్తపరిణామ భేదము.

**క్షుదగ్ని** - నాభియందుండి యాకలిని కలుగఁ జేయునది. పంచాగ్నులలో నొకటి.

**క్షేత్రజ్ఞుఁడు** - క్షేత్రమనఁగ శరీరము. దానినిఁ గలిగినవాఁడు లేక ఎఱిగినవాఁడు.

**క్షేత్రము** - శరీరము. పంచభూతములు, బుద్ధ్యహంకారములు, దశేంద్రియములు, మూలప్రకృతి, జ్ఞానతన్మాత్రలు, మనస్సు, సుఖదుఃఖాసూయ ఈప్సితానుభవములకు కలుగు సంయోగము. లివియన్నియుఁజేరి క్షేత్రమనంబడును. స్థలము,పుణ్యక్షేత్రము, భార్య.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పజ్క్తి | విషయ శీర్షిక | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 2 | 2 | అజ్ఞానము | జలము | జలమున |
| 3 | 1 | అతివర్ణాశ్రమి | సన్యాసి | సన్న్యాసి |
| 3 | 23 | అథర్వణవేదోపనిషత్తులు | పరివాజ్ర | పరివ్రాజ |
| 8 | 29 | అర్థమాత్రాప్రణవము | అర్థ | అర్ధ |
| 11 | 19 | అష్టమదములు | యవ్వనవిద్యా | యవ్వన రూప విద్యా |
| 12 | 18 | అష్టవిధప్రాణాయామములు | అంతరేచకము | అంతర రేచకము |
| 12 | 33 | డిటో | నాకాసిగ్రము | నాసికాగ్రము |
| 19 | 22 | అః | సిద్థ | సిద్ధ |
| 19 | 23 | ఆకాశము | దిని | దీని |
| 19 | 30 | ఆకాశబీజము | పృథ్వీ | పృథ్వీ |
| 23 | 7 | ఇహాముత్రార్థఫలభోగ విరాగము | చతుష్టము | చతుష్టయము |
| 23 | 17 | ఈ | ధనస్సు | ధనుస్సు |
| 25 | 23 | ఉద్గీథమ్ | అశ్న | అన్న |
| 25 | 9 | ఉపపత్తి | ఉపనిషత్తి | ఉపపత్తి |
| 26 | 6 | ఊర్ధ్వపుండ్రములు | ఊర్థ్వ | ఊర్ధ్వ |
| 26 | 23 | ఊర్ధ్వపుండ్రార్థము | ఊర్థ్వ | ఊర్ధ్వ |
| 27 | 4 | ఊర్ధ్వము | ఊర్థ్వ | ఊర్ధ్వ |
| 27 | 5 | ఊర్ధ్వరేతస్కుఁడు | ఊర్థ్వ | ఊర్ధ్వ |
| 27 | 18 | ఋగ్వేద జన్మస్థలము | సింధూ | సింధూ |
| 28 | 11 | ఏకవింశన్మహా దీక్షలు 3 | వేత | వేద |
| 28 | 24 | ఏకాదశద్వారపురము | నాశికా | నాసికా |
| 29 | 5 | ఏకాదశరుద్రులు | అహిర్బుద్వుఁడు | అహిర్బుధ్న్యుఁడు |
| 29 | 9 | ఏకాదశేంద్రియములు | పదుకొండు | పదునొకండు |
| 31 | 23 | కల్పసూత్రములు | లననుష్ఠింప | లనుష్ఠింప |
| 32 | 22 | కాకి | జీవుఁడు | జీవుఁడు. |
| 33 | 25 | కామ్యవిద్యలు 2 | ఖఘవ | మఘవ |
| 33 | 5 | డిటో 12 | బృహదార్యము | బృహదారణ్యము |
| 36 | 5 | కృష్ణాజినము | ద్థరిణా | ద్ధరిణా |
| 36 | 12 | కైవల్యనాడి | మహప్య | మవాప్య |
| 37 | 28 | కుండలినీశక్తి | యూర్థ్వ | యూర్ధ్వ |
| 37 | 12 | కుండలినీ శక్తిపంచగతులు | నిహంగ | విహంగ |
| 37 | 13 | డిటో | మండూకగతి | మండూకగతి,సర్పగ |
| 39 | 23 | గాయత్రీ మంత్రము | దేవతార | దేవతాక |
| 40 | 19 | గౌణులు | చినరాజులు | చినముతరాజులు |

| పుట | పఙ్క్తి | విషయ శీర్షిక | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 66 | 32 | నౌలికర్మము | నాశికా | నాసికా |
| 67 | 31 | పదార్థము | యొదటను | మొదటను |
| 67 | 7 | పదార్థము 3 | శావాయం | శివాయ |
| 68 | 21 | పరమహంస | సన్యాసి | సన్న్యాసి |
| 69 | 8 | పరివ్రాజకులు | సన్న్యసలు | సన్న్యాసులు |
| 69 | 7 | పర్యంకాసనము | పచ్చిమ | పశ్చిమ |
| 69 | 9 | పర్వతాసనము | నూర్థ్వ | నూర్ధ్వ |
| 69 | 28 | పశ్చిమతానాసనము | రెండకాళ్ళ | రెండుకాళ్ళు |
| 70 | 7 | పశ్యంతీవాక్కు | వినికికి | వినికిడికి |
| 70 | 3 | పార్థివము | కాష్ట | కాష్ఠ |
| 70 | 33 | పిత్రుపంచకము | బెట్ట | బెట్టి |
| 72 | 2 | పూర్వతానాసనము | మడిమెలను | మడమలను |
| 72 | 24 | పంచకృత్యములు | పరమేశ్యరుఁడు | పరమేశ్వరుఁడు |
| 73 | 23 | పంచజనులు | నుచ్ఛరింప | నుచ్చరింప |
| 75 | 12 | పంచమహాపాతకములు | దొంగలించుట | దొంగిలించుట |
| 75 | 26 | పంచసరోవరములు | సరొవరము | సరోవరము |
| 87 | 22 | బ్రాహ్మణుఁడు | బ్రహ్మణుఁడు | బ్రాహ్మణుఁడు |
| 95 | 15 | మాత్ర | చందస్సు | ఛందస్సు |
| 98 | 27 | మోక్షభూమి | సమ్మతములను | సమ్మతములును |
| 98 | 4 | మౌనత్రయము | కాష్టమౌనము | కాష్ఠమౌనము |
| 100 | 1-12 | కృష్ణయజుర్వేదోపనిషత్తులు | 20-31 | 21-32 |
| 100 | 22 | యతి | సన్న్యాసి | సన్న్యాసి, |
| 101 | 13 | యుగము | లగునా | లగును |
| 102 | 14 | యోనిముద్ర | సంబంధమెన | సంబంధమైన |
| 103 | 4 | రసవాదము | సిద్ధిని | సిద్ధిని |
| 104 | 7 | రాజయోగము | యమ్మాద్య | యమాద్య |
| 104 | 31 | రుద్రాక్షలు | విథి | విధి |
| 106 | 7 | లింగమాత్ర | బుద్ధి | బుద్ధి |
| 106 | 9 | లింగము | పరిపూణ | పరిపూర్ణ |
| 106 | 9 | వరణము | స్వరూపమే | స్వరూపము |
| 107 | 14 | వశీకరణసంజ్ఞ | ప్రజ్ఞిత్వము | ప్రజ్ఞత్వము |
| 109 | 20 | వ్యానకాంజలిముద్ర | గాయత్రి | గాయత్రీ |
| 109 | 33 | వ్యాసులు | దిజ్యోతి | ఇదిజ్యోతి |
| 110 | 2 | వికల్పవృత్తి | విషయ | విషయమై |

| పుట | పజ్క్తి | విషయ శీర్షిక | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 110 | 22 | విజ్ఞానమయకోశము | తన్మాత్రలు | తన్మాత్రల |
| 111 | 9 | విధృతి | మూడు | మాడు |
| 111 | 21 | విధారణము | బట్టియంచు | బట్టియుంచు |
| 111 | 21 | విరజము | పరేతీనా | పరేలీనా |
| 111 | 25 | విరాట్టు | బడిన | బడని |
| 11 | 28 | విరాట్ప్రణవము | అర్థ | అర్ధ |
| 113 | 14 | వీణాదండము | వెన్నెముక, | వెన్నెముక. |
| 115 | 25 | వైష్ణవమాయ | రుదునిర్యంచు | రుద్రునియందు |
| 115 | 30 | వైష్ణవోపనిషత్తులు | విష్ణుపర్వత | విష్ణుపరత్వ |
| 115 | 5 | వైష్ణవోపనిషత్తులు 4 | గురుడోపనిషత్తు | గరుడోపనిషత్తు |
| 115 | 28 | వంధ్యాపుత్రుడు | మిధ్య | మిథ్య |
| 116 | 8 | వింశతిముద్రలు 11 | వంజ్రోలి | వజ్రోలి |
| 116 | 10 | వ్యాఖ్యానలక్షణషట్కము | వాఖ్యానం | వ్యాఖ్యానం |
| 116 | 15 | వ్యాహారము | పలుకు | పలుకు. |
| 117 | 21 | శవాసనము | నీవును | వీపును |
| 117 | 26 | శశశృంగము | మిధ్య | మిథ్య |
| 117 | 19 | శాలీనుడు | వృత్తులచె | వృత్తులచే |
| 118 | 19 | శివాగమములు | శివాగమములు | శివాగమములు. |
| 118 | 20 | శుద్ధచైతన్యము | మాయోపాది | మాయోపాధి |
| 119 | 7 | శేషిశేషత్వములు | సంభంధము | సంబంధము |
| 119 | 24 | శైవసంప్రదాయ షట్పంచకము | దక్షిణ | ఉత్తర |
| 119 | 3 | శైవాగమ ప్రతిపాదిత గాణాపత్యమతషట్కము | ప్రతిపాధిక | ప్రతిపాదిత |
| 119 | 6 | డిటో | నమనీత | నవనీత |
| 119 | 10 | శైవోపనిషత్తులు | శివపర్వమును | శివపరత్వమును |
| 119 | 14 | శైవోపనిషత్తులు | శైవలోపనిషత్తు | కైవల్యోపనిషత్తు |
| 120 | 7 | శంకరమఠములు | గోవర్థన | గోవర్ధన |
| 120 | 21 | శంకరమఠములు | అధరణ | అథర్వణ |

| పుట | పఙ్క్తి | విషయ శీర్షిక | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 121 | 10 | శంకరప్రశ్నోత్తరము | ముక్కులనుండ | ముక్కులగుండ |
| 121 | 10 | శాంభవదీక్ష | గుర్వ్యాను | గుర్వ్యాను |
| 122 | 16 | శ్రీమద్భగవద్గీతకు పర్యాయనామములు | జ్ఞాదాయినీ | జ్ఞానదాయినీ |
| 122 | 19 | శ్రేయస్సు | సాదన | సాధన. |
| 122 | 28 | శ్రాద్ధి | స్రాద్ధి | శ్రాద్ధి |
| 122 | 5 | షట్చక్ర బీజములు | హాోం | హూాం |
| 122 | 32 | షడభిజ్ఞత్వము | జానము | జ్ఞానము |
| 123 | 22 | షడాధారచక్రములు | స్వాధిపానము | స్వాధిష్ఠానము |
| 123 | 32 | షడాధారచక్రములు | మేడ్రాంతరాలస్థం | మేఢ్రాంతరాలస్థం |
| 123 | 33 | షడాధారచక్రములు 1 | త్రికోణకకరి | త్రికోణకం |
| 123 | 4 | షడాధారచక్రములు 2 | కాశ్రమ | కాశ్రయ |
| 123 | 17 | షడాధారచక్రములు 3 | దశాస్త్రం | దశాశ్రం |
| 123 | 20 | షడాధారచక్రములు 4 | రెకులుగా | రేకులుగా |
| 123 | 24 | షడాధారచక్రములు 4 | తదేతర్యూర్ణ | తదేతత్పూర్ణ |
| 123 | 32 | షడాధారచక్రములు 6 | భూామధ్య | భ్రూమధ్య |
| 124 | 22 | షడాధారచక్రములు 6 | పారదద్శ్యను | పారదర్శ్యను |
| 124 | 25 | షడామ్నాయములు | శ్రేప్టము | శ్రేష్ఠము |
| 124 | 6 | షడ్విధలింగములు | అర్ధవాదము | అర్థవాదము |
| 124 | 16 | షడాధారచక్రములు 6 | విసరజనీ | విసర్జనీ |
| 124 | 27 | షడ్విధసమాధులు | పునర్విధా | పునర్విధా |
| 125 | 25 | షణ్ణవతి తత్త్వములు | తత్వములతో | తత్త్వములతో |
| 125 | 28 | షణ్మతములు | విల్ల | విల్లి |
| 126 | 24 | షోడశచంద్రకళలు | జ్యోత్స్నా | జ్యోత్స్నా |
| 128 | 22 | సప్తతత్త్వములు | తత్వములు | తత్త్వములు |
| 129 | 5 | సమాధి | కరకి | కరగి |
| 131 | 28 | సామాన్యోపనిషత్తులు | అధ్యాతోప్యనిషత్తు | అధ్యాత్మోపనిషత్తు |
| 132 | 1 | సామాన్యోపనిషత్తులు | కాష్తక్ | కాషీతకీ |

| పుట | పఙ్క్తి | విషయ శీర్షిక | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 132 | 30 | సాలగ్రామములు | యరిగి | యఱిగి |
| 133 | 3 | సిద్ధపురుషులు | హఠాత్సిద్ధులు | హఠాత్సిద్ధులు |
| 133 | 6 | సిద్ధాసనభేదములు | మడిమను | మడమను |
| 133 | 7 | సిద్ధాసనభేదములు | మడిమెను | మడమను |
| 133 | 16 | సిద్ధాసనభేదములు | మడిమల | మడమల |
| 133 | 10 | సుఖాసనము | యశక్తులని | యశక్తులకని |
| 133 | 21 | సుషుప్తి | సానందము | సానందము |
| 134 | 23 | సూత్రిలక్షణము | మనవద్యంచ | మనవద్యంచ |
| 134 | 6 | సూర్యకలాషట్కము | బోధిన్ | బోధినీ |
| 136 | 28 | సంసక్తినామిక | యభ్యా | యభ్యాస |
| 136 | 30 | సంసక్తినామిక | బ్రహ్మనిష్ట | బ్రహ్మనిష్ఠ |
| 137 | 81 | స్థానశుశ్రూష | మనిషితో | మనీషతో |
| 137 | 13 | స్థాణానిఖననన్యాయము | శిద్ధాంతమును | సిద్ధాంతమును |
| 138 | 8 | స్వతస్సిద్ధదేవతలు | స్వతసిద్ధదేవతలు | స్వతస్సిద్ధదేవతలు |
| 138 | 31 | స్వప్నజాగ్రము | నిమగ్నిత | నిమగ్నత |
| 139 | 1 | స్వాధ్యాయత్రియము | ఉపాంశు | ఉపాంశు |
| 139 | 22 | స్తోత్రశాస్త్రములు | భాద | బాధ |
| 140 | 6 | హాకారము | పృధ్వీ | పృథ్వీ |



# ఆంధ్ర వేదాంత పరిభాషానుబంధము

**అధోముఖముద్ర** – రెండుచేతుల విప్పి అధోముఖముగఁబెట్టు గాయత్రీముద్ర.

**కూర్మముద్ర** – తాఁబేలువలె చేతులఁ బట్టు గా.ము.

**గ్రథితముద్ర**– రెండుచేతుల వెల్లకిలఁ జేసి వ్రేళ్ళతో వ్రేళ్ళు గ్రుచ్చి పట్టు గా.ము.

**చక్రముద్ర** – అనామిక వ్రేళ్ళను నడిమి వ్రేళ్ళను, ముడిచి, మిగిలిన వ్రేళ్ళను చాపి, ఒక చేయిపై మఱుచేయిని ఎదురెదురుగ బోర్లగించి పెట్టు శాక్తముద్ర.

**చతుర్ముఖముద్ర** – చూపుడు వ్రేళ్ళను కూడగలుపునట్టి గాయత్రీముద్ర.

**జ్ఞానముద్ర** – అఱచేతులఁబైకుండునట్లు చేసి, బటనవ్రేళ్ళు చూపుడువ్రేళ్ళతో గలిపి, మూఁడు వ్రేళ్ళను ముందుకు చాపి ధ్యానముతోనున్నట్లు పట్టు గా.ము.

**త్రిముఖముద్ర** – నడిమి వ్రేళ్ళను కూడకలుపునట్టి గాయిత్రీముద్ర.

**దక్షిణాయనమార్గము**– పితృయానము.

**ద్విముఖముద్ర** – చిటికెన వ్రేళ్ళను, అనామిక వ్రేళ్ళనుకలిపి మిగిలిన వ్రేళ్ళనువిప్పి యుంచు, గా.ము.

**నిదిధ్యాసము** – జీవన్ముక్తి సుఖప్రాప్తి కొఱకు పరోక్షజ్ఞానముకలిగి, అనవచ్ఛిన్నముగ నాత్మ ధ్యానము సేయుట.

**నిర్వాణముద్ర** – చేతుల మెలిక బెట్టి అఱచేతులఁగానరాకుండనుంచి, వ్రేళ్లతో వ్రేళ్ళగుచ్చి కలిపి, వానిని వ్రేళ్ళు ముడిచి దండము బెట్టునట్లుగ మఱలత్రిప్పి, చూపుడువ్రేళ్ళు రెంటిని విడదీసిచాపి, అయాకారముతోనే నెత్తిపైనుంచు శా.ము.

**పరిశేషము** – ఒక అర్థమునకు ననేకార్థములు ప్రాప్తమైనపుడు, అన్ని యర్థముల నిషేధించిన మీఁదట మిగిలిన యేకార్థము.

**పల్లవముద్ర** – అఱచేతిపై మోచేయి నుంచి మూఁడు వ్రేళ్ళు విడిగాఁజూపు గా.ము.

**పంకజముద్ర** – తామర మొగ్గ వలె హస్తములఁ జేర్చు శాక్తముద్ర.

**పంచముఖముద్ర**– ఐదువ్రేళ్ళను కలిపి పట్టు గాయత్రీముద్ర.

**పంచతపస్సు** – బాగుగ నెండకాయునపుడు తనకు నాలుగువైపుల నిప్పు ఁగిల్చి, మధ్యను గూర్చుండి, తలకు నెండ తగులు చుండ, ఉపయము మొదలు సాయంత్రము వఱకు, ఇష్ట దేవతను ధ్యానించు శాక్త సంబంధ తపస్సు. ఐదువైపుల వేడితగులుటచే పంచతపస్సనఁబడెను. (శ్రీరామకృష్ణ పరమహంస గారిభార్య శారదామాతగారీ తపస్సు నాచరించి యుండిరి)

**ప్రత్యగాత్మ** – జీవుఁడు (ఉపదమునకు వాచ్యార్థము జీవుడు, లక్ష్యార్థము కూటస్థుడు)

## శుభవార్త

మిక్కిలి సులభమార్గమున ఒక వారము దినములలోనే కుండలినీ
ప్రబోధము కలుగునట్టి యోగసాధనను నీగ్రంథ కూర్పరిచే
నేర్పఁబడును. బ్రహ్మరంధ్రమగు సహస్రారమునకు
కుండలిని చేర్చుటయే యోగముయొక్క ఉద్దేశ్యము.
వివరములు గ్రంథకర్తగారికి
వ్రాసి తెలిసికొనుడు.

ఓం తత్సత్

శ్రీ గౌతమీ జీవకారుణ్య సంఘ ముద్రాక్షరశాల, రాజమండ్రి.

**ప్రథమపరార్థము** — బ్రహ్మయొక్క ఆయుః ప్రమాణమున మొదటియేఁబది సంవత్సరములు ప్రథమ పరార్ధమనియు, రెండవ యేఁబది సంవత్సరములు ద్వితీయ పరార్ధమనియుఁ జెప్పఁబడు చున్నది.

**ప్రమాత** — ఆత్మాభాసముఁగల అంతః కరణము. ప్రమితి.

**ప్రలంబముద్ర** — రెండు చేతులను హృదయము వైపునుండునట్లు చేసి వ్రేలవైచు గాయత్రి ముద్ర.

**ప్రళయము** — బ్రహ్మదేవునికి రాత్రి కాలమును ప్రళయమనియు, పగటి కాలమును కల్పమనియు చెప్పుదురు.

**ప్రశాంతి** — కామక్రోధాది వృత్తులు ఉపశమించి శాంతచిత్తముతో నుండుట.

**మత్స్యముద్ర** — చేతిమీఁద చేయినుంచి మత్స్యాకారముగఁబట్టు గాయత్రి ముద్ర.

**మహాక్రాంతముద్ర** — సింహాక్రాంత ముద్రవలెనే దూరముగ విస్తరింపఁ జేయు గా. ము.

**మీమాంస** — విచారము. (ధర్మవిచారము గలది ధర్మమీమాంస. బ్రహ్మవిచారము గలది బ్రహ్మమీమాంస.

**ముద్గరముద్ర** — అఱచేతిపై మోచేయి నుంచి ఱోకలివలెఁబెట్టు గాయత్రి ముద్ర.

**ముష్టికముద్ర** — రెండుచేతులను గుప్పిటగఁబట్టుగాయత్రి ముద్ర.

**వైరాగ్యము** — అనిత్యములగు సమస్త భోగ్య వస్తువులయొక్క దర్శన, శ్రవణ, భోగములం దిచ్ఛ లేకుండుట.

**షడ్విధనాస్తికులు** — మాధ్యమికుఁడు, యోగాచార్యుఁడు, సౌత్రాంతికుఁడు, వైభాషికుఁడు, చార్వాకుఁడు, దిగంబరుఁడు. (వీరువేదము నంగీకరింపరు.)

**షోడశీపూజ** — శాక్తేయ మతమున తంత్రగ్రంథములలో నఖిలాండేశ్వరిని పదివిధములగురూపములతో పూజింప వచ్చునని విధింపఁబడియున్నది. అందు పదునాఱేండ్ల ఈడుగల కన్యను పూజా పీఠమందుంచి, యామెను జగన్మాత భావనతో నర్చించుట యొక విధాన మగును. దేవియొక్క పూజకు సర్హమగు రూపములపేర్లు, కాళి, తారా, షోడశీ, భువనేశ్వరి, భైరవి, ఛిన్నమస్త, ధూమావతి, బగళా, మాతంగి, కమలా అనునవి. దేవిని, నీరునింపిన గరిగ, విగ్రహము, యంత్రము, 16ఏఁడ్లకన్య, మున్నగువానిలో దేనినైననుఉపాసింప వచ్చును.

**సమిత్తులు** — ఫల పుష్ప ద్యూపహారములు.

**సామవేదస్వరములు** — క్రుష్ట, ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, మంద్ర, అతిస్వార్యా అనునవి. (ఇవి సంగీతమున నుపయోగించుసప్తస్వరములగు స, రి, గ, మ, ప, ధ, ని, లవలె నుపయోగింతురను కొనవచ్చును.

**స్వారాజ్యము** — స్వయం ప్రకాశమానైక స్వరూపము. (స్వేనైవ రాజిత ఇతి స్వ రా ట్, స్వ రా జః భావః స్వారాజ్యమ్.)

| పుట | పఙ్క్తి | విషయ శీర్షిక | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 40 | 24 | గ్రహములు | నవగ్రహములు | నవగ్రహములు, |
| 42 | 14 | చతుర్యుగములు | 21600 | 216000 |
| 42 | 15 | చతుర్యుగములు | 21600 | 216000 |
| 43 | 30 | చతుర్వ్యూహములు | అనిరుద్ద | అనిరుద్ధ |
| 44 | 3 | చతుర్వ్యూహములు | కేశమూర్తి | కేశవమూర్తి |
| 45 | 19 | చరమశ్లోకము | యుండనిచో | యుండినచో |
| 47 | 5 | చిదాభాసుఁడు | మిధ్యా | మిథ్యా |
| 47 | 27 | చంద్రకళాషోడశము | కామగ | కామద |
| 47 | 12 | చాంద్రాయణ వ్రతము | అమావాశ్య | అమావాస్య |
| 48 | 9 | జలదీవ్యము | సందేహించి | సందేహించిన |
| 48 | 20 | జలధౌతి | లాపవ | లాఘవ |
| 49 | 1 | జంగమము | తిరునది | తిరుగునది |
| 50 | 5 | జ్ఞానలింగము | అనాహాత | అనాహత |
| 50 | 20 | తత్ | సృష్ట్య అనంతరము | సృష్ట్యనంతరము |
| 53 | 9 | తురీయము | జీవున్ముక్తుఁడు | జీవన్ముక్తుఁడు |
| 53 | 11 | తురీయము | నార్దకములు | నార్థకములు |
| 54 | 13 | త్రిపుండ్రములు | మూఁధలేఖలు | మూఁడురేఖలు |
| 54 | 18 | త్రిరత్నములు | సమగ్దర్శనము | సమ్యగ్దర్శనము |
| 54 | 21 | త్రిదోషములు | అసంభములు | అసంభవములు |
| 55 | 28 | దశనామములు | నామాంతరమున | నామాంతమున |
| 56 | 33 | దశాంగధూపము | ధూపే | ధూపేన |
| 57 | 17 | దూ | చాండూరము | చాలదూరము |
| 57 | 17 | దేశక్లృప్త ప్రాణాయామము | నాశిక | నాసిక |
| 57 | 20 | డిటో | నాశిక | నాసిక |
| 57 | 22 | దేహళీ దీపన్యాయము | దేహత్ | దేహళీ |
| 59 | 9 | ద్వాదశతేజోలింగములు 8 | నాశిక | నాసిక |
| 59 | 11 | ద్వాదశతేజోలింగములు 9 | ఢామ | ధామ |
| 59 | 4 | ద్వాదశ నదీ పుష్కరములు | దనుః | ధనుః |
| 60 | 9 | ద్వాముష్యాయణుఁడు | ద్వామిష్యా | ద్వాముష్యా |
| 60 | 24 | ద్వివిధప్రారబ్ధములు | అభ్యుపగత | అనభ్యుపగత |
| 60 | 25 | ద్వివిధమార్గములు | మార్దములు | మార్గములు |
| 61 | 1 | నకులీశశైవము | శౌవము | శైవము |
| 61 | 3 | నకులీశశైవము | పాశపత | పాశుపత |
| 61 | 14 | నమస్కరింప గూడని సమయములు | నమస్కంప | నమస్కరింప |
| 66 | 28 | నేత్రత్రయము | భూమధ్య | భ్రూమధ్య |
| 66 | 29 | నేతికర్మ | నాశికా | నాసికా |
| 66 | 4 | నేతికర్మ | నాశికా | నాసికా |

లోకవాసనలం దగిలి పరమేశ్వర స్మారకము స్వప్నమువలె నుండు స్థితి.

**స్వప్నసిద్ధులు** – కలలో ప్రబోధము నొంది ముక్తులగువారు.

**స్వయంభులింగము** – మూలాధార చక్రమునుండి సుషుమ్నానాళమున ప్రవేశించుచున్న కుండలినీశక్తి.

**స్వరూప మనోనాశము** – రూపము చెడక నాశము నొందుట.

ఉదా :- అగ్నిచేఁ గాల్పఁబడిన బట్ట, బట్ట రూపముగఁ గనుపించినను ధరింప నుపయోగఁ పడనట్లు, త్రిగుణ రహిత మైన మనస్సుతోఁగూడిన బ్రహ్మవేత్తలు లోకవ్యవహారమున నున్నను, స్వరూప మనోనాశమును బొందుదురు.

**స్వర్గము** – (1) రుద్రుఁడు వసించు లోకము (2) ఆనందాత్మయగు పురుషుడుండు లోకము (3) దేవ లోకము.

**స్వస్వరూపులు** – ఆత్మస్వరూప మెఱిగిన నిత్యులు, ముక్తులు, భక్తులు, కేవలులు, ముముక్షువులు.

**స్వస్తికారోహణ దీక్ష** – శిష్యుని సిద్ధాసనునిగాఁ గూర్చుండ నియమించుట.

**స్వస్తికాసనము** – పిక్కలకును తొడలకును నడుమ రెండు పాదములను జొనిపి, శరీరమును చక్కఁగ నిక్కించి యుంచుట.

**స్వస్థుఁడు** – మూర్ఛ, తంద్ర, మున్నగు శారీరక మానసిక రుజలు లేనివాఁడు. (రుజ = రోగము)

**స్వాధ్యాయత్రయము**–వాచిక, ఉపాంశు మానసిక స్వాధ్యాయములు.

**స్వాధ్యాయము** – ఉపనిషత్తులు, శత రుద్రీయము, ప్రణవాది జపములు అధ్యయనముచేయుట.

**స్వాధిష్ఠానచక్రము** – లింగస్థానమున బ్రహ్మ యధిదేవతగఁగల యాధార చక్రము. (స్వ యనఁగ ప్రాణము. స్వస్య అధిష్ఠానం- స్వాధిష్ఠానం) ప్రాణమున కాశ్రయమైనది.

1. **స్వానుభవము** – స్వయముగ తానే యనుభవించి తెలిసికొనినది.

2. **స్వేదజములు** – చెమటవలనఁ బుట్టినవి.

8. **స్రోతశ్శాస్త్రములు** – పరమేశ్వరునికిఁగల సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములను నైదు ముఖములలోనధో భాగమునకునాలుగు ముఖములనుండి ప్రవాహమువలె బయలువెడలిన యుపదేశములు.

1. సద్యోజాత ముఖమునుండి భూతప్రేత పిశాచ భాదలనుండి విముక్తినొందుటకై భూతతంత్రమును,

2. వామదేవ ముఖమునుండి వశీకరణకుపయోగించు మంత్ర తంత్రౌ… ములఁ దెలుపు వామతంత్రమున

3. అఘోర ముఖమునుండి శ… జయించు సాధనములగు తంత్ర ప్రయోగములఁ దెలుపు తంత్రమును,

4. తత్పురుష ముఖమునుండి దష్టాది విషవిముక్తి సాధన దెలుపు గారుడ తంత్రమును,

**సేశ్వరసాంఖ్యులు** — పతంజలి మతమును, యోగమతమును నాశ్రయించినవారు. వీరు పరమేశ్వరు సంగీకరింతురు, తక్కినయంశములందు కపిలమతమే వీరిది. (స + ఈశ్వర = సేశ్వర)

**సోపక్రమకర్మ** — ఫలము నిచ్చుట కుపక్రమించిన కర్మ.

**సోమలోకము** — పరమేశ్వర స్థానము, చంద్రలోకము.

**సోమసూత్రము**— దేవాలయములందు అభిషేకజలాదులు వెడలి బయటికిపోవు జలదారి.

**సౌత్రాంతికమతము** — బౌద్ధమతము నందొక శాఖవారు అనుష్ఠించు మతము.

**సంకర్షణుఁడు** — జీవుఁడు, బలరామ మూర్తి.

**సంకర్షణవ్యూహము** — చతుర్వ్యూహముల జూఁడుడు.

**సంఖ్యాక్లుప్త ప్రాణాయామము** — రేచక, పూరక, కుంభకములు దినమున కిన్ని మారులని లెక్కించి చేయు ప్రాణాయామము.

**సంఖ్యాదీర్ఘ ప్రాణాయామము** — తాను నిర్ణయించుకొన్న సంఖ్యకన్న నెక్కువగఁజేయు ప్రాణాయామము.

**సంఖ్యాస్థానములు** — ఏకం, దశం, శతంచైవ. సహస్రమయుతం తథా॥ లక్షశ్చనియుత శ్చైవకోటి రర్బుదమేవచ, బృందఖర్వోని ఖర్వశ్చ శంఖ పద్మోచ సాగరః॥ అంత్యం మధ్యం పరార్ధశ్చ దశవృద్ధ్యాయథాక్రమం.

**సంచితకర్మలు** — పూర్వజన్మమునం దార్జించిన పుణ్యాపాపమిశ్రమ కర్మలు.

**సంజ్ఞానము** — అంతఃకరణమునందు ప్రతిబింబించిన చేతన భావము, సంజ్ఞప్తి.

**సంధ్య**- స్వప్నావస్థ, ఇహపరలోకములకు సంధియందున్నది గావున నీపేరుతో వ్యవహరింపబడెను. ప్రాతస్సాయం సమయములు. సంధ్యావందనము.

**సంపుటీముద్ర** - చేతులు మడిచి దగ్గర నుంచుకొను గాయత్రీముద్ర.

**సంప్రజ్ఞాతసమాధిబాహ్యాంగములు**_ యమ. నియమ, ఆసన, ప్రాణాయామ ప్రత్యాహారములు.

**సంప్రజ్ఞాతసమాధిఅంతరాంగములు**- ధారణ, ధ్యాన, సమాధులు. దేనిచే సంశయ విపర్యయములు లేక, ధ్యానించు వస్తువు యొక్క విశిష్ట స్వరూపము విశేషముగఁ తెలియఁ బడునో యది.

**సంప్రజ్ఞాతము** — ధ్యానింపఁబడు వస్తువుచక్కగా ననుభవింపఁబడుట.

**సంప్రజ్ఞాతసమాధి** — విజాతీయ ప్రత్యయ వృత్తులయొక్క అంతరాయములేనితైలధారవంటి అవిచ్ఛిన్నమైన సజాతీయ బ్రహ్మాకార వృత్తి ప్రవాహము.

**సంప్రసాదము** — సుషుప్త్యవస్థ జీవుఁడు.

**సంభూత్యుపాసన** — హిరణ్యోపాసన.

**సిద్ధపురుషులు** — ముక్తపురుషులు. వీరు స్వప్నసిద్ధులు, మంత్రసిద్ధులు, కృపాసిద్ధులు, హఠాత్సిద్ధులును, భేదములు గలవు.

**సిద్ధాసనభేదములు** — (1) ఎడమకాలి మడిమను లింగస్థానమందుంచి కుడి కాలిమడిమెను దానిపైనుంచి నాసాగ్రమును జూచుచుండుట.

(2) ముక్తాంతర సిద్ధాసనము – సిద్ధాసనమునకు మారుపేరు.

(3) వజ్రాసనము – పాదములు తొడల యందుంచి మోకాళ్ళపై చేతులు, వ్రేళ్ళు వెలికిల నుండునట్లు చాచి యుంచుట.

(4) ముక్తాసనము – కుడి యెడమకాళ్ళ మడిమల క్రిందు మీఁదుగఁజేర్చి యోనిస్థానమందుంచుట.

(5) గుప్తాసనము – సిద్ధాసనము.

(6) మత్స్యేంద్రాసనము – సిద్ధాసనము, మత్స్యేంద్రులకు ప్రియమైనది.

**సీత్కారి** — అష్టవిధ కుంభకములలో నొకటియగు నోటితో గాలిని పూరించి ముక్కుతో రేచించు పద్ధతి.

**సిద్ధాంతన్యాయము**-నిస్సంశయతనందిన పరిపూర్ణ సత్యము యొక్కరూపము (1) ఒకపక్షమువారికికాక నందఱికిని పనికివచ్చు సాముదాయకమైన సర్వమత సిద్ధాంతము, (2) ఒక మతమునకు లేక కొన్నిటికి మాత్రము పయోగఁపడు ప్రతితంత్ర సిద్ధాంతము. (3) అభ్యుపగమ లేక భావితయోచనా సిద్ధాంతము (4) సూత్రకారుని వలన వివాద మనవసరమని సంశయరహిత మొనర్పఁబడిన గర్భిత సిద్ధాంతమగు అధికరణ సిద్ధాంతము.

**సుకృతము**- మానవరూపము. మంచి పని. పూర్వపుణ్యము.

**సుఖమండలము** - సహస్రార చక్రము.

**సుఖాసనము** — ఏ ప్రకారముండిన సుఖముగను స్థిరముగ మండ గలుదుమో యాయాసనము. ఇది యశక్తులని తెలియునది.

**సుముఖముద్ర** - రెండుచేతులు దగ్గరకు జేర్చి నమస్కారమువలె పెట్టు గాయత్రిముద్ర.

**సురభిముద్ర** — చేతి చిటికెనవ్రేళ్ళు అనామికలతోను, నడిమి వ్రేళ్ళు బొటన వ్రేళ్ళతోను కలిపి బొటన వ్రేళ్ళను చేర్చియుంచునట్టి శాక్త సంబంధముద్ర.

**సుషుప్తి** - జీవుఁడు హృదయస్థానమున బ్రాజ్ఞుఁడను పేరుతోఁ జిత్తముతో సానందము ననుభవించు నవస్థ. (ప్ర + అజ్ఞ = ప్రాజ్ఞ.) అనఁగ నేమి యుఁదెలియని చీకటియందుండుస్థితి. అజ్ఞాన భూమికలలో నేడవది. జ్ఞాన భూమికలలో నైదవ భూమిక.

**సుషుమ్నానాడి** — బ్రహ్మదండి యను వెన్నెముక మధ్యమున మూలాధారము మొదలు భ్రూమధ్య స్థానమువరకు పోవుచున్నట్టి తామర తూడులోని నారవలె మిక్కిలి సూక్ష్మమై, ఇడా పింగళానాడులుకు మధ్యగతమై,

